శ్రీ



# మనోరమ

ఒకక్రొత్త యపరాధ పరిశోధక నాటకము.

గ్రంథకర్త

మ. రా. రా. శ్రీ. పొన్నలూరు సూర్యనారాయణశాస్త్రిగారు.

---

ప్రకాశకులు:- పర్వతనేని పెదనాగభూషణం,
గుళ్ళపల్లి వెంకట్రామయ్య,
కాట్రగడ్డ గోపాలకృష్ణయ్య గార్లు.

బెజవాడ స్వరాజ్య ముద్రాక్షరశాలయందు,

ముద్రింపబడినది.

మొదటి కూర్పు 1000 ప్రతులు.

వెల 1-4-0.

# రూపాయలను పండించుట



అనుదినమును విరివిగ అమ్మబడుచున్న వివిధ వస్తువుల జేయు పద్ధతులు ఆమ్నాయ పత్రికలో దెలుపబడుచున్నవి. పెట్టుబడివిశేష మగత్యము లేకుండగనే ఇల్లరునుండి చక్కని పరిశ్రమల సాగింపవచ్చును. ప్రతి పరిశ్రమయు నూటికి నూరుపైగా లాభము నీయగలవు.



## బానిసత్వముతో పనిలేదు

నిరుపేదలు సైతము నిర్వహించుకొన వీలగు పరిశ్రమలను యీ పత్రిక ప్రకటించుచున్నది కాన బ్రతుకు తెరువునకయి యొకరి నాశ్రయింప నగత్యములేదు. స్వతంత్ర జీవనోపాధిని గలిగించుకొన నిచ్చగలవారికీ పత్రిక కల్పవృక్షమువంటిది.

## సిరి రామోకాలడ్డవలదు

దేశమున నార్థిక పారిశ్రామిక వ్యాపారసంపత్తి నభివృద్ధిదశకు దెచ్చుటకై యీ పత్రిక ప్రారంభింపబడినది. అనుభవజ్ఞులగు విద్యాధికులు చక్కని వ్యాసముల వ్రాయుచున్నారు. ఈపత్రిక ధనలక్ష్మియొక్క యపరస్వరూపము. ఆమ్నాయపత్రికను స్వీకరింపక బోతివేని సిరిరామోకాలడ్డినవాడవగుదువు.

ఆమ్నాయపత్రికను చదువుము? ఐశ్వర్యవంతుడవగుము.

సంవత్సర చందా రు 2-8-0 లు మాత్రమే

మానేజరు,
ఆమ్నాయ పత్రిక, బెజవాడ.



# ఈ నాటకమునందు వచ్చు పాత్రల పట్టి.



పురుషులు:—

1 దేవేంద్ర విజయమిత్రుఁడు.

2 శచీంద్రుఁడు.

3 శ్రీశచంద్రరాయఁడు.

4 రఘువీర పాండ్యా } రక్షక భటులు.
5 జయసింగు }

6 తులసీదాసుఁడు—ప్లీడరు.

7 గోవింద ప్రసాదసేనుఁడు—శివపురపు డాక్టరు.

8 నవీనచంద్రుఁడు—ఆనందకుటీరము డాక్టరు.

9 రామకృష్ణ ముఖర్జీ—పోలీసు ఇన్‌స్పెక్టరు.

10 అరిందమబోసు—దేవేంద్రుని గురువు.

11 సుబ్బు—దేవేంద్రుని సేవకుఁడు.

స్త్రీలు:—

1 రేవతి—దేవేంద్రుని భార్య.

2 మనోరమ—ఆనంద కుటీరాధికారిణి.

3 కుముదిని—మనోరమ సోదరి.

4 జుమీాలియా—మనోరమనని చెప్పుకొన్న ఘాతుకి.

# MANORAMA.

## (A detective drama in 5 Acts)

ఈ గ్రంథములోని మొదటి నాల్గుఫారములును కైటిల్సున్నా స్వరాజ్య ముద్రాశాలయందును, మిగత ఫారములు శారదాభాండార ముద్రాశాలలోను, ముద్రింప బడినవి.

---

రుక్మిణీ కళ్యాణము.



ఒక చక్కని నాటకము. జి జాషువాగారిచే వ్రాయబడినది. వలయువారు మాపేర వ్రాసినఁబడయగలరు.

శ్రీ

# మ నో ర మ



(ప్రథమాంకము)

## నాం ది.

మ॥ సిరికిం బ్రాపయి, విశ్వవీక్షణకళా ♦ శ్రీణాప్రభావుండునై
సిర తేజోమయుఁడై దురధ్వగజనో ♦ ద్రేకప్రతిష్టంభధై
ర్యరమాలంబుఁడునై, వివేకయుతిమా ♦ యాహంతకీవంచనో
ద్ధురుఁడౌ, నాశ్రయణీయుఁడవ్విజయమి ♦ త్రుండిచ్చుతన్
శ్రేయముల్. ౧

(నాంద్యంతమునఁబ్రవేశించి)

సూత్రధారుఁడు—(సభకుఁబుష్పాంజలియిడి) సకలకళావిశారదులగు సభాజనులకు సాంజలినై విన్నవించుచున్నాఁడను. కాలాతిక్రమణమునకు సహింపుఁడు! రసికోత్తములరగు తామే నాటకమును ప్రదర్శింపుమనుచున్నారని? (సభకుఁ జెవియొగ్గి విని) ఆఁ ఏమా?

చ॥ నఖములు దంతపాళినయ ♦ నద్వయియున్ వికృతంబులైయు మే
యఖరతరోగ్రరూపులగు ♦ నాశరు లీకలివేళ లేరు: స
మ్ముఖమున సజ్జనత్వమును ♦ బొల్పుగఁజూపెడు దుష్టుఁ డేపరో
ముఖవిషకుంభ మంచు జన ♦ ముల్ వచియింతురు శ్రుతిప్రియం
బుగన్.

కావున నట్టి వింతమానుసుల చరిత్రమేదియైనఁ బ్రదర్శింపుమనుచుంటిరా? మీచిత్తానుసారము నెఱవేఱ్పఁదగుఁగాక! ఇంకొక విన్నపమున్నది. అదియుఁ గూడ నవధరింపుడు! కవి, తన భావనాపటిమచే నేర్పైన నొక నాటకము నురచించినపుడు నటు లద్దానఁగల లోపముల సవరించుకొని నాటకముయొక్క మెఱుఁగుపెట్టి ప్రదర్శించుట ధర్మము! గుణాగుణవిమర్శన నిపుణులగు తమకింతకంటెను విన్నవింపఁదగినదేమున్నది? [తెరవైపునకుఁ గవిమొగ్గి] ప్రేయసీ! యింకను నీయలంకరణము పూర్తినొందలేదా? విలంబమున కోర్వమిని సూచించుచు సభాసదులు మాటిమాటికిని కరతాళధ్వనులు చేయుచున్నారు!

నటి— [ప్రవేశించి] ఎంతయలంకరించుకొనుచున్నను నిలువుటద్దమున నొక్కసారి చూచుకొనునప్పటికి ఏదియో దిద్దుకొనవలసివచ్చుచున్నది.

సూత్ర— కవియును గావ్యము నిర్దిద్దుకొనుచుండినయెడల నతనిజీవితకాలమునఁ గావ్యము ప్రపంచమునఁ బచరింపఁగలదా? అట్లయిన నటిఁడేమాత్రము రచింపఁగలడు? నటుఁడేమాత్రము ప్రదర్శన నైపుణ్యముఁ బ్రదర్శింపఁగలఁడు? సభ్యులింక నొక్కింతయు విలంబనము కోర్వఁజాలరుసుమీ!

నటి— [నవ్వి] రామభజనము సేయుచున్నారేమో యనుకొంటిని. ఆచప్పట్లుచఱచుటకుఁ గారణమిదియా? అట్లయిన నిఁక ప్రారంభింతము! సభ్యులేమని యాజ్ఞాపించిరి?

సూత్ర— "ఆధునిక మానవజీవితములలో బహిరంగముగఁ జోరులవలె నటించి యంతరంగమున మాంత్రికులయిన వింతమనుష్యుల చరిత్రముఁ బ్రదర్శింపు" మని వారియనుమతియైనది.

నటి— కృష్ణా! రామా! గోవిందాయను భక్తిరసప్లుతములగు నాటకములకుఁ బ్రవేశింపక యిట్టిదారుణచరిత్రముల నరితములఁజూడఁ గుతూహలపడుచున్నారా సభ్యులు? ఇదియు సంతృప్తికరమే! అయిన మనమేనాటకమును బ్రదర్శింతము?

సూత్ర— [చకితుడై] భయంకరచరిత్రముఁ బ్రదర్శింపవలెనవచ్చెనే యనుభయమున మనసు చెదరిపోవుచున్నది. అట్టినాటకము లోక కొన్నియుండవచ్చును. అందును, దుర్భేద్యరహస్యములతో నిండిపోయిన నాటకము. [ఆలోచించును]

సూత్రి—నన్నడుగ నేల? ఎడతెగక యుదయించుచున్న యీ స్వేదజలమే ఋతువున సంభవింపఁగలదు?

నటి—సరియేయిఁకఁ బాడెదను.

—♦ కవిరాజ విరాజితము ♦—

జలజహితుండు ప్రచండకరంబుల ♦ సర్వముఁగాల్చిన నేమి? నదీ
తిలకము జహ్నుకుమారి సమున్నత ♦ దివ్యతరంగము లున్నవె హా
యులయికతోఁ బని లేదు జనంబున; ♦ కంబుజసౌరభ సమ్మిళితో
జ్జ్వలజల యంత్రసముద్గతవారికణ ♦ జాలము జాలములన్ వెలయున్॥

సూత్రి—[ఆనందముతో] ప్రేయసీ! నాసూర్యాంశు కిరణములును నీగానామృత సేవనముచేఁ బరిశాంతి పరిమోదపులకితములై యున్నవి. ఈగ్రీష్మర్తు మధ్యాహ్న చండకిరణసంజనితతాపము నంతయు దాఁగి వలసివచ్చుచున్నది.

(తెరలో)

ఓయీ! యేల యీ యనర్థకవచనములు? ఎందుడాఁగినను మీకు వేఁడి వెలుంగు దెబ్బలఁ దప్పించుకోవరాదు.

తే॥ సకల జీవుల బ్రదికింపఁ ♦ జాలు నినుఁడు
తనకరంబుల నెల్లభూ ♦ తములఁదాఁకు
నతని రూపము స్త్రీత్రిత ♦ యంబుగాదె?
యమృతకిరణుని కరములం ♦ దతఁడు లేఁడె?॥ ౪

సూత్రి—[విని] ఒడలెఱుఁగని యావేశముచే నాక కొన్నిరహస్యములు వెలిపుచ్చితిమి. అదుగో శచీంద్రుఁడేవిరో పన్నాగములఁ బన్నుచున్నాఁడు. కావున వేషాంతరధారులమై యుందము రమ్ము.

[ఇరువురును నిష్క్రమింతురు]

ఇది ప్రస్తావన.

## ప్రథమాంకము.

(రంగము:—దేవేంద్రవిజయమిత్రుని యాలోచనామందిరము.)

శకీం.—[పూర్వోక్త పద్యమును మఱలఁజదివి] [స్వగ] ఈదద్దమ్మ తెంపుడాఁగినపేమి? నిరూపకుని యసాధారణ మేధావిలసనముముందర వీరిరహస్యములు పటాపంచలు గాకుండునా? ఆఁ! ఎంతెంత సాహసకృత్యములు జరుగుచున్నవి? కలిప్రవేశమయి యింతకు నైదువేలవత్సరములయినను గాలేదు. అప్పుడే కల్పాంతసూచకములగు వినాశకప్రయత్నములా? ఏమి పెద్దమనుష్యులు! ఏసభకుఁబోయినను నచ్చటియధ్యక్షులో యుపన్యాసకులో వీరైయుండవలెయును! పగలెల్లఁబనిచేసి రాత్రులు రహస్యస్థలంబున మద్యపానప్రమత్తులయి జూదమునఁగడపుచున్నవారు! ఆహా! భారతవర్షము నేఁటికిట్టి పుత్రులను గన్నదా? (ఆలోచించి) కానిమ్ము! వీరిదుండగములు త్వరలో వినాశము నొందకపోవు! ఈపాపాత్ములు తగుశిక్షలకుఁ బాల్పడకపోరు! పరిపాలకులు రాజ్యము నెంతనిష్కంటకముగఁ జేయఁదలఁచుచున్నారో పరిపాలితులంత సంకటకముఁ జేయఁ బ్రయత్నించుచున్నారు! ఊఁ... పూర్వమునను నిట్లె యక్కడక్కడ జరుగుచుండెడివి! కాకున్నచో రక్షకభటుల యుపయోగమేమున్నది? ప్రతిజీవియు సుఖపడవలయుననియే ప్రయత్నించును. తనప్రయత్నమున కేప్రాణి యడ్డుగనుండునో యాప్రాణినైన హింసింపవలయుననియే చూచుచుండును. కాంతాకనకములు రెండును సుఖమునకును దుఃఖమునకును మూలములని పెద్దలు చెప్పుదురు! కావుననే

తే॥ త్రాఁగుబోతులొక్కెడను హం ♦ తకులునొకట
దారుణచరిత్రులైన జూ ♦ దరులు నొకట
రేఁబవళ్ళు వర్తించి ని ♦ ద్రింపనీరు
రాజభటులు నెన్నఁడును నై ♦ రంబుఁగలఁచి॥ ౫

అసాధారణ మేధాశాలులును-పరవక్రపరాక్రములును ఆర్యసమ్మతచరిత్రులునగు నరేంద్రము-దేవేంద్ర విజయమిత్రులే లేకున్నచో నీనగరమంతయు నొక్కమాఱే గంగాజలంబులనో సాగర సలిలంబులనో మునింగిపోయియుండెడిది! (రొమ్ముపైఁజేయి వైచికొని) ఎన్ని సంకటములు సంప్రాప్తించుచున్నవి? ... అయినను నమ్మహామహుల కృపావిశేషముచే నింతవఱకు విజయమునే పొందఁగలుగుచుంటిని. (మేజాయొద్దనున్న కుర్చీపైఁ గూర్చుండి వ్రాయుచు) ఈదుష్టులొక్కొక్కరుగఁ దమ స్వీయచరిత్రను వ్రాసికొనిరేని వానిసారాంశము రావణ మైరావణా

దుష్కంటకులను మిన్నలని భ్రమపడఁగలదు... ఒక్కఁడనేఁగి యెందరిచేతనో సుప్పలాంఛియు వారి దారుణతంత్రములను బయల్పరుపఁగలుగుచున్నాను.

అపరాధనిరూపణమువంటి భయంకరకఠినకార్యము వేఱొకటిలేదు. నిరూపకునివంటి పవిత్రబుద్ధి వేరొకఁడుండుటయుఁ గష్టము! (తెర వైపుఁజూచి) మామ యుండే యరుదెంచుచున్నాఁడు. (లేచినిలువఁబడును)

(దేవేంద్ర విజయమిత్రుఁడు ప్రవేశించును)

శచీ.—(దేవేంద్రునకు నమస్కరించును)

దేవే.—వత్సా! చిరంజీవివగుము!

శచీ.—మీకొఱకెదురు చూచుచున్నాఁడను.

దేవే.—(చేతులతో నిమురుకొనుచు) శచీంద్రా! నిన్ను నేఁడు కఠినకార్యములకు నియోగించుచు నీవు సుఖముగ నరుదెంచువంతకును మిగులవగచుచుందును.

శచీ.—మీవంటి యుత్తమమేధాశాలి మేనల్లునకుఁ గూడఁ గఠినకార్యములుండునా?

దేవే:—అట్లనకుము! నీకును—నాకును—మన తలఁదన్నిన యెందఱమునకును దలమీఱిన కఠినకార్యములనేకములున్నవి. ఎండలు ప్రచండములుగ నున్నవి. (ఆకాశముతో) వత్సా! నీవేఁగినపనియేమైనది. విజయమేనా?

శచీ:—మామా! న్యాయవాదులని పేరుఁబెట్టుకొన్న యన్యాయవాదులు కొందఱును, శాస్త్రజ్ఞులు బిరుదములఁ గట్టుకొన్న హంతకులును, భగవద్భక్తుల పేరుఁబెట్టుకొన్న మద్యపానప్రియమత్తులును లెక్కకుఁ దగఁజూచినను గనఁబడుచున్నవారు! కొందఱ అనివార్యములు నిర్ణయింపరానివై యున్నవి. ఇట్టిసంఘము లొక్కఁడు నొక్కఁడుఁ గనఁబడుచునేయున్నవి. వారి వేషభాషలనుబట్టి పతితులనక తప్పదు. చేతులలో కత్తులు జేబులలోఁ గత్తులు. వారు సమావేశమైనపుడు వారిదగ్గఱకుఁ గాని సమలు జూచితీరవలయును. ఇందుండుపుడు గత్తులు కొందరు. రామ రామా! ఇట్టి భయంకరప్రపంచములున్నవని యితఃపూర్వము వినసైనలేదు.

దేవే:—సాధుత్వాసాధుత్వములు గనిపెట్టవలయుననిఁ దగినంత చాల విశ్వాసముతో బనిసేయవలయును.

శచీ:—ఈదినమున నేనొకజూదగాండ్ర సంఘముతోఁ జేరి వారల రహస్యములు కొన్ని గ్రహించితిని. అన్నియు దొంగతనమే పరమావధిగాఁ బ్రబలుచున్నవి.

రేవ—ఎప్పటికో? శయనమందిరమునకు

దేవే—(పరిహాసముతో అరోక్తియుండే) పగలు శయనమందిరములోఁ బని యేమున్నది? నేనిప్పుడు రాఁజాలను. ఆవస్తువు నిచ్చటికే తెమ్ము.

రేవ—సఖా! తీసికొనివచ్చెదఁగాని ఆసుందరవస్తువునుజూచి నన్ను మఱచిపోయెదరేమో! మీ ప్రియురాలు రేవతియున్నదని మీ మనసులో నుంచుకొనుఁడు (నిష్క్రమించును)

దేవే—(తెరవైపునకుఁ జెవియొగ్గి స్వగ) రేవతియెవరినో స్త్రీనిదెచ్చుచున్నది. యేది యోమోసము జరిగినది.! శచీంద్రా! ఎవరో యాపన్నురాలువచ్చుచున్నది. నీవ వ్వలనుండి యంతయు నాలకించుచుండుము.

శచీ—[ఒకచో నెవ్వరికిఁ గనఁబడకుండ నిల్చియుండును.]

[అప్పుడు మనోరమ ప్రవేశించుచున్నది.]

మనో:—[దుఃఖముతో స్వగతము] ఎట్లో తెగించి యిమ్మహానుభావుని యొద్దకుఁ జేరితిని! హా! యేమి సేయుదును?

ఉ॥ ఎన్నిదురంతముల్ జరిగె;। నెంతటి భృత్యు నకాలమృత్యువా
పన్నతఁ గూర్చిమిత్రింగెఁ; దన । పన్నుగడల్ సఫలీకృతంబులై
యున్నను, నన్నుఁ జంపుటకు । నున్నమనోరమ నామధారిణీ
పన్నగి యెట్లునన్ విడుచు? । బ్రాణముఁవోవ దీఁ కేమి సేయుదున్?

హా! లక్షాధీశ్వరుని తనయను మూఁడు దినములనుండియుఁ దినుటకు గంజిలేకపోవుటా? ఇంతకంటెను దుర్భరమగు దుఃఖముగలదా? [ఎదురుకన్న దనుట సూచించి] నాముందేత్రిమదరుచున్నది! నేనింక కష్టములనుండి గట్టెక్కుదున నిసూచించుచున్నది, న్యాయస్వరూపుఁడును జగత్ప్రసిద్ధుఁడునగు దేవేంద్రవిజయమిత్రునియొద్దకు వచ్చితిని. సిగ్గువిడిచి సమస్తవృత్తాంతము నిమ్మహనీయున కెరింగించెదఁగాక! విన్నరగ నేడ్చినచో హృదయమునకు దుఃఖభారము తగ్గునని పెద్దలు చెప్పుదురు. [దేవేంద్రునకు సాష్టాంగ ప్రణామము చేయును,] తండ్రీ దిక్కుమాలిన యీయువతి మిమ్ము శరణుఁ జొచ్చుచున్నది! అభయమిప్పింపుడు! నాయంతటి హతభాగిని యీప్రపంచమున లేదు. రక్షింపుఁడు.

దేవే:—[లేచి నిలువఁబడి] అమ్మా ఆయుష్మంతురాలవగుదువుగాక! లెమ్ము.

మనో:—లేచి [శిరముసుఁగు సవరించుకొని నిలువఁబడును.]

చి:—[స్వగ] అహాహా! ఈమె మైచాయలు సుధాలిప్తములగు కుడ్యములపై నలువంకల ప్రతిబింబించుచున్నవి. ఇంతటిసుందరాంగిని దారిద్ర్యమున ముంచిన పాతవిధి నేమన్నను పాపములేదు! నిర్మలాకాశముపై సంధ్యారుణ కాంతులంబోలె నీమెలావణ్యకాంతులు గదియంతయుం బ్రసరించుచున్నవి! అహో! సృష్టివైచిత్ర్యము.

దేవే:—[స్వగ] ఎన్నికష్టములు పడియోగాని యీయబలయిట్లు నన్నాశ్రయించి యుండదు. [ప్రకా] నీవృత్తాంతము వినవలతును! చెప్పదగి యుండెనేని, చెప్పుము.

రేవ:—[నెమ్మదిగ జరగి నిష్క్రమించును.]

మనో:—మహాశయా! ఆర్తత్రాణ పరాయణులని మిముగూర్చి విని యిప్పుడు శరణుజొచ్చుచున్న దానను. దుఃఖతురాలనగు నావృత్తాంత మించుక యోపికతో వినినాకుం దగుసాహాయ్యము చేయుదురని మిమ్ము వేడుచున్నాను.

దేవే:—నీవెవరవు? నీవిట్లు దుఃఖతురాలవై యుండుటకుం గారణమేమి?

మనో:—అయ్యా! ఏదిదపుర మందలి యానందకుటీరమున కధికారిణిని. శత్రువు లన్యాయముగ నాసంపద లన్నియు నాక్రమించికొని నన్నిల్లు వెడలనడిచినారు!

దేవే:—[స్వగ] ఓహో! నిరంతరమును లెక్కలేనన్ని నేరములు వచ్చుచున్నవి! [ప్రకా] నీనామము?

మనో:—అయ్యా! నాపేరు మనోరమయందురు.

దేవే:—సరే. నేను మీతో గొంతపరిచయముం గల్గించుకొనినంగాని మీవృత్తాంతమును వినుట! కావున, నాయెదట సిగ్గుపడకొంత నీవేల మునుంగుం దొలగించుకొనుట కిష్టపడెదవా?

[తెరలో సవ్వడి]

మనో:—[స్వగ] పూజ్యుడగు నీయనయొద్దసిగ్గేటికి [illegible] దేవేంద్రుని జూచును.]

దేవే:—[స్వగ] మూర్తీభవించిన లక్ష్మీదేవతయట్లు విలసిల్లుచున్నదీమె! ఇంతటిశోభాఖని నిట్లిడుముల పాలుచేసినదుష్టులెవరు? యెక్కడనో యితఃపూర్వము పరిచితయైనట్లు దోచుచున్నది. ఈమెను గాంచినతోడనే హృదయము వాత్సల్యరసమున నిండిపోవుచున్నది.

శచీ—(మనోరమను తొంగిచూచి) [ఆనందముతో దనలో] పరమేష్ఠి తన భావనాబలమంతయు నుపయోగించి, యీసౌందర్యరాశిని సృజించియుండఁబోలును! అహా!

తే॥ అమృతరసముట్టి పడునట్లు, ♦ విమలచంద్రి
కలను గురిపించునట్లు, నీ ♦ కలికిమిన్న
సొగసుందనము ప్రశాంతమై ♦ నెగడుచున్న
దీమెనువరించి ధన్యత్వ ♦ మెవఁడుగాంచె॥ ౭

[తెరలో నవ్వు]

దేవే—[తనలో] పరిహాసప్రియురాలు కవతినవ్వుచున్నది! అహో! తల్లి నాథునిఁ బాసి దిక్కులేక తిరిగిన దమయంతియుంబోలె నీమెసౌందర్యము విపద్గ్రస్తమై యతి దీనమయియున్నది. [ప్రకా] మనోరమా! చేతనయిన సాహాయ్యముఁ జేయుటకు సంసిద్ధుఁడనై యున్నాను. కావున నింక దిగులువిడిచి నీ సకలవృత్తాంతమును మాకువినిపింపుము!

మనో—[ధైర్యముతో] తండ్రీ! యీదీనురాలిచరిత్ర మత్యంతము, వింతయైనది. నా పేరు "మనోరమ" యని మనవిచేసి యుంటినిగదా! సర్వవిధముల నావలెనే యున్న మఱి యిరువురినిగూడ మీరొకసారి భావింపుఁడు.

దేవే—అదేమి యట్లనుచుంటివి?

మనో—నాచరిత్రము విచిత్రమని తొలుతనే చెప్పితినిగాదా?

దేవే—సరే! భావించితిని. ప్రయోజనమేమున్నది?

మనో—దానితోడనే యొక్కఁ ప్రయోజనమున్నది. ఆయిరువురిలో నొకతె నాపినతల్లికూఁతురు.

దేవే—ఒక్కతల్లిబిడ్డలయందే సాధారణముగా నించుక భేదముగపచుండును. అట్టిచో, పినతల్లికూతురు—వంశముకూడ మారినది—ఆమె సర్వవిధములనిన్నుఁ బోలియుండుటా? మనోరమా! ఆశ్చర్యముఁ గొలుపుచున్నావు! మీపినతల్లియు మీతల్లియుఁ గూడ నొకతీరున నుండిరా యేమి!

మనో—మహాశయా! నాతల్లియు నాపినతల్లియుఁ గవలపిల్లలయి పుట్టినారు. వారిరువురు నొక్కటేయాకారముగలవారు. దురదృష్టవశమున వారికూఁతులము మేముకూడ నట్లేపుట్టితిమి.

దేవే:— సరే! నీచెల్లెలి నివాసస్థానమెచ్చట?

మనో:— గోపాలపురము! మీరాశ్చర్యపడవక్కఱలేదు. సూర్యపురమునుండి మా యింటనుండెడి సేవకులే యెంతయు భ్రాంతినొందుచుందురు వారలు!

దేవే:— [తనలో] ఎట్టివిపరీతము? ఎన్నిభయంకర సంఘటనములలో ఛేదించితిని గాని యిట్టివిచిత్రచరిత్రమెప్పుడును విననైతిని. (ప్రకా) సరే! మాకుంగూడ నట్టివిభ్రాంతిని భగవంతుఁడొసంగకుండుం గాక. ఆమూఁడవకాంతయెవ్వరు?

మనో:— అయ్యా! ఆపాపాత్మురాలు నాకపరిచితయైనది. అదియే నన్ను దుఃఖసముద్రమునం బడవైచి నవ్వుకొనుచున్నది.

దేవే:— ఇప్పుడు నీవెచ్చటినుండి వచ్చితివి?

మనో:— ఈయూరినుండియే వచ్చితిని. నా సేవకులందఱును భ్రమపడి యాయువతికిని వశులై పోయిరి.

దేవే:— కొంతకాలమునకైనను వారు నిన్ను గుఱుతింప లేక పోయిరా?

మనో:— రామగులాముఁ డొక్కఁడు మాత్రమే తనయవసానకాలమునందు నన్నుగుఱుతించి నాకొకయుత్తరము వ్రాసినాఁడు.

దేవే:— ఆయుత్తరము నిటు తెమ్ము.

మనో:— (చీరలో దాచియుంచిన యుత్తర మొసఁగును)

దేవే:— (ఉత్తరము జదివినట్లభినయించి) ఈతఁడేవ్యాధిచేఁ జనిపోయియుండెనో నీకేమైనఁ దెలియునా?

మనో:— లేదు. మూర్ఛయని విన్నాను. రెండు దినములు మాత్రమే వ్యాధి పీడితుఁడై మరణించెనఁట. కాని యతఁడు విషప్రయోగముచే మరణించియుండు నేమోయని నాతలంపు

దేవే:— నీతల్లిదండ్రులిప్పటికి సజీవులై యున్నారా?

మనో:— నాతల్లి నాచిన్నతనముననే చనిపోయినది. పిమ్మట నాజనకుఁడును గాలధర్మము నొందినాఁడు. అతఁడు దాదాపుగా మూఁడులక్షలరూపాయలు విలువఁగల యాస్తిసంపాదించి యిచ్చిపోయినాఁడు. అంతటి శ్రీమంతుని కూతురనయ్యు నేను నాపూర్వస్వరూపమునకును వెలియైపోతిని. చివఱకు నేను ప్రాణాపాయస్థితినుండవలసి వచ్చినది.

దేవే:—[ఆశ్చర్యముతో] ఎంత నిగూఢవ్యాపారము జరిగిపోయినది! అమ్మా! నీతండ్రి యిట్లు భ్రాంతి నొందకుండుటకు మీకు వేర్వేఱు గుర్తులు పెట్టికొనలేదా?

మనో:—[కన్నుల నీరు గార్చుచు] నా చేతి కొకయుంగరమును బెట్టినాడు. చిత్రవిచిత్రములుగా రత్నములతోఁ జెక్కఁబడిన యాయంగుళీయకము వంటిది ప్రపంచమున లేదు. అట్టియుంగర మేనాఁడు నా వ్రేలినుండి దూరమైపోయినదో యానాఁడే నాసర్వసంపదలకును దూరమైపోయితిని. ఆనాఁడే యాపాపాత్మురాలు నాసర్వస్వమునకును రాణియైనది.
హా! హా!

తే॥ సంపదలు వోయి, స్వజనంబు ♦ సమసిపోయి,
హృదయము గలంగిపోయి, నె ♦ మ్మదియుఁబోయి,
సుఖములకు దూరమైపోయి, ♦ స్రుక్కిపోయి,
పిచ్చిదాననై పోయితిఁ ♦ జచ్చిపోయి.

దేవే—[స్వగ] వినుకొలఁదియుఁ గరుణారసప్రవాహము కూలంకషమై ధైర్యమును దుడిచివేయుచున్నది. (ప్రకా) ఔఅడిల్లము! పాపము! నీవు పిచ్చిదాననైపోవుచున్నావు!

మనో—నేను పిచ్చదాననే కాకున్నఁ బిచ్చియాసుపత్రినుండి యేల తప్పించుకొని వచ్చితిని?

దేవే—(ఆశ్చర్యముతో) ఇదేమి సంఘటనము? మనోరమా! సాధుశీలవగు నిన్నుఁ బిచ్చియాసుపత్రికిఁ బంపిన వారెవరు? ఆవృత్తాంతమించుక వివరింపుము!

మనో—మహాశయా! నన్నెవరు పంపుదురు! అంగుళీయకము చోరగ్రస్తమయిన పిదప నెట్లయినను నా యాస్తి స్వాధీనముఁ జేసికొనవలయునని సేవకులతోఁ జెప్పుచుంటిని. అప్పటికా క్రొత్తకాంత మాయింటనే యుండినది. అది నేనే మనోరమనని వచించుచు నన్ను సేవకులకుఁ జూపి "యిదియొకపిచ్చి" దని చెప్పి యెంతయో జాలిఁ గనఁబఱచుచుండెడిది.

దేవే—ఇది మఱింత విచిత్రముగ నున్నది. మనోరమా! నీవానందకుటీరమున నే యుండుట లేదా?

మనో—లేదు. ఒకనాఁడు మా బంధువుల యింట జరుగు వివాహమునకయి దేవీపురమునకుఁ బోయితిని. మా బంధువులు నన్ను గౌరవించిరి. నాకు బసకొఱకొక గదియిచ్చిరి. నాసామానంతయు నందులో నుంచికొని జాగ్రత్తగఁ దాళము వైచుకొనుచుంటిని. ఆవివాహము పరిపూర్తి నొందక మున్నే యిక్కడి సమీపగ్రామమున నా బంధువుఁ డొకనికి జబ్బుగా నున్నదని విని, చూచివత్తమని పోయితిని. అతఁడు కుశలముగా నే యున్నాఁడు. సంతసముతోఁ దిరిగి వివాహగృహమునకు వచ్చితిని. వచ్చి చూచునప్పటికింకేమున్నది! నా గదిలో నా వంటి కాంతయే యున్నది. అది నన్నుఁ జూచి "ఎవరవమ్మా నీవు? ఏమి పనియుండి వచ్చితివి!" అని యడిగినది. నేను

పాలుపడితినసుకొని "క్షమింపు" మని యీవలకు వచ్చి మిగుల భ్రాంతినొంది
యిల్లది కాదేమోయని తలఁచి, బజారులన్నియుఁ దిరుగ వేసి, యెక్కడను నిం
వివాహగృహముఁ గనఁజాలక, మఱల నిచ్చటికే వచ్చితిని. వచ్చునప్పటికి అ
యందు నా సామానుగాని, యా కాంతగాని, యగపడలేదు. తరువాత నా
దకుటీరమునకు వచ్చితిని.

దేవే—అక్కడ నా కాంత కనంబడినదా?

మనో—కనఁబడినది. అదియే వచ్చి "అక్కా! ఎక్కడినుండి వచ్చుచున్నావు" యన్న
సుముదినియే మోయనుకొంటిని. అప్పుడామె యొక వెకలి నవ్వు నవ్వినది. నేను
చెడి, యక్కడనుండి రామగులాము నొద్దకుఁ బోయితిని. అతఁడు "నీవు మ
దు షైనతో నీ వ్రేలియుంగరముఁ జూపు" మనెను. చూచుకొందును గదా! నా
లియుంగరము లేదు. అప్పుడతఁడు నన్నా క్రొత్త కాంతగాఁ దలఁచి యనేకదూ
షలాడి, లోనికిఁ బోయి తలుపు వైచుకొన్నాఁడు!

దేవే—హరహర! యెంతయన్యాయము జరిగినది! తరువాత నీ వేమి చేసితివి?

మనో—నన్నుఁ జూచి, సేవకులందరును "పిచ్చిది! పిచ్చిది!" యని మొదలు పెట్టిరి. పా
యనువిసిగి మూఁడు కాలము నుండియు మా వ్యవహారములఁ జూచుచున్న మొ
ప్లీడరు నొద్దకుఁ బోయి నా దీనవృత్తాంత మంతయు విన్నవించుకొంటిని.

దేవే—సరే! అతఁడేమన్నాఁడు? పాపమతఁడొక్కడే సహాయుఁడు గాఁబోలును!

మనో—అతఁడు నాతో నానందకుటీరమునకు వచ్చి, వారితో నేమేమో మాట్లాడి "నన్ను
చ్చిదనియే" నిర్ధారించి యొక డాక్టరును, దానను గలసి, సాక్షిసంతకములు చే
సి, పిచ్చియాసుపత్రి డాక్టరునకు నన్నొప్పగించిపోయినారు. ఆ డాక్టరు స్వాధీనము
ననుండి శివపురపు పిచ్చియాసుపత్రిలో నింతకాలమునుండియు నుంటిని.

దేవే—ఆహాహా! యేమి న్యాయవాది! యేమి డాక్టరులు! వారిని వాసనులును, వారి పేళ్ళు
గొందరు పేర్కొనుము.

మనో—ప్లీడరు తులసీదాసబోసు! ధనానీపురమునందు గంచాపీఠయందలి యొక మేడ
లో నున్నాడు. పిచ్చియాసుపత్రి శివపురమునందున్నది. అతని పేరు గోవిందపు
సాదసేనుఁడు. ఆనందపు డాక్టరు పేరు తెలియదు. అతఁడే పిచ్చిపత్రి యోగముఁ జేసి
రామగులామును, సుముదినిని బరిమార్చియుండునని నాకొఁ దుసును.

దేవే—ఈ యుత్తరమును నీవు రామగులాము వ్రాసెనని నమ్మకమేనా?

మనో—నిశ్చయమని నమ్ముదును.

దేవే—ఇందలి 17. క. అనుగుర్తుగల కాగితములకట్ట-మనకుఁ గావలసియున్నది.

మనో—అగును. నా యాస్తి కి సంబంధించిన వ్యవహారములను నా కాగితముల కట్ట
లో నేయున్నవి. అదిగొట్లయినను సంపాదించి పెట్టవలయును. అదియెక్కడనుం
డెనో యెవ్వరికిఁ దెలియదు.

దేవే—ఈ వ్యవహారము చాలఁ జిక్కులతో నిండియున్నది. అయినను యథాశక్తి ప్రయత్నిం
చి చూచెదను.

మనో.— ఈవరకు నాకనుగ్రహింపుఁడు! మహానుభావా! మీరే నాకు రక్షకులు!

దేవే.— నీవంతగా బతిమాలనక్కఱలేదు. పురుషకారమునకు దైవము తోడ్పడునప్పుడు గదా కార్యము సఫలమగును. (స్మృతి నభినయించి) శివపురమునుండి యిచ్చటి కెప్పుడు వచ్చితివి?

మనో.— మూడుదినములైనది. నాకీయూర నెవ్వరును బంధుగులు లేకున్నందున రెండుదినములు భోజనము పెట్టువారైనను లేక నా దారిద్ర్యమునకుఁ గుందుచు నీఁడు బాగు బజారునఁ యున్న సత్రమున భోజనము చేసి యిప్పుడు మీకరుణకుఁ బాత్రురాల నయితిని.

ఉ॥ క్రూరులు వారలందఱు వి ♦ రోధము నాపయిఁ బూనియుండ, నా
వారను దిక్కులేక, కడు ♦ వంతలఁ గూరి, కృశించి, క్రుంగి, నా
వైరులకుం బ్రతిక్రియల ♦ వారిణఁ జేయక పోవనంచు నే
నూఱటఁ జెంది మీకడకు ♦ నొక్కతనై చనుదెంచితిం జుఁడీ!

దేవే.— నీ సామగ్రులన్నియు నెటనుంచితివి?

మనో.— సత్రమున విడిచివచ్చితిని. ఏమి సామగ్రులున్నవి? ఒక్క గుడ్డలమూటమాత్రమే యున్నది.

దేవే.— (నవ్వి) మంచిపని చేసితివి. నీ వక్కడనుండినట్లు వారుగను పెట్టఁజాలరు. కను పెట్టినను భయమంద నవసరము లేదు. కాని నీవు పిచ్చిదానవని యందఱు నను కొనుచుండిరి గదా! ప్రస్తుతము నిన్నాసుపత్రికిఁ దోడ్కొనిపోవుట మేలని తోఁచుచున్నది.

మనో.— (భయముచే వణఁకుచు) తాతఁడ్రీ! ఆసుపత్రికిమాత్రము నన్నుఁ బంపకుఁడు! ఆయాసుపత్రికంటెను యమలోకము మేలు. నరకాగ్నిజ్వాలలోఁ బడి మాడ్సైనను మాడవచ్చునుగాని యా యాసుపత్రిలో నొక్కనిముషమయిన నుండఁజాలను. మహాశయా! ఆసుపత్రికిఁ బంపి నన్ను దుఃఖపఁ జేయకుఁడు.

దేవే.— (నవ్వి) మనోరమా ఊరక భయపడెదవేల? నీవు మా రేవతి యొద్దనే యుందువులెమ్ము (తెరవైపు జూచి) రేవతీ!

రేవ.— (ప్రవేశించి) యింతవఱకును మీ రేవతి యెక్కడనున్నది? యిన్ని దినములకుఁ దెలిసినదా?

దేవే.— (పరిహాసముతో) నా హృదయ మందిరమునందున్నది. అదియే యిప్పుడు పవిత్రమయినది. రేవతీ! ప్రేయసీ! ఈమెను నీ చెల్లెలుగా భావించుకొని రక్షింపుము.

రేవ.— మీ యిష్టముచొప్పున సత్కరించెదను.

దేవే.— సంశయించెదేని నా చెల్లెలిగా తలఁచుకొందును. అప్పుడుమాత్రము నంగీకరింతును. ఆడుబిడ్డ కోటకొకను!

రేవ.— (నవ్వి) మీతో నెవరు మాటలాడగలరు? మనోరమా! లోనికిఁ బోవుదము రావమ్మా!

శచీ—మామా! రామశులామును కుముదినియుఁ జచ్చిపోయిరని మనోరమ స్పష్టీకరించుచున్నప్పుడు మీకిట్లు నిశ్చయించెదరేల? మనోరమను వెడలనడిచి-కుముదినిజంపి-యాసంపదల-కన్నిటికిఁదానే స్వామిత్వము ననుభవింపవలయునని కదా మాయా మనోరమ సంకల్పము? కుముదిని నిశ్చయముగా మరణించియే యుండునని నాయభిప్రాయము.

కేశ—నీపెంకెను లోఁతునకుదిగుట లేదు. కుముదినికిఁగూడ నట్టిసంకల్పమంతకు మున్నే యున్నది. అందులకుఁదగినట్లు మాయా మనోరమగూడఁ జేఁదోడు వాదోడుగనుండి తమసంకల్పము నెఱవేర్చుకొనిరి.

శచీ—అట్లయినచో రామశులామునుగూడ బ్రతికియేయుండునని చెప్పుఁడు.

కేశ—రాముగులాము నిశ్చయముగఁ జచ్చిపోయినాఁడు. ఏలనన? అతఁడకస్మాన్మరణము నొందియుండలేదు. క్రమక్రమముగ విషము శరీరమంగయుఁ బ్రాఁకుచుండ నింక రెండు దినములకుఁ జనిపోవుననఁగా నప్పుఁడు పశ్చాత్తప్తుఁడై మనోరమ కుత్తరము నంపినాఁడు! ఇంతయేమిందులకు? ఈయుత్తరముఁ జదివి పిమ్మటఁ బ్రత్యుత్తరమిమ్ము! ఆపాపాత్ముఁగారెంత మాయావినియో వినుచున్నప్పుడే యాశ్చర్యముఁగలిగెని.

శచీ—(ఉత్తరమునందుకొని చదువును.)

సీ॥ కాళికాదేవి మా♦కాలంబముగుఁగాక
సోదరీ ననుఁ గృపఁ♦జూడుమమ్మ!
నిత్యంబు ప్రార్థించు♦నీసుఖములు సహిం
పఁగలేక యీజాబు♦వ్రాసినాఁడ
నాదుష్టురాలి నీవని♦నమ్మి చెడినాఁడ!
నొక రోగమున వేగు♦చున్నవాఁడఁ!
బదునేఁడు, కా, యను♦పత్రసంపుటమున
నీయాస్తి యెల్ల వ♦ర్ణించినాఁడ!
తే॥ సోమనోరమ; నీయింట♦నున్నదనియు;
నెచటనున్నదియును నీవ♦రెఱుఁగఁజాల;

రందు సర్వరహస్యంబు • లరయఁబడియెఁ
గాన ధైర్యంబు వహియింపు • కలఁగఁబోకు ౧౧

తే॥ నిన్నుఁ గుఱుతింపఁజాలక • నేకపరుష
భాషణములాడి పంపితి • భవ్యమూర్తి!
స్వస్థతను జెంది యీపత్ర • సంపుటంబు
నీకుఁబంపెద: నను గరు • ణింపు తల్లి! ౧౨

ఇట్లు నీ సేవకుఁడు,

రామగులాము.

(ఉత్తరము దేవేంద్రునకిచ్చి) మామా! యీ వ్యవహారమునందలి రహస్యములు “గీజగానిగూఁడు” చందమున నిబిడంబులైయున్నవి. సూర్యునిచే ఛేదింపఁబడఁదగినంతటి విశాలగాఢాంధకారము నాత్మదీపికచే ఛేదింపఁబడఁగలదా? మీరే యీ రహస్యములఁ ఛేదింపవలయును.

దేవే—అట్లనకుము! నేను మాత్ర మాకసమునుండి దిగివచ్చితినా? ఇప్పటికిఁ దోచి నట్లు పలికితిని. కార్యరంగమునఁ బ్రవేశించినంగాని ఫలితము తేలదు.

శచీ—ఎప్పుడు ప్రవేశింపవలయును?

దేవే—ఎప్పుడో నా! యిప్పుడే ప్రవేశింపవలయును! నేనించుక నీపక్షమునకు దిగి కుముదిని చంపఁబడియుండదని యంగీకరింతును. ఇది వాదమునకే అట్లయి నచోఁ గుముదినికిని రామగులామునకును నౌషధమొసఁగి వధించిన డాక్టరు ఎవ్వఁడో ముందు కనిపెట్టవలయును. ఈ భారము నీపై మోపెదను. ఏమందువు?

శచీ—ఎప్పుడును మీయానతి చొప్పునఁ జేయుటకు సంసిద్ధుఁడనైయుంటినిగాదా! (లేచినిలువబడును.)

దేవే—ఉండుము! ఇంకొక సంగతి! విషము విషయమున నీయభిప్రాయమేమి?

శచీ—తప్పక విషమిచ్చియే చంపెనని నా విశ్వాసము.

దేవే—బండ్లుతో లేదు మునల్మానుని వేషముతోఁ బోయియట నీకార్యమున నప్రమత్తుఁడవై యుండుము.

శచీ—నా పేరు "ఫకీర్ బతూ"

దేవే—మంచిది. నీకు శుభమగుఁగావుత! పిస్తోలును గత్తియు నీవుంచుకొనుము! ఇంకొకమాట! ఆనందకుటీరమునందలి యాయువతినిజూచి మనోరమయని భ్రాంతిఁజెందెదవేమో చాల జాగ్రత్తగానుండుము!

శచీ—అట్లు నేను భ్రాంతినొందుటకుఁ బిచ్చివాఁడనా? (తనలో) ఈయన అవులించినచోఁ బ్రేవులు లెక్కపెట్టఁగలఁడు. నాహృదయమెవ్వఁడే గ్రహించినాఁడు. (ప్రకా) మామా! నేఁబోయెదను. (నిష్క్రమించును)

దేవే—(తనలో) ఎన్నఁడునిట్టి విచిత్రసంఘటనము జరిగియుండలేదు. కానిమ్ము!

ఉ॥ కొంకక ప్రేల్తు నయ్యరులకుండెలలోని రహస్యమెల్లఁ గూ
లంకషమ. శేముషీ. విభవలాలసతన్: బలసాహసంబు లే
వంకఁ గొఱంతలేనటులవర్తిలి, యీశరణాగతత్వ గుణా
లంకృతి నుద్ధరింతుఁ బదిలంబుగ. శత్రుల గెల్చి పెల్చనన్॥

(నిష్క్రమించును.)



రంగము. భవానీపురము.

(ప్లీడరు. తులసీదాసుని మందిరము.)

తుల—(పడకకుర్చీపైఁ బరుండి యాలోచనతోఁ దనలో) విశేషముగధనమునిచ్చుటలేదు!...ధనమొసఁగుటతోడనే తీరునా? తన మనోధనముఁగూడ నొసఁగినది. ఆహా! ఏమి సౌందర్యము? ధర్మపత్నులందురుగాని యుంపుడుకత్తెల నెవ్వరును నంగీకరింపరు. రసావేశపరులగు మహాకవులు కొందఱును మహాభక్తులు కొందఱును గాంతాకనకములను సంపూర్ణముగా నంగీకరించిరి. అట్లే న్యాయవాదినగు నేనును నంగీకరించుచున్నాను, పదిమంది యభిరుచయే ధర్మ

ము!...ఎప్పుడు నాకా త్రిలోకసుందరి కన్పడునో ఆనాడే నాదృష్టి! దాని చరణములొత్తు భాగ్యమైన సమకూర్చినచో భగవంతుఁడు వంద్యుఁడు.

(తెరలో)

దండాలు సామే! దండాలు.

తుల—(వెనుదిరిగిచూచి) (స్వగ) వీఁడెవఁడో పల్లెటూరి మొద్దువచ్చుచున్నాఁడు. వీనికైదైన నాలోచనము చెప్పవలయునుగాఁబోలును!

రైతు—(ప్రవేశించి) దండాలుసామే దండాలు వేయిదండాలు!

తుల—ఎవరోయి నీవు? నీదేయూరు?

రైతు—నా పేరాండి-శిత్తం అలాఅడగండి-నా పేరు కాంతప్ప-నేనోక పెద్దరైతునండి-మాది యిక్కడకు కూతంతదగ్గర-దగ్గఱఅంటే అట్టేదగ్గఱ గాదు-రొండు కోశెళ్ళుకుంటుంది-పల్లెటూరు అయ్యా! నా పేరు కాంతప్ప-నాతండ్రి దొడ్డ కాంతప్ప-మాతాత-ముదికాంతప్ప-ఆయనతండ్రి పెదకాంతప్ప-పెదకాంతప్ప తండ్రి-యెవరో కాంతప్ప అగునుగాని-తెలియదు-మాకు అన్ని తప్పులేనండి బాబూ! యేంచెయ్యమన్నారు? నామనవి యినుకోండి!

తుల—(విసుఁగుతో) ఈవర్ణనముచాలును ఇస్సీ! పల్లెటూరువారలతో మాటాడుటయనిన నాకు మిగులఁ జీదఱ ఏమిపనిమీఁద వచ్చితివోయి? ఏమైన కేసు. దాఖలు చేయవలసియున్నదా?

రైతు—(స్వగ) అహా! ప్లీడరుల మరియాదలెంతచక్కఁగనున్నవి? పల్లెటూరిప్రజలనిన నింతవిసుఁగు! కూర్చుండుమని చెప్పఁడే! (ప్రకా) బాబూ! నేను పేదవాణ్ణి పెద్దనేరమే వుందండి! శిత్తం నాకుకొంచెం మూర్ఛరోగం వుందండి అయ్యా! బాగా యినుకుంటున్నారా? శిత్తం నాకోకూతురుందండి. అది మొదట మంచిదేగాని బొత్తుగా మతిచెడిపోయిందండి బాబూ! నా సెత్తనానికిఁదగినట్లే నాకూతురికి పిచ్చగూడా వుండాలంటండీ? అది బొత్తుగాపిచ్చిదని అందఱు అనుకుంటుండారే!

తుల—నీకూతురకుఁ బిచ్చిపట్టెనుగదా. ఆసుపత్రికిఁ బంపకపోయితివా? డాక్టరుగారితో మాటాడక నాయొద్దకు వచ్చితివేమి?

రైతు—బాబూ! డాక్టరుగారెవరండీ? తమరేగాదూ డాక్టరులంటు?

తుల—నేను డాక్టరును గాను. న్యాయవాదిని ఇదిగోఁ బొమ్ము! నాకుఁ బనియున్నది.

రైతు—నాకూతురికిఁ బిచ్చెవుందేమో కాస్తంత చెప్పండి బాబూ!

తుల—అసంగతి నాకేమి తెలియునోయి? పోయి డాక్టరుతో మాట్లాడుము.

రైతు—మావూళ్ళో పెద్దమనిసి సూరకాంతిప్ప నన్ను తమకాడికెల్లమన్నాఁడే! యీవూళ్ళో ఓపిచ్చిది అనందకుట్టీరం నాదంటుంటే దానిపిచ్చివదల్చటానికి మీరేడాక్టరు గారివద్దకు పంపించారంటగాదూ?

తుల—(భయముచేఁ గొంచెముగ వణఁకి) (తనలో) మనోరమనన్యాయముగఁ బిచ్చిదని సాక్షిసంతకము చేసితిని (కన్నులమూసికొని ఆలోచించి ప్రకా) ఆమె నిజముగాఁ బిచ్చిదికాదు. ఊఁ...

రైతు—(అర్థోక్తియందే) అయ్యా! ఆమె పిచ్చిదిగాదా? చెప్పండి! చెప్పండి! పాపం పిచ్చిదికాకపోతే అసుపత్రికి పంపడం యెందుకండీ?

తుల—(ఉలికిపడి లేచికూర్చుండి) (తనలో) నేనేల బయటఁ బెట్టితిని? (ఆలోచనతో) ఊఁ! కానిమ్ము.

చ॥ పొలమును దున్నుకొంట, పసువుల్ మఱలించుట, యింకఁ బాఁడిపం
టలగతి చూచుకొంట, ఒకటంబగు వేసము, సర్గలోభ మిసుం
గలిగి ప్రపంచవృత్తములఁ గాంచఁగ నేరని పల్లెటూళ్ళ మూ
ర్ఖులకు నెఱుంగ శక్యము లొకో నవనాగరకత్వ సంపదల్॥ ౧౮

రైతు—అయ్యా! బాబూ! చెప్పండి చెప్పండి! యెందుకుబాబూ! అపిచ్చిదాన్ని అనుపత్రికి పంపడం? అదేవన్నా మిమ్మల్ని కరిచిందా? తన్నిందా? తిట్టిందా? దిగదుడుపుబెటిందా?

తుల—(ఉలికిపడి) ఏయ్! పిశాచమువలె కదలకున్నావేమి? అదిపిచ్చిదే! పిచ్చిది కనుకనే పిచ్చిదని సాక్షిసంతకము చేసితిని. నీవుపొమ్ము! నాకుఁ బనియున్నది. (తనలో) ఈమూర్ఖుని రెండు డాబులు డాబినఁగాని యిటనుండి తొలఁగఁడు.

(వెళ్ళి)వినావయ్యా! త్వరగాదొమ్మా! కదలవేమి? నాతోనీకుబనియేమున్నది? ఇవేమి కాడిగట్లనుకొన్నావా? రచ్చబండలనుకొన్నావా? పోపొమ్మా!

రైతు—బాబూ! పల్లెటూళ్ల ప్రజలంటే మీకింతలోకువయెందుకండి? మాలో మేం కొట్లాడుకొని మిమ్మల్ని బాగుచేయటం కాదంటండి? లేకపోతే మీపిడేవు పని వోరికికావల్నెండి? యింత నేవటినుంచి నుంచుండి మాట్లాడుతుంటే కూరింత కూకోమనైనా శెప్పరే! మాడబ్బుదిని మామీద అలగడం పంచిదే నంటండి? మాపిచ్చిదానిమాట-బాబూ! కోంపసేకండి! ఆడాకసరుగారికాడికి పంపండి!

తుల—నీకెన్ని సారులు చెప్పినను జ్ఞానము లేదేమి? (కుర్చీమీఁదినుండి లేవఁబోవుచు) నీవిక్కడినుండి పోయెదవా? పోవా? మెడఁబట్టుకొనియావలకు గెంటవలెనా?

రైతు—బాబూ! నాకు మూర్ఛరోగంవుందని మొదట నే మనివిశేసుకొంటినిగందా! నన్ను ముట్టుకున్నోళ్ళు కిందపడిపోతారే! యెందుకండీ నన్ను గెంటడం?

తుల—(క్రోధముతో) ఏమి? నీ పేలు లెక్కువగుచున్నది? పోయెదవా? పోవవా? నీకుశాస్తి చేయవలయునా?

రైతు—బాబూ! అయ్యా! అంటేనేరైతుమీఁద మీకింతకోపంవస్తుందే? (తనలో) ఈదుష్టుఁడు నన్నింతవఱకును గుఱుతింపఁడయ్యెను. ఇఁక బాగ్రత్తతో నుండవలెను. (ప్రకా) బాబూ! రేత్రిపూట పెద్దబజారులోకిఁబోయి యెంగిలి చుట్టలేరుకొని తెచ్చుకొని వాకిట్లో పోసుకొంటారంట మీ రేకాదూ?

తుల—(క్రోధముతో) ఇక్కడినుండి కదలెదవా లేదా? ఛీఛీ! పోపొమ్మా! మా కా చుట్ట లేఱుకొని తెచ్చుకొను టెందులకు?

రైతు—సాలామంది రైతులు మీతోటి ఆలోచనలకు వస్తుంటారని అందఱు అనుకోవద్దూ! బాబూ! కోంపడకండి!

తుల—మొద్దుముండకొడుకా! నీవెటకారసములు నాయొద్దనా? (లేచి దేవేంద్రునిపైఁ గలియఁబడును.)

రైతు—(తులసీదాసునితోఁ బెనఁగి యతనిని త్రైకత్తియొకచోఁ గూలవైచి) బాబూ! ముందుగానే చెప్పితినే నామూర్ఛమాట! యెందుకు నన్ను మీఁదగొట్టడం? కలవుపుచ్చుకొంటా! (పరిక్రమించి తనలో) ఆహా! సంధ్యాకాలమయినది!

ఉ॥ బాలులు తీటె యావిహగవర్గము లాకసమందుఁ బాడుచుం
జేరెను గూండ్లకున్! నభము విచిత్రతరంబుగఁ దపూవ్వూసిన
ట్లాయెను రక్తవర్ణము! యంబుజమిత్రుఁడు రక్తవస్త్రశృం
గారముతోడఁ బశ్చిమదిగంగనఁ గూడఁగఁబోయె సయ్యెడన్ ఁగగి

వచ్చినపనియైనది. మనోరమ పిచ్చిదిగాదని వీనిచేతనే చెప్పించితిని. వీఁడు కూఁతురుఁడును మూర్ఖుఁడునునని యింతవఱకుఁ దేలినది. నేఁటి కింటికిఁబోయెదం గాక! ఇతని యొంపుదుకత్తియగాఁబోలు నటవచ్చుచున్నట్లున్నది.

(నిష్క్రమించును.)

(మనోరమవంటి స్త్రీ ప్రవేశించి.)

స్త్రీ—(తనలో) ఈపోయిన యాతఁడెవఁడు? (స్మృతినభినయించి) ఆ.! దేవేంద్ర విజయమిత్రుఁడుగాఁడా? యాతనికిక్కడ నేమిపనియున్నది? (ప్రకా) న్యాయవాది మహాశయా! యీవచ్చినయాతఁడెవరు?

తుల—(బాధ నభినయించి మెల్లగా లేచి) (తనలో) హా! కాలిచిప్ప బెణికినది (ప్రకా) పాప మితఁడొక పల్లెటూరి రైతు తన కుమార్తెకుఁ బిచ్చి పట్టినదనియు, నే డాక్టరుకయినను సిఫారసు చేయుమనియుఁ జెప్పినాఁడు. వట్టి మూర్ఖుఁడు. మతిలేనివాఁడు. మఱియు నతనికి మూర్ఛరోగము గూడ నున్నది. పొమ్మని మెడఁబెట్టి నెట్టితిని. ఆ మూర్ఛరోగము నాకుఁ దగులగనే ఈ వలఁబడిపోయితిని. (నొప్పి నభినయించి) దెబ్బ మిక్కుటముగఁ దగిలినది. అబ్బా! పల్లెటూరి పశువు మోటుఁదనము!

స్త్రీ—పశువునీవా? యతఁడా? అతనివంటి తెలివిగలవాఁడును, నీవంటిబుద్ధిహీనుఁడును 'నభూతో నభవిష్యతి' ఇంతసేపు మాటాడియు నతని గ్రహింపఁజాలకపోయితివి. అతఁడే దేవేంద్రవిజయమిత్రుఁడు!

తుల—(ఆశ్చర్యముతో) అన్నా! ఎంతపొరబాటుజరిగినది? వాడెంతయుక్తిపరుఁడు ఇప్పుడాలోచింపఁగా మనోరమా వృత్తాంతము వాని కామూలాగ్రము తెలిసి

యుండునని తోఁచుచున్నది. అయినను మనము జాగ్రత్తగా నున్నచో వాని వలన నిందుకయు భయము లేదు.

స్త్రీ—ఛీ! ఇంకను జాగ్రత్తయేమి? మనోరమ యాసుపత్రినుండి తప్పించుకొని పోయి వానియందుఁ జేరియుండునని తోఁచుచున్నది. ఇంకేమున్నది? మన పడిన శ్రమయంతయు మంటిలోఁ గలిసిపోయినది.

తుల—(నిట్టూర్పుతో) అరరే! అరరే! యింతపని జరిగినది? కర్తవ్యమేమో చెప్పుము!

స్త్రీ—మణిల వర్తనియింటినుండి మనోరమను దీసికొని వచ్చుటయే కర్తవ్యము అది మాత్రము కష్టసాధ్యము!

తుల—కష్టసాధ్యమని చెప్పకుము! అది మణిల నిప్పుడే మన చేతులలోఁబడి పోయెననుకొనుము. (క్రోధముతో) ఔరా! దేవేంద్రా! సుప్రసిద్ధుఁడును న్యాయవాదియునగు తులసీదాసునే మోసపుచ్చ యత్నించితివిగా! ఓరోరి క్రూరాత్మా! ఇఁక నీవీ ప్రపంచమున లేవు! నా చేతనే నీజీవము లూడనున్నవి. తులసీదాసుఁడన నెవ్వఁడనుకొంటివిరా? నీవంటి డిటెక్టివుల నెందఱనైనఁ బరిమార్పఁ గలఁడనుకొనుము! కానిమ్ము! నీ కాయువు మూఁడినది.

స్త్రీ—(అర్ధోక్తియందు) చాలుఁ జాలుఁ ఇఁకఁ గట్టిపెట్టుము! ఇప్పుడీ దెబ్బ నయము చేసికొనుము. జాగ్రత్తగానుండుము! నేను మణిల రేపువచ్చెదను. ఏమఱి యుండెదవు సుమా! జాగ్రత్త! ముమ్మాటికి జాగ్రత్త! దేవేంద్రుఁడనేక రూపములు ధరింపఁగలఁడు. ఇఁక నేఁబోయెదను. (నిష్క్రమించును)

తుల—(బాధ నభినయించి కుంటుచు తనలో) ఏమైన చికిత్స చేయించినఁ గాని ఈ కాలినొప్పి నయముగునట్లు లేదు. ఎందఱో నన్ను గౌరవించి సభల కధ్యక్షునిగా నెన్నుకొనుచుందురు. పూలదండలు వేయుచుందురు. కాని, యీమె నన్నింత నీచముగాఁ జూచు నేమి?..........చూచిన నాకేమి కొదువ?

ఉ॥ సుందరమై ప్రశాంతమయి చూపుల కుందనుపొందఁజేయు నా
నందకుటీర లక్ష్మియిది! నా హృదయంబున మోహబీజముల్
పొందుగ నాఁటి నాకు ధన ముందన భోగము నిత్తునంచు నా
నందలకొల్పెఁ; గాన శిర సావహియించెద దాని యానతుల్ ॥౧౬

కావున నింటినుండి యప్రమత్తుఁడనై యుండెదంగాక. (నిష్క్రమించును.)

ప్రథమాంకము సమాప్తము.

# మ నో ర మ

## ద్వితీయాంకము.



### రంగము—దేవేంద్రుని దర్శనగృహము

(గోవిందప్రసాదసేనుఁడు ప్రవేశించి)(తనచేతిలోని కత్తికఱ్ఱ విలాసముగా త్రిప్పుచు)

గోవిం—(తనలో) ఎంతవింతజరిగినది? మనోరమ యిక్కడికెట్లువచ్చియుండును? వచ్చినను నితనిచే యాశ్రయింపఁబడియున్నా? ఇది పిచ్చిదనికదా మేమందఱము దీనిని నిర్బంధమున నుంచితిమి! ఆనందకుటీరమునకు నేఁగియుంటిని. ఆ త్రిలోకసుందరి - అజగన్మోహిని-నన్ను సాదరముగఁ గూర్చుండఁజేసి "ఏమి వైద్యస్వామీ! పిచ్చిదానికిఁ ద్వరలో పిచ్చికుదిర్చి మీ బహుమానము నొందుఁ" డని పల్కినది. ఆహా! ఆమె చాతుర్యమునకు విలువగలదా? ఎంత సౌందర్యమున్నదో యంత చాతురియున్నది. ఇట్టియువతి యేకాలమున నుండదని ఘంటాపథముగఁ జాటిచెప్పవచ్చును. నిన్న సాయంకాలమున నీదేవేంద్రవిజయుఁడు ముసలిరైతు వేషముతోఁబోయి యాచచ్చుపెద్దమ్మను మాడూఁపులూఁపి వచ్చినప్పుడే మోహినీస్యవతారయగు నాసుందరి చూచినది. అప్పటికప్పుడే మనోరమ తప్పించుకొని పోయినదని నిశ్చయించినది. ఆహా! యేమితీక్ష్ణబుద్ధి తానేమియు తెలియఁగనట్లు నటించి "ఏమి వైద్యస్వామీ! పిచ్చిదానిపిచ్చిత్వరలో నయముచేసి బహుమతులఁబొందుఁ' డన్నది ఇది నావలనరాబట్టుటకే కదా! ఆత్రిలోకసుందరీ కటాక్షపరంపరలు సుధాకరకిరణములభాతి నమృతమధురములై నాపైఁ బ్రసరించునప్పుడెంతటి యానందమునొందుచుందునో నాకే గోచరముకాకున్నది. ఎట్లయినను బట్టితేవలయునని చెప్పినది నాశక్తియంతయుఁ బ్రదర్శించి మనోరమ నిటనుండి తీసికొనిపోయి యామెకొప్పగించెదంగాక! (పచారుచేయుచుండును)

(సుబ్బు ప్రవేశించును.)

సుబ్బ—బాబూ! యేంపనిమీద దయచేశారు?

గోవిం—నీవిక్కడి సేవకుఁడవా?

సుబ్బ—చిత్తం!

గోవిం—మీయజమానుఁడింట నున్నాఁడా?

సుబ్బ—ఎందులకు?

గోవిం—కొంచెము పనియున్నది.

సుబ్బ—ఆపనేంటో శెప్పరాదా?

గోవిం—వారితోనే మాటాడవలసియున్నది.

సుబ్బ—ఆఁ! ఉన్నారు.

గోవిం—(ఒకకాగితముపైఁ వ్రాసి) ఇదిదీసికొనిపోయి వారికిఁ జూపుము! (చీటియిచ్చును)

సుబ్బ—అట్లే సూపుతాను శెలగండి (నిష్క్రమించును)

గోవిం—(స్వగ) ఈసేవకుని వెంకెతనము బిగువు. మనోరమకాశ్రియమిచ్చిన దేవేంద్రుఁడుకూడఁ బెంకెమనుష్యుఁడేమో యనితోఁచుచున్నది. కానిమ్ము ఈవెంకెతనము నాయొద్ద సాఁగదు. నాబాహుబలముముందట నిలఁడెంతటి వాఁడు?

(దేవేంద్ర విజయమిత్రుఁడు ప్రవేశించును.)

గోవిం—గుడ్ ఈవెనింగ్ సార్ (సెల్యూటుచేయును)

దేవేం—గుడ్ ఈవెనింగ్ (ప్రతిచేయును) (తనలో) వీనియాకారముఁ జూచుట తోనే పిశాచములన్నియు వీనిమొగమున వ్రేలుచున్నట్లున్నవి వీఁడు మనోరమను దోడ్కొనిపోవుటకై వచ్చియుండును. వీనితోఁగొంత మొండి వాదముచేసి చల్లఁగ సాగనంపెదంగాక! (ప్రకా) మహాశయా! కూర్చుం డుఁడు!

గోవిం—కుర్చిపైఁగూర్చుండును)

దేవేం—(పరిక్రమించుచు) మహాశయా! తాముదయచేసిన పనియేమో వినఁగో రెదను.

గోవిం — అయ్యా! శివపురపుటాసుపత్రి డాక్టరును. నా పేరు గోవిందప్రసాదనేఁ దందురు.

దేవే — కావచ్చును. తమకు నేఁడీఁ ప్రవలసిన పనియున్నదోఁ జెప్పుఁడు!

గోవిం — ఇంచుక పనియుండియే వచ్చితిని. దేవేంద్ర విజయమిత్రులు తమరేయని తలంతును.

దేవే — మీ రెవరితో భాషింపవచ్చితిరో, నాతో మాటాడినయెడల వారితో మాట్లాడినట్లేయగును. ఎట్టియుపాయములను సంధించియుండలేదుగదా? మహాత్ముఁడగువరిందమనకువు నొద్దకుఁబోకపోయితిరా? (కుర్చీపైఁగూర్చుండును)

గోవిం — (తనలో) వీఁడు టక్కరితనమునకు పెరుగుచున్నాఁడు, ఇఁక వీనియాటలు సాగనీయను (ప్రకా) తమతో నేయించుక పనియుండివచ్చితిని.

దేవే — సామాన్యులలో సామాన్యుఁడగు నాతో నేమిపనియున్నదబ్బా? అయినను చెప్పుఁడు

గోవిం — అయ్యా! మా వైద్యాలయమునను న్న యొకపిచ్చిది తప్పించుకొనివచ్చి తమ యొద్దనుండెనని వింటిని. ఆమెను దోడ్కొనిపోవుటకే యిక్కడికి వచ్చితిని. ఇంతకన్నను మాకుఁ బనియేముండును?

దేవే — మంచిచిక్కు తెచ్చిపెట్టితిరే! పిచ్చిదియేమి? యిక్కడకువచ్చుటేమి? నా వృత్తాంత మీపట్టణములో నెందఱికో తెలిసియుండదే! మహాశయా! చాల నాశ్చర్యముగానున్నది.

గోవిం — మహాశయా! అది మిమ్ములనెఱుఁగకుండునంతటి పిచ్చిది గాదు. ఇంతే కాక, పరులసొమ్ము నన్యాయ్యముగ ననుభవింపవలయునను పిచ్చిగూడ నున్నది.

దేవే — (నవ్వి) అయ్యా! పరులసొమ్ము నన్యాయముగఁ గాజేయవలయుననునది పిచ్చియని యిప్పుడు వినుచున్నాను. ఫోర్జరీచేయుట యదియగును గాని పిచ్చియగునా? మహాశయా! హాస్యరసమునకు మీరు పెట్టిన పేరు!

గోవిం—తానెట్లయిన వసుకొనుఁడు! అట్టియావచేతనే యామెపిచ్చిదైపోయినది. ఆపిచ్చిదానిని మఱల నాకప్పగింపుఁడు!

దేవే—ఆమె పిచ్చిదని మీకొప్పగించిన వారెవరు? వారు నేరము నారోపించుచు వ్రాసియిచ్చిన ప్రమాణపత్రిక యేమైనసన్నదా?

గోవిం—నేనసత్యములాడుచుంటినని తమరభిప్రాయపడుచున్నారు! అదిచాలఁబొరపాటు. గోవింద ప్రసాదసేనుఁడు ప్రమాణము లేక యొక్కమాటయైనను వెలిఁబుచ్చఁడు. (జేబునుండి యొక కాగితముఁదీసి దేవేంద్రునకిచ్చి) దీనిని జదువుకొనుఁడు. సర్వమును విశదముకాఁగలదు.

దేవే—(కాగితమును బుచ్చుకొని చదివినట్లభినయించి తనలో) శచీంద్రునిఁ బంపిన పని యిక్కడనే పూర్తియయినది.

చ॥ ఒకఁడు వహీనచంద్రుఁ; డతఁడొక్కడ డాక్టరుగాఁగ నున్నవాఁ;
డొకఁడతి మూర్ఖవృత్తిఁ దనయుల్లముఁదాన యొుఱఁగనుండినా
ప్రకటబలంబుచేఁ బడినవాఁడు ప్లీడరు: వీడు సాక్షు; లిం
కొకఁడు వివర్ణుఁడై యిచటనుండిన పీనుఁగు డాక్తరారయన్॥ ౧

సరే! కావలసినపని పూర్తియయినది. (జేబునుండి డైరీబుక్కు తీసి) వీరినామములు వ్రాసికొందును. (వ్రాయుటనభినయించి) మనోరమ పిచ్చిదిగాదని వీనివలనఁగూడఁ జెప్పించితిని. ఇఁక నీతని సాగనంపవలయును. (ప్రకా) అయ్యా! యిందలి డాక్టరు గోవిందప్రసాదసేనులు తామేనా? లేక క్రొత్తగ నీవైద్యాలయమునకుఁ బంపఁబడితిరా?

గోవిం—లేదు, నేనే చాలకాలమునుండియున్నాఁడను. మహాశయా! నాకాలస్యమగుచున్నది. దూరముపోవలయును.

దేవే—ఏమి చేయమందురు.

గోవిం—ఆమనోరమను నాతోఁ బంపుఁడు!

దేవే—(అర్థోక్తియందే) మనోరమ యెవరు? దాని యూరును పేరును గొంచెము చెప్పుఁడు!

గోవిం—అయ్యా! ఈపత్రికలవలనఁ బ్రయోజనమేమున్నది? (తనలో) వీఁడు నావలన నిజము రాఁబట్టఁజూచుచున్నాఁడు. ఇప్పటి మాసమాచార మినుకతక్కెడ-పేడతక్కెడ యనునట్లు సంభవించినది. (ప్రకా) నేను మనోరమననియు, నానందకుటీరము నాదనియు, నెల్లజనులతోడను జెప్పుకొనుచు వచ్చినది. ఈకల్లోలము సహింపరాక పెద్దమనుష్యులు నావైద్యాలయము నకుఁబంపిరి.

దేవే—ఇందుఁ గల్లోలమేమున్నది! అది పిచ్చిదనంచే నెవరినైన బాధించినదా? పోనిండు. పాపము! ఆనందకుటీరము:! కథకారిణి యెవరు?

గోవి—అయ్యా! గొప్పవారి యంతఃపురము జోలి మాకేల? మాకేమి తెలియును? దయచేసి యామెను మాకప్పగింపుఁడు!

దేవే—కేకలు వైచినంతమాత్రమున నామె నట్టి నిర్బంధమున నుంచుటేఁటి న్యాయము?

గోవిం—ఓహో! న్యాయమాయని యడుగుచున్నారు! పెద్దమనుష్యులు గూడ నన్యాయము చేసిరనియే మీ యభిప్రాయమా?

దేవే—కోపింపకుఁడు! మహాశయా! ఏమియుఁ దెలియక యొకపిచ్చిదొకింత మాఱు మాడినదనుకొనుఁడు. అంతమాత్రమున నామెను నిర్బంధమున నుంచుట పుణ్యజనులకు ధర్మమేనా?

గోవిం—ఓహో! యెంత న్యాయవంతులరయ్యా మీరు!

ఉ॥ ఘోరచరిత్ర కొక్కతె ♦ కులశరణంబిడి, యట్టిదానిపై
నేరము లేదటంచు జన ♦ నింద్యముగాఁ దమరే వచించుచు
న్నారు! తమంత తెల్వి గల ♦ నాథులు లోకమునందు నెందునున్
లేరో! ప్రలాపముల్ విడిచి ♦ లేచి ద్రుతంబుగ నొప్పగింపుఁడీ॥ ౨

దేవే—సరిసరి ఇదిమతియు బాగుగనున్నది. ఘోర చరిత్రయఁట! పిచ్చిదియఁట నాయింటనదఁట! నిల్చినదఁట! ఆహా! ఎంతగఁ జమత్కరించుచున్నారు! మహాశయా! మీకీ యసత్యములు నేర్పినవారెవరు?

గోవిం—(కోపముతో) ఎవరా? యొక పెద్దమనుష్యుఁడు?

దేవే—దయచేసి యా పెద్దమనుష్యుని పేరు సెలవిండు? పిచ్చిదానిని నేనెందులకుఁ జేర్చికొందును? విద్యావంతులగు తమరింతమాత్ర మాలోచించుకొనఁగూడదా?

గోవిం—ఎవరైనను మీ కేల? ఆపిచ్చిది మీయింటనున్నది. ఒప్పగింపకతప్పదు.

దేవే—పిచ్చిది నాయింట నున్నఁగదా మీ కప్పగించుట?

గోవిం—లేకేమి? ఆపిచ్చిది మీయింటనే యున్నది! ఒప్పగించి తీరవలయును! విలంబమున కోర్వఁజాలను! నేఁ బోవలయును.

దేవే—మీ కెవరో పెద్దలొప్పగించిరంటిరే! ప్రవేశపు రుసుముతోఁగూడ నందులకు బహుమాన మెంత కయికొంటిరి?

గోవిం—ఊరక నే యామెను జేర్చుకొంటిని. బహుమానమును లేదు. గిహుమానమును లేదు.

దేవే—ప్రయోజనము లేనప్పుడు మీరు చేర్చుకొను టెందులకు? మంచుల దారిఁగ కూడ నగును గదా! ఈ పట్టణమున నిండఁ బిచ్చివాండ్రు దిరుగుచున్నారు. వారి నెందులకుఁ జేర్చుకొనరైతిరి? మీ యౌదార్యము నాపిచ్చివాండ్రపైఁ గూడఁ జూపరాదా?

గోవిం—అది నాయిష్టము. ఆపిచ్చివాండ్రనుగూడ మీయింటఁ జేర్చుకొనకపోతిరేమి? మాటకు మాట బదులు చెప్పలేనా? అయ్యో! ఆపిచ్చిది నాది! కనుక నావెంట నంపుము.

దేవే—నాదియనఁగా?

గోవిం—నా వైద్యాలయమున మందుపుచ్చుకొనుచున్న రోగిణి.

దేవే—(కుర్చీపైనుండి లేచి దూరముగా నిలువఁబడి) అయ్యా! కాల విలంబము సైపఁజాలను. నాకెన్నియో పనులున్నవి. ఇఁక బోయెదను. తామిఁక దయ చేయుఁడు! హాస్యరస ప్రదర్శనమున నాకెంతయో యానందముఁ గలిగించితిరి!

గోవిం—నాకును వేళయగుచున్నది. త్వరగా నాపిచ్చిదాని నిటుఁదోక్తెదను! (లేచి యీవలనిలిచి)

దేవేం—నన్ను విసిఁగింపకుఁడు. చాలఁబనియున్నది. ఇటుఁ బిచ్చిదియు లేదు వెఱ్ఱి దియు లేదు. దయచేయుఁడు!

గోవిం—(క్రోధముతో) ఇది మరియాదకుఁ గాలముకాదు. పెద్దమనుష్యునిట్లవమానించినందులకుఁ దగుఫలము ననుభవింపక తప్పదు (కత్తికజ్జలోని కత్తినిబయటకు లాగి,) దురాత్మా!

చ॥ ఎఱుఁగవు నన్నుఁ గాచికొను మిప్పుడ నీదుశిరంబు భూమిపైఁ
బొరలెడుఁ జచ్చువేళలకు బుద్ధులొగిం బెడత్రోవఁబట్టు నీ
గరువతనంబు నొచ్చుటకుఁ గాదిటువచ్చితి నీదు మాంసఖం
డములు నాకృపాణము దిటంబుగ వే భుజియించుఁజూడుమీ! 3

దేవేం—మహాశయా! పరిహాసములాడుచుంటిరా యేమి?

గోవిం—ఛీ! దురాత్మా! పరిహాసములు నీతోనా?

మ॥ తలచైయున్నది నీకు పాపచయ మిద్ధాత్రీస్థలిన్; ఎందఱెం
దఱిప్రాణంబులు నీయరిందముని చేతన్ వెండి నీచేత ని
ర్ధరఁ గోల్పోవఁగఁ జేయఁగాఁబడెనో తత్పాపంబుఁ బాపంగ నీ
శిరముం గూల్తుఁ గృపాణధార నరిసంక్షేపంబుఁ గావింపఁగన్॥ ర

దేవే—ఓహో! నీవుకూడ ఖూనిదారులలో నొకఁడవేనా? అనుభవింపక తప్పదు ప్రయోగింపుము వెఱచినను నన్నుఁ జంపకవిడువవుగదా!

గోవిం—పాపాత్మా! యింక నీవు లేవు! (కత్తిని దేవేంద్రునిపైకి విసరివేయును)

దేవేం—(క్రిందికివంగి దెబ్బతప్పించుకొనును (కత్తిగోడకుఁదగిలి క్రిందఁబడును) దుష్టాత్మా, యిప్పుడు నీవు గాచికొనుము! (అతివేగమునవచ్చి గోవిందుని ముఖముపైగుద్దును)

(గోవిందుఁడు మూర్ఛిల్లును)

గోవిం—మూర్ఛదేలిసి జేబునుండి యొకచురియఁదీసిపట్టుకొని నిలువఁబడి) ఓసోరి దేవేంద్రహతకా! యిఁకఁ గాచికొనుము! నీ ప్రేవులీచురియచేఁ దోడివైచెదను.

(దేవేంద్రుఁడు గోవిందుని మనికట్టుపైగుద్దును) గోవిందునికత్తి క్రిందఁబడును)

ఇరువురును పెనఁగుదురు)

సుబ్బ—(ప్రవేశించి) అయ్యో! అయ్యో! అనుకొన్నంతపనైంది, ఈతుక్కులకొడుకెందుకొచ్చాడు? ఇందుకేనా? ఓరిలంజకొడుకా; మాఅయ్యగారితో కలేబడుతున్నావంట్రా?

దేవేం—(గోవిందుని కాలుసేతులు లుంగఁజుట్టిబట్టుకొని) సుబ్బూ! త్వరగా వీధి తలుపు దెఱచివేయుము!

సుబ్బ—శిత్తం! లంజెన్ని నంపినా పాపంలేదు. (నిష్క్రమించును)

దేవేం—(గోవిందు కత్తికొనిపోవును)

(రేవతియును మనోరమయు ప్రవేశింతురు)

మనో—(దేవేంద్రుఁడు పోయినవైపునకుఁ జూచి) అయ్యో! ఆపాపాత్ముఁడేవచ్చి వాఁడే?

రేవ—(తత్తరముతో) అమ్మా! యెవఁడువాఁడు?

మనో—పిన్నీ! వాఁడేడాక్టరు! శివపురంవాఁడు.

రేవ—ఎంతదుండగమువాఁడమ్మా! యింతవాఁడుగానిదే నిన్నిట్లు విపత్తులఁబడద్రోయునా? (నిరూపించి) యీకత్తులుచూచితివా? యేదేవునిపుణ్యమునవో నాభర్త ఆపదనుండి తప్పిపోయినారు!

దేవేం—(ప్రవేశించి) రేవతీ! మీరిక్కడికేలవచ్చితిరి?

రేవ—నాథా! యేదో కొంపమునిఁగినదని వచ్చితిమి. అనుకొన్నంతజరిగినది.

దేవే—మంచిపని చేసితిరి. (నవ్వుచు) నేఁడు నీవు రాకున్నచో నేనేమైయుందునో! ప్రియా!

రేవ—(సిగ్గునభినయించి) చాలులెండు! మేమెట్లును ఆడువారమేగదా! మేమేమి యడ్డుకొందుము?

దేవే—ఆడఁదానవైనచో నోరయాట యాడుము!

రేవ—సరే! ఏమిమాట్లాడినను దప్పే!

మనో—తండ్రీ! వాఁడేమిపనియుండి వచ్చినాఁడు? నాకొఱకేనా?

దేవే—మఱెందులకు వచ్చును? నిన్నుఁ జేరఁదీసికొన్నందులకు మాకుఁ బ్రాణసంకట మేర్పడుచున్నది. వాడెన్నియో విధములఁ జెప్పినాఁడు] కాదన్నాను. పిచ్చిది మాయింటలేదన్నాను. చివరకు వాఁడు నాపని పట్టించినాఁడు! అమ్మా! మనోరమా! ఈ క్రూరులతో నాకు విరోధమెందులకు? నిన్ను మఱల నాసుపత్రికిఁ బంపెదను.

మనో—(భయముచే వణఁకుచు) తండ్రీ! ఆమాటఁ దలపెట్టకుఁడు! ప్రాణములుపోవుచున్నవి.

దేవే—ఏమీ?

మనో—ఏమనియా?

తే॥ గోముఖవ్యాఘ్రమును, గప్పం బూఁతలిడెడు
త్రాఁచును, భిక్షుస్వరూపహంతకుఁడు వీఁడు
నొక్కరాశిగాఁదగువారు నిక్కమునకు
కసిపాలిట ననుఁబడం వేయుఁదగునె?॥ ౨

దేవే—(నవ్వి) మనోరమా! యేలభయపడెదవు? నిన్ను నేనువిడుతునా? ఈదుష్టులఁబుట్టించిన విధాతవచ్చినను నేను జడియువాఁడగాను. కాని, మీరింతటినుండి జాగరూకులై వర్తింపవలయును. ఈజట్టులో నింకెవ్వరెవ్వరున్నారో నేను కనుఁగొనుచుందును. ఎట్లయినను నీహంతకుల రహస్యమంతయు భేదించినఁగాని నాకుఁ గంటికిఁ గూర్కు రాదు! మీరిల్లు వెడలవలదు. ఇఁక మీరుపొండు!

రేవతి
మనోరమ } (నిష్క్రమింతురు)

దేవ—(తనలో) వీఁడు దారుణచరితుఁడు. కాని యశక్తదుర్జనుఁడు. ఎట్టివాఁడైన నేమి? కుక్కిన పేనువలెనయినాఁడు. నాయెదుటనా వీనిదురాగతము? ఈకత్తులు రెండును స్వీకరించి దాఁచియుంచెదను. అహాహా! ఏమివీని పాపబుద్ధి! నిన్నటిసాయంసమయమునఁ దులసీదాసునింటియొద్దఁ గనఁబడిన యువతియెవ్వతె? ముఖముజూడఁ బోలుగాకపోయినది. నడకయంతయు మనోరమవలెనే యున్నది. కావున నదియే మాయా మనోరమరైయుండవచ్చును, అది నన్నెవ్వరును దెలియుగాఁ దిలకించుచుండియుండును. అదియే తులసీరామునితోఁ బ్రస్తావించి మనోరమ యిక్కడనున్నట్లు గ్రహించి యుండును. ఇంతకంటెను గోవిందునకుఁ జెప్పిపంపువారెవరు? (కత్తులు రెండును జోడించి) ఇవి పదిలముగ దాఁచి యుంచెదగాక! పాపము గోవిందుడింకను లేవఁగినచో నీపాటికి గోవింద కొట్టియుండెడివాఁడు. ఇటిదద్దమ్మ లెందరైనను నాకు లెక్కలేదు. (డైరీపుస్తకముఁదీసి వ్రాసి) " ఆనంద కుటీరదారుణ చరిత్రములో శివపురవు డాక్టరు గోవిందప్రసాద నేనుఁడుగూడ నొక ప్రధాన పాత్రమైయున్నాఁడు. కావున నేటిరాత్రియే శివపురముపోయి యావైద్యాలయమును బరిశీలించి రావలయును ,, (అని చదివి) ఈ హంతకుల కన్నులలో దుమ్ముకొట్టుటకు మాఱు వేసములే కావలయును! శివపురమునుండి యానంద కుటీరమునకుఁబోయి శచీంద్రినిఁ గలసికొనవలయును! పరిస్థితులనుబట్టి యీరహస్యము శీఘ్రముగనే భేదింపఁబడునని తోఁచుచున్నది. ఇక వేషాంతరముతో నీరాత్రియే శివపురముఁ జేరెదగాక!

(నిష్క్రమించును).



రంగము — శివపురము ఆసుపత్రి.

(సేవకుఁడు మందుసీసా చేతఁబుచ్చుకొని ప్రవేశించి)

సేవ—(తనలో) ఇంతప్రొద్దుపోయినను డాక్టరు రాలేదు. ఇరువురురోగులు ఇప్పుడో యింకా కూశేపటికో వచ్చేటట్టున్నారు! నేనెంతమంది డాక్టరుల దగ్గ

అనో పనిచేసినానుగాని, యినుమంటి కరకోటకునిదగ్గర యెప్పుడు చేశాలేదు.

రోగి—(మూల్గుచు) అయ్యా! యీబాధపడలేను. పాలాస్త్రిగుడ్డలు కోసేకత్తితో పక్కమాటు నాగొంతుక కోయ్యరాదా? నీకు పుణ్నెంవుండును.

సేవ—యత్నం చెయ్యకున్నావోయ్! డాక్టరుగారియ్యమన్న మందులన్ని యిస్తుంటిని. ఇంతకంటె నేనేం చావమన్నావా? కొంచెంనోపికపట్టు.

రోగి—యేం నోపికపట్టను? పానాలుపోతుండయి.

సంకెళ్లు వేయబడిన పిచ్చివాడు } ఇహీహీ - ఆహాహా - ఉహూహూ! నానవ్వుకంటె నీపాపాలెక్కువేంటోయి! (బిగ్గరగా నవ్వును)

సేవ—(నవ్వి) పాప మతనిని వెక్కిరించెద వేమోయి? నోరుమూసికొని పడియుండు!

పిచ్చి—నువ్వే నోరుమూసుకో! యీసంకెళ్లే లేకపోతే యీపాటికి గుద్దుకు జచ్చిపోకపోయావా? ఇహీహీ - హీ - హీ (బిగ్గరగా నవ్వును)

సేవ—నీపిచ్చి నయమయిన పిదప గ్రుద్దుదువులే! యింకమాట్లాడకు!

(గూనిగల యొక వృద్ధక్షయరోగి వేషముతో దేవేంద్రుడు ప్రవేశించి తన చేతికఱ్ఱ నడుముపై నానుకొని దగ్గును.)

సేవ—(వృద్ధునిజూచి) తాతా! ఏమిపనియుండి వచ్చితివి?

వృద్ధు—(దగ్గుచు) అబ్బాయీ! డాకటరుగారున్నారా?

సేవ—లేరు. నిన్నమధ్యాహ్నం యెక్కడికోపోయారు యింతపొద్దోయినా రాలేదు. వచ్చే వేళగూడ మీరింది పాపం! కష్టపడివచ్చావు! యేంపనుంది తాతా?

వృద్ధు—యేంపనని అంటున్నావా? నాకూతురికి మందుచ్చుకుంటుంటే నాకొల్లుదామని వచ్చాను. ఆనాకూతు రేకుందో సూపియ్యగలవా? నీకు పుణ్నెం వుంటుంది అది పిచ్చికూతురు.

సేవ—యీడ పిచ్చోళ్ళు సాలామందున్నారు. దాని పేరేంటయ్యా?

వృద్ధు—దానికిచిన్నప్పటినుంచి పిచ్చే. కనకనే పిచ్చిదనిపిలుస్తుంటాం. మూఁడేండ్ల నుంచి యీడ మందుపుచ్చుకొంటున్నప్పుడు నువ్వింతమాత్రం తెలుసుకో లేవంటయ్యా?

సేవ—(స్వగతమభినయించి) ఆ పేఁరా? మనోరమ కాదూ? ఆమనోరమ నాలుగు రోజులనా డేడకుఁబోయిందో తెలియ లేదు. ఇంతవరకు దొరకలేదు. మూడేండ్లనుంచి చూస్తుండాను. ఆపిల్లకు పిచ్చుందనే రోగం. ఎంత మంచి దనుకొన్నావు! ఆమెకు పిచ్చిలేదు. రొచ్చులేదు. వొవరయ్యా ఆవిడికి పిచ్చుందని జెప్పిన పెద్దమనుసులు?

వృద్ధు—పేదరుగారు-డాకటరుగారు-మీ డాకటరుగారు చెప్పినారు.
సేవ—బలే బాగుంది. ఆ ఇద్దరూ పిచ్చోళ్ళే. నువ్వెంతెకన్నా పిచ్చోడివి నీకూ తురికె పిచ్చేదుందయ్యా! ఆవిడెంత మంచిదనుకున్నావు! చాలు లేవయ్యా నీమాటలూ నువ్వూనూ!

వృద్ధు—వొట్టోడివి నీకేం తెలుస్తుంది? పిచ్చిలేకపోతే పారిపోవటం యెల్లాగా? త్రికరణశుద్ధిగా నువ్వు చెప్పు నాకూతురు నిజంగాపిచ్చిదిగాదా?

సేవ—చాలు లెగవయ్యా! పిచ్చిదీగాదు రొచ్చిదీగాదు మాలచ్చిలాగ బంగారపు బొమ్మలాగున్న దాన్ని పిచ్చిదని ఆసుపత్రికిఁబంపేవు.

వృద్ధు—అబ్బాయీ! డాకటరుగారు రాలేదు. వారువొచ్చింతరువాత "దేవేంద్ర విజయమిత్రుడు తన కూతురిపిచ్చి యెల్లావుందో చూచిపోదామని వచ్చినాడు" అనిమాత్రం చెప్పు! (తనలో) మనోరమ పిచ్చిదిగాదనుట కనేక ప్రమాణములుదొరకినవి. వచ్చినపని యయినది. గోవిందుఁడింతకును రాకున్న కారణమేమి? ఈగుంపంతయు నేదియైన ఘోరముఁదలపెట్టెనో యేమో తెలియదు. శచీంద్రునిజూచి యింటికిజేరదఁగాక (పైకి) నాకూతురిక్కడకు వచ్చినపిదప నేను వచ్చినానని చెప్పు!

(దగ్గుచు నిష్క్రమించును)



రంగము—ఆనందకుటీరపు వెనుకటి.

ఉద్యానము—తురుష్క వేషధారియగు శచీంద్రుని ప్రవేశము.

శచీ—(తనలో) ఇంతవఱకును విజయము గలుగుచునే యున్నది. కొన్ని రహస్యములు బయల్పడియెను గాని యవి మామతోఁ జెప్పదమన్న వారింతవఱకును రాలేదు. (పరిక్రమించి ఆకసమువంకఁ జూచి) ఆహా! ప్రభాతమగుచున్నది.

మ॥ లలితోద్యాన నివాసి కోకిల కలాలాపంబు, భాగీరథీ
చల గంభీరతరంగ సంగతకము, పుష్పామోద సంక్షోభి ని
ర్మల మందానిల సంవిహార, మహా! మాన్యప్రభాతంబు ని
స్తుల సంసేవ రొనర్చుచున్న యది సంశుద్ధాకృశింబాంధులన్ ॥ ౬

మఱియును,

సీ॥ కొక్కొరో కోయన్న కుక్కుట ధ్వనులతోఁ
గాయకగాన విక్రాంతితోడఁ
బాఠకవేదాది పఠన ధ్వనులతోడఁ
గర్షకయత్న సంకలన తోడఁ
నలరించు గోవత్స కాంభారవములతోఁ
గ్రమత హేషించు నశ్వములతోడఁ
నంబరం బెగఁబ్రాకు నరుణకాంతులతోడ
విరహిణీ విరహుల వేఁగుతోడఁ

తే॥ కుముదములకుఁ జకోరంపు సముదయముల
కార్తియును, నబ్జములకుఁ జక్రావళులకుఁ
జొక్కటయుఁ దెల్పు నవ్వేఁగుఁ జుక్కతోడ
నీ యుషఃకాల మొకవింత యైయెలర్చె॥ ౭

మనోరమను జూచినది మొదలు నేనును విరహానలమున వేఁగుచునే యున్నాను. ఈ విరహమునకవధి యెప్పుడు గలుగునో తెలియదు.

(తెరలోఁ దగ్గు)

శచీ—(తెరవైపుఁజూచి నిరూపించి) ఎవ్వఁడీవృద్ధుఁడు?

వృద్ధు—(ప్రవేశించి తనలో) ఇతఁడెవఁడు? మనవాఁడేనా? ఆయనను దెలిసికొందును గాక! (దగ్గుచు ప్రకా) సాహేబుగారూ! మీరుబక్షు ఇటువచ్చినాఁడా?

శచీ—(తనలో) ఓహో! మామయె (ప్రకా-మెల్లగా)

చ॥ ప్రిదిలిన సంధిబంధములఁ బెల్లున నట్టిటులూఁగి-హూను కో
ముసుకనిఁ బోలుచుం, మఱి సముద్ధత పుం క్షయరోగపీడ కా
స్పద మనునట్లు దగ్గుచు, భృశంబుగ నూర్పులుపుచ్చుచున్న ఈ
య్యపెత మనీషి విష్ణు విజయుండవటంచు నెవండెఱింగెడిఁ?

మామా! యెక్కడినుండి రాక?

వృద్ధు—తరువాతఁ జెప్పెదను. ముందుగ నీసాధించిన రహస్యములు చెప్పుము.

శచీ—ఇక్కడ రామగులామునకౌషధమిచ్చి చంపినవైద్యుఁడు నవీనచంద్రుఁడు!

వృద్ధు—సరే! ఆసంగతి యిదివఱకే తెలిసినది. కుముదిని చావుమాట నిజమేనా?

శచీ—ఆమె బ్రదికియేయున్నది. ఈ విషయమున నేనోడిపోయితిని. కుముదునికిని నవీనచంద్రునకును నెలదినములక్రిందట వివాహమయినదఁట. వచ్చినది మొదలొక్క తెయే కానఁబడుచున్నది. ఇందొక చిత్రముగలదు! నేనిచ్చటికి వచ్చిన నాఁటి సాయంతనమున నొక యువతి యిచ్చటికో బండిపైబోయినది. అట్టి యువతియే కొంత సేపునకు నిచ్చటఁ గనఁబడినది. ఈ యిరువురిలోఁ గుముదిని యెవ్వరో మాయా మనోరమ యెవ్వరో నిశ్చయింపలేకున్నాను.

వృద్ధు—ఇంక నేమైనఁ జెప్పెదవా?

శచీ—ఏమియులేదు.

వృద్ధు—మొన్న సాయంకాలమునఁ దులసీదాసుని జూచివచ్చితిని. అప్పుడు నీవు చెప్పినకాంతయే నాకుఁ గనఁబడినది. ఇందుక నవీనచంద్రునిఁ గదలించి చూడకపోయితివా?

శచీ.— నేనూరకుండలేదు. నిన్న వానితో మాటాడి వానియొద్ద బండితోలు ఉద్యోగమును సంపాదించుకొంటిని ఇప్పుడు నా పేరు కరీమ్‌సాహెబు. సాధ్యమగునంతకు వీలునుబట్టి యానందపుటీర రహస్యములకొఱకు ప్రయత్నించుచునేయున్నాడను.

వృద్ధు.—(నవ్వి) నీ వేషమునకు దగినట్లే నీయుద్యోగమును చేరుచున్నది. ప్రమాదరహితుండవైయుండుము. శివపురపు డాక్టరు నాయొద్దకు వచ్చినాడు. వాడు మహాదారుణచరిత్రుడు. నన్ను జంపవలయునని వచ్చినాడు. వానినే పరాభవించి పంపితిని. కాళ్ళు చేతులు బంగగట్టి-ఆడువారు పుల్లి విస్తరాకును బాఱవైచినట్లు-వీధిలోనికి వానిని బాఱవైచినాను. అంతట నేనీ వేషముతో శివపురముపోయి యాసుపత్రిని జూచివచ్చితిని.

సీ॥ ప్రాణంబు పోవక ♦ బాధపడెడువారు
　　　రోగార్తులై యేడ్చి ♦ క్రుంగువారు
మతిపోయి కడుబిచ్చి ♦ మాటలాడెడువారు
　　　కొఱవి యొండోరులతో ♦ నవ్వువారు
మూల్గుచు శయ్యలం ♦ బొరలాడువారును
　　　గోవిందయని యార్తి ♦ గొణుగువారు
వికటహాసములం ♦ బండ్లికిలించువారు
　　　నొండొరులను దిట్టుచుండు హాగ

తే॥ నైనరోగుల కాస్పదం ♦ బగుచు, పిశాచ
సంఘముల కునికిపట్టు ♦ శ్మశానమట్లు
నరయ భూలోకనరకం ♦ బట్లునున్న
శివపురపు టాసుపత్రిం ♦ గాంచితి మదమున. ౫

మనోరమ పిచ్చిదిగాదని తులసీదాసుని నోటినుండియు గోవిందుని నోటినుండియు నప్రయత్నముగ జెప్పించితిని. ఆసుపత్రియందలి సేవకుండు ఘంటాపథముగా నామె పిచ్చిదిగాదని చెప్పుచున్నాడు! ఇన్ని ప్రమాణములు దొరకినవి. గోవిందప్రసాదుడు రాత్రి శివపురమునకు రాలేదు, దీనిని

బట్టి మనయింటఁగూడ మోసమునకుఁ దలపెట్టినట్లున్నది. యిఁక భోరొందను. నాకిక్కడఁ గాలును జేయియు నాడుటలేదు.

శచీ—మునుల నెప్పుడు వచ్చెదరు?

దేవే—అవసరమున్నప్పుడు వచ్చెదను. 17 వ అను సంపుటము నెట్లయినఁ బ్రయత్నించికనుఁగొనవలయును జాగ్రత్తగనుండుము. హృదయమున నేదియో కలఁత యుద్భవిల్లుచున్నది. జాగ్రత్త! (నిష్క్రమించును.)

శచీ—నేనిక్కడనుండి సాధించినదంతయు నీసహానుభావుఁడింటనుండియే సాధించినాఁడు అప్రమత్తుఁడనై యిందలి సర్వరహస్యములను భేదించెదను గాక! (నిష్క్రమించును.)



విష్కంభము.

రంగము—చక్రవర్తివీధి

(ప్రవేశము రామశాస్త్రియు, నారాయణాచార్యులును.)

రామ—ఆచార్యులవారూ! కలియుగాంతానికి ధర్మవిప్లవం సంపూర్ణంగా జరుగుతుందని చెపుతారే పెద్దలు! ఇంతవఱకయిదువేలయినను గాలేదు. అప్పుడే దుర్మార్గులు ప్రబలిచున్నారు. ఇదేంవింతండి?

నారా—ఇందు వింతేముంది? ఇతర యుగాల్లోకూడా అంతానికి ధర్మాలు చెడడమున్నా, శ్రీమన్నారాయణమూర్తి శంఖచక్రగదా శార్ఙ్గధారి- దివ్యమంగళ విగ్రహుఁడవతరించి దుష్టశిక్షణంచేసి ధర్మసంస్థాపన చేయడమున్నా, జరుగుతూనేవుంది. ఇది కలియుగం గనుకనున్నూ దీని నాయకుడు కలిఅనడంచేతనున్నూ, వీడిసాధనాలు కామక్రోధాదులు కావడంచేతనున్నూ ఆరంభంనుంచి అంతంవఱకూ ఇలా ధర్మవిప్లవం జరుగుతూనేవుంది.

రామ—ఇంత అన్యాయమటండీ? నరరూపరాక్షసుఁడు బినోదలాల ఛట్టోపాధ్యాయుఁడు అరిందం బోసు చేతిలోఁబడిపోయి రెన్నెల్లోకాలేదు! అప్పుడే మళ్ళీ దొంగతనాలు- హత్యలు- చెలరేఁగి పోతున్నాయి!

నార—వాఁడుపోతే యేంతక్కువ? వాడిగురువు కాలూరాయఁడు లేఁడా? వాడి యెంపుడుకత్తె జమిలియాలేదా?

రామ—(ఆశ్చర్యముతో) అమ్మ! ముండావాండ్లు! వాళ్ళుగూడావున్నారు?

నారా—వాఁడు సామాన్యుడనుకొన్నారా? మారీచుఁడూ వాఁడూ కవల పిల్లలనచ్చును. వాఁడికిన్ని వందలమందో శిష్యులు గూడాను అశిష్యులు పగలల్లా పెద్దమనుషులు రాత్రిళ్ళు చోరశిఖామణులు.

రామ—అమ్మబాబో! యిట్లాగే గొంపలుతీస్తున్నారు వాళ్ళు. అయితే జమిలియా యేమైంది?

నారా—వినోదచటర్జీని పట్టుకోవడంతోటే అదిపాఱిపోయింది. దాన్ని నేను పట్టుకొంటానన్నిన్నీ ఆ భారం నామీద వుంచమన్నిన్నీ దేవేంద్ర విజయమిత్ర బాబుగారు అరిందంగారినడిగి వాడని వదంతి ఇంతవఱకునూ దాని జాడా పోబడి తెలియలేదని విన్నాను.

రామ—అలాగైతే కాలూరాయిగాని జమిలియాగాని లేకపోతే దొంగతనాలు జరుగవు. హరేరామ హరేరామ। రామరామ హరే హరే॥ ఈ బజారున యెక్కడనో దొంగతనం జరిగిందని గుమారుగావుంది.

నారా—యెక్కడనో కాదు. శాస్త్రులుగారూ! మనమిత్తరు బాబుగారి యింట్లోనే జరిగిందఁట.

రామ—(అర్ధోక్తియందే గుండెపైఁగొట్టుకొని) అమ్మయొయ్యో! యెంతపని జరిగిందండి? సింహంగుహలోకే సింబోతులు చేరినారా? యింక మనబోంట్లకు దిక్కేముంది? ఆచార్లుగారూ? యేమైనాపోయిందా?

నారా—ఏంపోవాలెనండి? నగలూపోలేదు. నాణ్యాలుపోలేదు. యేంపోతే బాబుగారి ప్రాణాలుపోతవో అదేపోయింది. వారుశ్రీమంతులు. నగలుపోతే ఒక్కలెక్కలోనిది కాదు.

రామ—(అర్థోక్తియందే) అయ్యయ్యో! రేవతినే యెత్తుకపోయ్యారా? శివశివా! రామరామా! ఆచార్లుగారూ! ఆమె యెంతమంచిదనుకొన్నారు? ఆమె

రూపానికిఁ దగినట్లే ఆమె గుణములుగూడా ప్రశస్తంగావుంటయి ఆరూప గుణాలరెండింటికీ సరిపోయిన సంపదలుగూడావున్నాయి. శ్రీమహాలక్ష్మి లాగా కనుపడుతుంది. యెంత నిగర్వి అనుకొన్నారు? సీతారాములులాగ నలదమయంతులులాగ వుండే ఆదంపతులను చూస్తుంటే నేచాలండి! కష్టాలు యెంగవాండ్లకు తప్పవుగదా! పూచినతంగేడువంటి కాపురం వారిది! అయితే ఆయనగారు యింట్లో లేరాయేమిటి?

నా రా—ఆయన రాత్రియేదో పనిమీఁద యెక్కడికో గ్రామాంతరం పోయినారట సందుచూచుకొని ప్రవేశించినారనిపదంతి! లేకపోతే వాండ్లకీపాటికి చిత్రవధ కాకపోయిందా?

రామ—పాపము! యీపట్నంలో యిందరు పోలీసులుండిన్నీ యేంప్రయోజనం లేకపోయింది! యేంచేస్తాం? ఆపుణ్యాత్మురాలి కింతకీ యిల్లాకష్టాలపాలు గావలసి వచ్చింది.

నా రా—ఇంతమాత్రాని కాయనమనలాగ విచారిస్తూ కూర్చుంటాడా? వాండ్లను పట్టి తీరుతాడు మనమేంచేస్తాం లెండి పోదాంపదండి!

(ఇరువురును నిష్క్రమింతురు)



# మనోరమ

## తృతీయాంకము

(దేవేంద్రుని మందిరమునందలి వెనుకటిభాగము (దొడ్డి))

(బంధింపఁబడి నోట గుడ్డలుఁ గ్రుక్కఁబడి సుబ్బి పడియుండి మూల్గుచుండును)

(తెరలో)

హా రేవతీ! మనోరమా!

చ॥ తులువతనంబుమైనరులు ♦ దుందుడుకుల్ పొనరించుచుండ మీ
రలుమది నెంతకుందితిరొ, ♦ రాత్రిలనొంటిగ నింటియందు మి
మ్ముల విడనాడినందులకుఁ ♦ బొక్కుచు నెంతగ దూఱి యుంటిరో
నిలువవు నాదుప్రాణములు ♦ నేఁడు మిముంగనకున్న యార్తిచేఁ. ౧

(అప్పుడు చింతాక్రాంతుఁడగు దేవేంద్రుఁడు ప్రవేశించి)

దేవే—(తనలో) ఎక్కడనుంచిన వస్తువులక్కడ నేయున్నవి. శయనమందిరమున నెట్టిమార్పును గలుగలేదు. వరండలో రేవతి చేతిరుమాలు రక్తసిక్తమయియున్నది. హా! యెంతటివిపత్తు వాటిల్లినది? ఎవ్వతెను నాయాజీవప్రాణమని గారాబమునఁ జూచుకొనుచుంటినో, యేసుందరి మధురమందహాసచంద్రికలచే నానందపరవశుఁడనగుచుంటినో, యేసాధ్విపుణ్యవర్తనము నాయింటికిని బుట్టినింటికిని నమూల్యాంకారమైయుండెనో ఆరమణీలలామ-ఆనామోహంపురాశి-ఆనాతపఃఫలము-ఆనాగృహలక్ష్మి-రేవతి-హా! హా! నీచులచేఁబడిపోయినది! విషాదభారమున నాహృదయము కర్దగథచక్రము భారి గ్రుంగిపోవుచున్నది. నాగృహలక్ష్మి శత్రువులచే నాశము గావింపఁబడినది నానయనానందకారిణి యీలోకమునకు దూరమైపోయినది. నాభాగ్యము సర్వనాశమయిపోయినది. నారేవతియే నాశక్తి-నాధైర్యము-నాసాహసము

నాసంపద- నాజీవితము-(కన్నులు తుడుచుకొనుచు) అశ్రుజలముల కంతము కనఁబడుటలేదు. హా రేవతీ! హా రేవతీ! లావణ్యసంపదచే నిగనిగలాడు నీ మెమ్మోము శత్రుకరవాల విచ్ఛిన్నమైపోయెనా? లేనిచో నీచేతిరుమాలు రక్తప్లావితమైపోవ నేల? నీజీవితేశ్వరుఁడగు దేవేంద్రుఁడుండఁగ నే ఇంతటిభయానకపరిణామము జరిగిపోయెనా? నిర్భాగ్యుఁడనగునో దేవేంద్రా! నిహతశక్తివగు దేవేంద్రా నీకీప్రపంచమునఁబనియేమున్నది? (కూలఁబడి) ఏనిముసమున నీప్రాణమగు రేవతి నిన్నువిడిచిపోయెనదో యిప్పుడే నీకళేబరము భూమిపైఁబడిపోవలెదేమి? నీశరీరమున నర్థభాగము-నిట్టనిలువున-దారుణకృపాణధారచేఁ జీల్పఁబడిపోయెనే, తక్కినయర్థభాగము నెట్లు జీవించియున్నది? ఈప్రపంచమంతయు నంధకార పరిభూతమైపోవుచున్నది. (కన్నులు దుడిచికొని) కన్నులు తెఱచినను మూసినను నాకొక్కటియే చీకఁటి! అమూల్గుచున్నవారెవ్వరు? హా రేవతీ! హా రేవతీ యని వాపోవుచుంటినే! నావిలాపము ప్రతిధ్వనించుచున్నదా? ఈయమకార దావానలజ్వాలలచే వేగుచున్నాను, ఈవియోగసముద్రమహోన్నత దుఃఖతరంగములలోఁబడి యూఁదుచున్నాను. ఈజలములు జలములుగావు. బడబానలజ్వాలలచే సలసలఁగాగుచున్న యుష్ణజలప్రవాహములు! హా రేవతీ! హా మనోరమా! మీరు శత్రువులకుఁ జిక్కితిరా? (లేచిపరిక్రమించి) ఈమూల్గునకంతము లేదే! యెవరీమూల్గుచున్నవారు? (సుబ్బనొద్దకువచ్చి) హా! సుబ్బా! నీవేనా మూల్గుచుంటివి? ఎంత యమంగళము సంభవించినది? (సుబ్బబంధములు విప్పును.)

సుబ్బ—(లేచి యొడలుదుడుకొని) బాబూ! మీరు రాకపోతే యింకకూ కింత సేపటిలో జచ్చిపోయ్యేవాణ్ణి! (కన్నులు దుడుచుకొనుచు)

దేవే—సుబ్బా! ఈయన్యాయ మెవ్వరు చేసిరో చెప్పుము!

సుబ్బ—(ఏడ్చుచు) బాబూ! నేనే మెఱుగుదును?

దేవే—ఎవ్వరెవ్వరు వచ్చిరో యేమేమి చేసిరో చెప్పఁగలవా?

సుబ్బ—ముగ్గురు మొగమనుసులు! వక ఆడమణిసి వచ్చారు! బాబూ! ఆళ్ళు మొఖాలకు గుడ్డలు కట్టుగొనున్నారు. నేను నిదరోతున్నాను నాకాళ్లు చేతులు కట్టేశారు మేలుకున్నా. అరవఁబోయినాను నోట్లో గుడ్డలుకుక్కి-

వారు! ఆదమఱిచి యేమందంటే-"పనివేగవేగగా కావాలి-నువ్వు యీఁడఁల కకుండా యీడిరొమ్ముమీద కత్తిపట్టుకోనుండు! అరిచేదంటే పొడిచేయ్య అని చెప్పి వకవెంగోణ్ణి నాకాడనిలిపింది యేమైనకోంపములఁగ లేదుగందా? బాబూ!

దేవే—ఏమియు బోలేదు. మీయజమానురాలును మనోరమయును క్షేమైరో కఁన బడుటలేదు.

సుబ్బ—(దుఃఖముతో గుండెలుబాదుకొని అమ్మా! అమ్మా! నాకింక దిక్కెవరు? తల్లీ! నువ్వునన్ని డిచిపెట్టిపోయినావా? బాబూ! నాకింక దిక్కేది?

దేవే—దుఃఖింపకుము! అప్పుడెంత రాత్రియయియుండును?

సుబ్బ—మూఁడుగంటలుగొట్టినారు బాబూ!

దేవే—సరే! నీవిప్పుడొక పనిచేయఁగలవా?

సుబ్బ—చిత్తను!

దేవే—నీవిప్పుడు ఫరిదపురముపోయి గంగానదియొడ్డున నున్న యానందకుటీరమను పెద్దమేడకుఁ జేరుము!

సుబ్బ—చిత్తం చివరకారుకు ఆ ఆదమఱిచి నావద్దకువచ్చి యేలాగైనా దేవేంద్రుణ్ణి సంపుతానన్నాడని చెప్పుమన్నదండి! ఇఁక నా వెళ్లుతా (పోఁబోవును)

దేవే—పోయి యేమిచేసెదవు?

సుబ్బ—అమ్మగారక్కడనుందేమో నూస్తాను.

దేవే—ఆ మేడవెనుక నొక పెద్దతోటయున్నది. అందు ఫీరబక్ష్ముడను బండివానిని గలిసికొనుము

సుబ్బ—ఆయన మనదేవేంద్రబాబుగారుగాదంటండి?

దేవే—అవును నీకెట్లు తెలిసినది?

సుబ్బ—మీవద్దవున్నందుకంతమాత్రం తెలేదేంటి?

దేవే—నీవు చుఱుకుగలవాఁడవు అతనితో, (ఆనందకుటీరమునుండి రాత్రి నెవ్వరెవ్వరు బయలుదేఱియుండిరో ఎవరెవరు తిరిగి చేరిరో స్పష్టముగఁ దెలిసికొనుము. నీవా ప్రాంతముననే యుండుము. అవసరమైనప్పుడు నేను నిన్నుఁ గలిసికొందును.

సుబ్బు—శిత్తం బేగి బేగిరొల్తా (నిష్క్రమించును)

దేవే—(స్వగ) ఈసరికి శచీంద్రునికీ చౌర్యవృత్తాంతము సంపూర్ణముగాఁ దెలిసియుండును. రక్తసిక్తమయిన రుమాలువలనఁగాని, బంధితుఁడైన సుబ్బువలనగాని యావశ్యకమయిన వృత్తాంతము తేలలేదు. (పరిక్రమించి నిరూపించిఁ) ప్రహరీగోడపైఁ గొంగళిపఱవబడియున్నది. నీసపుపెంకులు గ్రుచ్చుకొనకుండ గొంగళియడ్డము! ఔరా! యెంత తెలివి? ఇక్కడ గస్తీతిరిగిన రక్షకభటులను విచారించి నిరూపణమున కుపక్రమించెదంగాక!

(ఇన్‌స్పెక్టరు రామకృష్ణముఖర్జీ ప్రవేశించి)

రామ—మహాశయా! ఎంత యాశ్చర్యకరమైన వృత్తాంతము వింటిని? సింగపుజడలు గడ్డిపఱకలనఁగొని కురంగములు చేరినవా? ప్రాణములతోఁ దప్పించుకొనిపోయినవా?

దేవే—కురంగములు గుహకుఁ జేరునప్పటికి సింగ మరణ్యాంతమున నున్నది. అప్పుడాగుహ నక్కబొఱియవంటిదే యగునుగదా? వేఁకువనే నాకుఁ గడుపులో మంటపుట్టినది. ఏమగునో యనుదిగులుతోడనే వచ్చితిని ఏమున్నది? రామకృష్ణా! సర్వనాశమయిపోయినది! ఏమి చేయుదును?

రామ—మీకెవరిపైననుమానముగలుగుచున్నది?

దేవే—నాకెవరిపైననుమానమున్నదో, వారితో నిన్నను మొన్నను మాట్లాడియే వచ్చితిని. ఏమిచేయుదును? ఈసంగతి రహస్యముగనుంచుఁడు! దిక్కులేని యొకయువతి శత్రుభీతయైవచ్చి నన్ను శరణము వేడినది. ఆమె శత్రువులే యింతపనికిఁ దెగించినారు.

రామ—నేనిప్పుడు మీకేవిధముగా తోడ్పడవలయును?

దేవే—రాత్రిఁ జక్రవర్తివీధిని గస్తీతిరిగిన రక్షకభటులను నాకడకంపుఁడు! ఇదే మీరువారిఁ జేయవలసినతోడ్పాటు, నెమ్మదిమీఁద సర్వమును మీకు విశదపఱచుకొందును.

రామ—మంచిది! ఆలసింపనేల? సెలవు!

దేవే—నమస్కారములు.

రామ—మీరు జయము నొందుదురుగాక!

దేవే—మీయాశీర్వాదమమోఘము

రామ—భగవంతుఁడట్లే చేయుఁగాక. (నిష్క్రమించును)

దేవే—(స్వగ) హా! మనోరమా!

చ॥ ఎఱుఁగుదు నిన్ను నెవ్వరు హరించి! రోరుక వెఱపింపఁబోయి తా
వెఱచిన చందమయ్యె నిను వెఱ్ఱిదటంచు వచించి వైద్యుఁ
జెఱనిడినట్టి కూళలకుఁ జేటొనరింపగఁబోయి, నిన్ను ని
త్తఱిఁగడు గోలుపోతి; బెడిదంబుల కెట్లు సహింతు నక్కటా. ౨

హా! యిట్టివైపరీత్యమెందైనఁగలదా?

చ॥ తడయక వాండ్రు మిమ్ము నడిదంబులచేఁ బరిమార్చినారొ, యీ
నడుపుఁదపంపుఁ జెల్వ తదుపద్రవకారి గృహంబునందు నె
య్యెడనయినం బదంబులకు శృంఖలలం దగిలించియుంచెనో,
మడసితిరో, సజీవులయి మంటిరొ యెట్లెఱుఁగంగ నయ్యెడున్? ౩

(అప్పుడు భయసింగను రక్షకభటుఁడు ప్రవేశింతురు)

జయ—(దేవేంద్రునకు నమస్కరించును)

దేవేం—గతరాత్రియం దీవీధిని గస్తీతిరిగినది నీవేనా?

జయ—చిత్తం. ఇన్‌స్పెక్టరువారు తమయొద్దకు బంపినారు.

దేవే—నీ వెన్ని గంటలవఱకుఁ దిరిగితివి.

జయ—మూఁడు గంటలవఱకుఁ నీ బజారునఁ దిరిగితిని.

దేవే—అప్పుడు మాయింటికి యెవరయినా వచ్చిరా?

జయ—అప్పుడొక పెట్టెబండి మీ వాకిటనిల్చినది! ఒక యాడుమనిషి యందుండి దిగినది. ఎవరోకదాయని నా చేతిలాంతరు వెలుఁగు నామె ముఖముపైకిఁ జేర్చి చూచితిని. మేలిముసుఁగున్నందున ముఖము గనపడలేదు. ఎవరో జమీందారుని భార్యయగు నను కొంటిని.

దేవే—పలుకరింపక పోయితివా?

జయ—ఏమో! గొప్పయింటియాడువారిని బల్కరించినచో నేమికోపింతురోయని యూరకుంటిని బాబూ! అంతటి చక్కని స్త్రీ యెక్కడను నుండదని చెప్పఁగలను.

దేవే—ఆబండికిఁ గట్టఁబడిన గుఱ్ఱము లెట్టివి?

జయ—ఒకటి తెల్లనిది రెండవది నల్లనిది. రెండుగుఱ్ఱములును శ్రీమంతులయింట నుండఁదగినవే.

దేవే—సరే! ఆమె యెక్కడికి బోయినది?

జయ—మీ యింటిలోనికే వచ్చినది. తమకగపడలేదా?

దేవే—నేనింట లేను ఉన్నచో బాగుగ నుండెడిది. తరువాత నీ వేమి చేసితివి?

జయ—నేను గస్తీ తిరుగవలసిన కాలము పూర్తియగుటచే నే తాక రహుకథలనిఁ బంపుటకు స్టేషనుకుఁ బోయితిని,

దేవే—అతని నిక్కడకుఁ బంపుము!

జయ—చిత్తము! (నిష్క్రమించును)

దేవే—(తనలో) ఎంతదురాగతము చేసిరి? పాపము నోరెఱుఁగని మబ్బు నవ్వా యమునుగఁ గాలుసేతులు బంధించి నోట గుడ్డలుగ్రుక్కి పోయిరి! ఏమి యీ నీచుల సాహసము! నే నింటనున్నట్లయిన నన్ను వధించి పోవుదురనిరా

వచ్చిరి. నేను లేకపోవుటయే వీరికి మేలయ్యెను. నాయెదుటఁబడినట్లయిన వీరినందఱను బంధింపకుందునా? ఆమువ్వురుపురుషులలో శచీంద్రుఁడు లేడు ఆ బండితోలుటకు శచీంద్రు నేల నియోగింపకపోయిరో, ప్లీడరో డాక్టరో బండితోలు నుద్యోగముసంపాదించికొని యుందురు?

(అప్పుడు రఘువీరపాండ్యా యను రక్షకభటుఁడు ప్రవేశించును)

రఘు—కన్నులు నులుముకొని ఆవులించి) అయ్యా! నన్ను రావించిన పనియేమి?

దేవే—కొంచెము పనియున్నది, రాత్రి నీ వెన్నిగంటలకు నీవీధికివచ్చితివి?

రఘు—మూడుఁ గంటలకు.

దేవే—అప్పుడు మాయింటిముంగిట నిలిచియున్న బండినిజూచితివా? అందెవ్వరెవ్వరుగలరో చెప్పగలవా?

రఘు—బండిని జూచితిని గాని యందెవ్వరును గనబడలేదు, ప్రభూ! గుఱ్ఱముల కళ్లెములను బట్టుకొని యొకబాలుఁడు నిలువబడియున్నాఁడు.

దేవే—నీవతనిఁ బలుకరించియుంటివి కాదా?

రఘు—బండివారెవరని యడిగితిని. వారు లోనికేఁగియున్నారని చెప్పెను. అక్కడి నుండి నేను పురమంతయుఁ దిరిగివచ్చితిని.

దేవే—నీవు తిరిగివచ్చునప్పుడైనను బండివారు నీకగపడిరా?

రఘు—అప్పుడే బండిపోవుచున్నది.

దేవే—ఆబాలకుఁ డేమయ్యెను.

రఘు—అతఁడు నాకగపడలేదు. బహుశః తనయింటికిఁ బోయియుండును,

దేవే—అతనిని నీవు గుఱుతింపగలవా?

రఘు—ఆ! మీకెప్పుడు కావలయునన్న నప్పుడు తోడ్కొని రాఁగలను.

దేవే—పాపము! రాత్రియంతయు నీకు నిద్దుర లేదుగాఁబోలును!

రఘు—చిత్తము ప్రభూ!

దేవే—నీకు నిద్దుర కావలయునా? రెండురూపాయలు కావలయునా?

రఘు—(సంతోషముతో) రూపాయల గలగల ధ్వనులముందు నిద్దురపట్టునా? అతనిని దోడ్తెత్తునా?

దేవే—త్వరగాఁ దోడ్కొనివచ్చి నీబహుమానము నీవు గైకొనుము!

రఘు—చిత్తము. (నిష్క్రమించును)

దేవే—(స్వగ) రేవతీ మనోరమలను జంపుటకేకదా వీరి యీనీచపుఁబన్నుగడ! అట్లయినచో వారికానంద కుటీరము దక్కునా? దేవేంద్ర విజయమిత్రుఁడు ప్రాణములతో నున్నంతవఱకును వీరిని విడువఁగలఁడా? ముగ్గురు మలవ సన్యాసులను జేరఁదీసికొని యది యెంతెంత ఘనకార్యములు సాధించుచున్నది! త్వరలో వీరికి నలువురకును సంఘమరణము తప్పదు.

(రఘువీరుఁడొక నవయావ్వనుని దోడ్కొని ప్రవేశించి)

రఘు—అయ్యా! ఇతఁడే యాబాలుఁడు!

దేవే—మంచిది (రెండురూపాయలు రఘువీరునకిచ్చి) ఇఁక నీవుపోయి యీప్రహరీగోడ చుట్టునుదిరిగి విశేషములు కనుఁగొనిరమ్ము!

రఘు—చిత్తము (నిష్క్రమించును)

దేవే—(శశీచంద్రునిఁ దేఱిచూచి) (తనలో) ఇతని యాకారముఁజూడంజూడ, ముందునుండొక ప్రసిద్ధపురుషుఁడు గాఁగలఁడని తోఁచుచున్నది నిబ్బరమైన గుండెవాఁడు. రహస్యగోపన మీతనిసొమ్ము! (ప్రకా) అబ్బాయీ! చాల బడలికగానున్నావు. నీపేరేమి?

బాలు—నా పేరు శ్రీశచంద్రరాయలందురు! బడలికగానేయున్నది?

దేవే—పాపము రాత్రి నిద్దురలేదుగాబోలును! నీవు నాటకములుచూడ నిష్టపడవే!

శ్రీశ—మీరు సరిగానే చెప్పితిరి. రాత్రి మామేనమామగారియింటికిఁబోయితిని. అక్కడినుండి యింటికిఁజేరునప్పటికిఁ దెల్లవాఱవచ్చినది అంతట నిద్రించి

ఇప్పుడు లేచివచ్చితిని అబ్బా! అబ్బా! కనురెప్పలు బలవుగా మూసికొనిపోవుచున్నవి. ఇతనిబలవంతముచే వచ్చితినిగాని లేకున్నచో సాయంత్ర సమయమునను నిద్దరపోవుచుండువాఁడనే!

దేవే—(నవ్వి) ఇతని నీవెఱుఁగుదువా యేమి? చనవుగా మాటాడుచున్నావు.

శ్రీశ—ఓహో! అంతమాత్రమెఱుఁగనా? మాది యొకయూరే కాదా? ఇతని పేరు రఘు వీరపాండ్యా!

దేవే—ఓహో! నీవు చాలఁ దెలివికలవాఁడవు! రాత్రి నతని నెక్కడఁ జూచితివి?

శ్రీశ—మాయింటిముంగిట నిల్చుండియుండఁగా నితఁడు నాకుఁ గనఁబడినాఁడు.

దేవే—ఇక్కడ నెందులకు నిల్చితివి?

శ్రీశ—ఎవరో శ్రీమంతులు బండియక్కడ నిల్పిరి. బండివాండ్రు మువ్వురు నన్నుఁజూచి కొంచెముసేపువఱకు నీగుఱ్ఱముల కళ్ళెములఁ బట్టుకొనియుండుడని చెప్పిపోయిరి!

దేవే—నీవు బుద్ధిమంతుఁడవు కనుకనే యంగీకరించితివి. వారప్పుడు లోనికిఁ బోయియుండిరి కాదా?

శ్రీశ—ఎందుకు నన్ను విసిగించెదరు? నాకు నిద్రవచ్చుచున్నది. నేఁబోయెదను సెలవిండు.

దేవే—(జేబునుండి ౫ రూ నోటుతీసి శ్రీశచంద్రుని చేతఁబెట్టి) సంతోషింపుము నేనడిగిన ప్రశ్నములకు జవాబొసంగుము!

శ్రీశ—(కన్నులు నులుముకొని దేవేంద్రుని దేఱిచూచి సంతసముతో) ఇది కలయా? నిజమా? అయ్యా! దీనితో నాకేమి పనియున్నది?

దేవే—నీకైదు రూపాయలెక్కడనో, ఒకపూట నిద్రయెక్కడయో యాలోచించుకొనుము.

శ్రీశ—(నవ్వి) నాకు రూపాయలే ముఖ్యము! ముష్టి నిద్ర యెప్పుడైనను పోవచ్చును లెండు, ఇఁక మీ యిష్టమువచ్చినట్లు నన్నడుగుఁడు; చెప్పెదను.

దేవే—(నవ్వి) ఇప్పుడు నీ నిద్రయంతయు నీ మేనమామకూఁతునకుఁబట్టినది. ఆమె కెన్ని యేండ్లున్నవి?

శ్రీశ—పదేండ్లున్నవి.

దేవే—భేష్! మీరాయిద్దఱును దగినవారే. అంతరాత్రివఱకును ఆపిల్లను నిద్దుర పోనీయక సరసములాడుదువా?

శ్రీశ—(సిగ్గుతోఁ దలవంచుకొని) మీరుబలే పెద్దలు! మావదినె నన్ను విడిచినది గాదు. ఆపిల్లతో నేను మాట్లాడను (నవ్వును)

దేవే—వారియింట నెందులకుమాట్లాడవులెమ్ము! మంచి చాఁకచక్యమైన స్నేహితుఁడవు దొరికినావు! నీవెంత సేఁపు కళ్లెములను బట్టుకొంటివి?

శ్రీశ—అఱగంట సేఁపటివఱకును.

దేవే—సరే! లోనికిఁబోయిన ముగ్గురును పురుషులు, అందుసిద్ధలు బండియజమానులును, ఒకఁడు బండితోలువాఁడును, సరే! వెలుపలకెందఱు వచ్చిరి?

శ్రీశ—ఆముగ్గురితో నొక స్త్రీకూడ వచ్చినది. ఒకనియొద్ద నొక మూట యున్నది.

దేవే—నీవప్పుడు బండియొద్ద నేయుంటివా?

శ్రీశ—లేను అశ్వనేతకుఁడువచ్చి "అబ్బాయీ ఇఁక నీవుపొమ్ము! చాలవలసితివి" అని చెప్పి కళ్లెములను తానే పుచ్చుకొన్నాఁడు. నేనుకొంతదూరముపోయి యేమిజరుగునోయని దాఁగి చూచుచుంటిని.

దేవే—ఏదో వింతజరిగియుండును నే!

శ్రీశ—జరుగకేమి? యిద్దఱు స్త్రీలు వచ్చిపోయినట్లే బిగిసికొనియుండఁగా వారిని బండిలో వైచుకొన్నారు; ఆశవకులను అరాత్రివేళఁజూచినచో నింకొకఁడైన యెడల డొక్కచిద్దలయి చావవలసినదే! నామట్టునకు నాకే గుండెలు దడదడకొట్టుకొని-పోయినదేపోకగాఁ బరువెత్తి, మాయింటిగుమ్మము నెక్కి-మఱల వెనుకకుఁదిరిగి చూచితిని.

దేవే—మంచిపని చేసితివి. నీవు చాల ధైర్యవంతుఁడవే కాని, వారేమేమి చేయుదురో వెంట నేపోయి కనుఁగొన్నచో చాల బాగుండెడిది!

శ్రీశ—ఏమి చేయుదునండీ? మనుష్యమాత్రుఁడెవఁడైన పట్టినసమయమునఁ గన్నులు తెఱచి చూడఁగలఁడా?

దేవే—నిజమే! నీవు చెప్పుచుండఁగా నాకే యెంతో భయము గలుగుచున్నది, వారిని నీవు గుర్తుపట్టఁగలవా?

శ్రీశ—ఇద్దఱు పురుషులను బాగుగా గుఱుతింపఁగలను. మూఁడవవాఁడు దూరమునుండి కనఁబడినాఁడు కావున నా పురుషుని గుఱుతింపఁజాలను.

దేవే—వారప్పుడు వేషములను మార్చుకొనిరి గాదా?

శ్రీశ—లేదు. మొదటి దుస్తులతోనే చివఱకుఁ గనఁబడినారు.

దేవే—వారి నెప్పుడైనను గుఱుతు పట్టఁగలవు గదా?

శ్రీశ—అందులకు సందేహింపకుఁడు!

దేవే—నీకిప్పుడు పదిరూపాయలును, దొడుగుకొనుటకు మంచి దుస్తులునిచ్చెదను. ఈ దినమున నా వెంట నేరావలయును. (శ్రీశుని చేయిపట్టుకొనును)

శ్రీశ—(ఉలిక్కిపడి) ఎందులకు?

దేవే—భయపడకుము! వారిని నాకుఁ జూపుటకే రావలయును, అంతకంటెను నీవేమియు చేయనక్కఱలేదు.

శ్రీశ—బాబూ! కుడిచి కూర్చుండలేక నా ప్రాణములమీఁది కేల తెచ్చికొనవలయును? నన్ను విడిచిపెట్టుఁడు! మీ పుణ్యమాయని బ్రతికెదను.

దేవే—నేనుండఁగా నీకు భయమేల? నీబుద్ధిసూక్ష్మతయు, నీధైర్యమును నాకుఁ జాల నానందముఁ గూర్చుచున్నవి. నీ వెంతమాత్రము భయపడనవసరము లేదు. ముందుముందు నీకొక గొప్పయుద్యోగము నిప్పించెదను. నీవొక గొప్ప పత్తేదారుఁడవై, ధనమును కీర్తియు సంపాదించుకొందువు. నే నెవఁడనో యెఱుఁగుదువా?

రఘు—(పరీక్షించి) అయ్యా! కంబళి పఱచినచోటునకుఁ గ్రిందుగా గోడవెంబడి నెనిమిది యిటుక లొకదానిపై నొకటిగాఁ జేర్పఁబడియున్నది అంతకంటె నింకేమియు లేదు.

దేవే—మంచిది ఆయిటుకలగోడ దుమికి వచ్చియుందురు. సరే! శ్రీశచంద్రరాయా! నన్నుఁగూర్చి యీతని నడుగుము! ఇతఁడు నీపరిచితుఁడేకదా!

రఘు—ఓయీ! ఈయనచాల మంచివారు! గొప్పవారు! అరిందం మాష్టరువారి శిష్యులు! దేవేంద్ర విజయమిత్తర్ బోసు.

శ్రీశ—(ఆశ్చర్యముతో) వినుటయేకాని యెప్పుడును దర్శనము చేసియుండలేదు. ఇంతవఱకును దెలియక మాట్లాడినందులకు క్షమింపుఁడు! ఇఁక నాకు భయములేదు. మీ యిష్టముచొప్పున వచ్చెదను. ఎన్నాళ్ళుండవలయును?

దేవే—ఎన్నాళ్ళో నా? ఒకటిరెండుదినములు చాలును. అటమీఁద నీయిష్టము!

శ్రీశ—నాకట్టి యభ్యంతరముండదు. ఎన్నాళ్ళుండుమన్నను నుండుదును. (తనలో) ఈ మహానుభావునకును నీయింటజరిగిన ఘోరకృత్యమునకును నేమిసంబంధము? (ప్రకా) అయ్యా! కొన్ని సందేహములు తీర్చుకొందును.

దేవే—భయపడక అడిగితీర్చుకొమ్ము! రఘువీరా! నీవుపోయి పరుండుము!

రఘు—చిత్తము (నిష్క్రమించును.)

శ్రీశ—ఆ స్త్రీలకొఱకేనా మీప్రయత్నము? అయినచో వారికిని మీకునుగల సంబంధమేమి?

దేవే—అపహరింపఁబడిన యిరువురు స్త్రీలలో నొకతె నాభార్య రెండవయామె నాకూఁతురు. తెలిసినదా?

శ్రీశ—చిత్తము! తమవంటి గొప్పవారికిగూడఁ గలుగుచున్నవి. మీవంటి ధైర్యవంతులు లోకమునందుండరు.

దేవే—మనమీపగలు ఇక్కడనే విశ్రమించి సాయంకాలమునఁ బయనము సేయుదము.

శ్రీశ—రామకృష్ణ ముఖర్జీగారితో మాటాడవలసినది.

దేవే—ఎందులకు? తరువాత వారితో మాటాడవచ్చునులెమ్ము!

శ్రీశ—నిజమే! వారి నడుగఁగానే కొంతపోలీసు పటాలమును బంపుదురు ఆగడబిడలవల్ల రహస్యము మఱింత గుప్తమగును.

దేవే—శ్రీశచంద్రా! నాకును రేయంతయు నిద్దురలేమిచేఁ జాలబడలికగానున్నది. కావునఁబోయి విశ్రమింతమురమ్ము. పండుకొన్నను నిద్దురపట్టునట్లు లేదు. ఈనాకష్టమునకంతకును మూలమయిన యాదుష్టులు చిక్కినంతవఱకును నాకు నిద్రపట్టదు! (క్రోధావేశముతో) ఓరోరి ఘోరచరిత్రులారా! పాపాత్ములారా! యిఁకఁగాఁచికొనుఁడు?

శా॥ కారాగారనివాసమో, మరణమో, కాకున్న ద్వీపాంతర
స్థారావాసమొ మీకు నయ్యెడిని; తప్పింపఁబోదు: నాయింటనే
క్రూరత్వంబునకుం గడంగితిరి: శ్మశ్రూద్ఘాటక్రుద్ధసిం
హారావస్ఫురణ ప్రసారములు పొల్లై కల్లలై చెల్లునే?. ౮

శ్రీశా! యిఁకఁబోవుదమురమ్ము! నీకుఁగొన్ని యుపాయములు నేర్పెదను.

(ఇరువురును నిష్క్రమింతురు)

తృతీయాంకము సమాప్తము.



# మనోరమ

## చతుర్థాంకము

### రంగము తులసీదాసుమందిరము

(నవీనచంద్రుఁడు-గోవిందప్రసాదసేనుఁడు-తులసీదాసును కూర్చుండి యుందురు)

తుల—(చేత సారాయిబుడ్డిపట్టుకొని త్రాగుటనభినయించి) నవీనబాబూ! బైరాగులగు జ్ఞానవర్తి, అనఁగా గంజాయియెట్టిదో, కవులకును బండితులకును ముక్కుపొడుమెట్టిదో మనవంటిరసికోత్తములకు బ్రాందియు సారాయము నట్టిదే, తాముగూడ నించుక స్వీకరింపుఁడు! (బుడ్డి నవీనునకిచ్చును.)

నవీ—(సారాయిపుబుడ్డిని బరిశీలించి) మహాశయా! యిది న్యూయార్కు-నుండి దిగుమతియయినట్లున్నదే! (త్రాగుటనభినయించి) హాయ్ హాయ్! కొందఱు హరికథకులుగూడ నిదిలేక తమకథా కథనచాతుర్యము నెఱపఁజాలరని విందును (గోవిందునిఁజూచి) గోవిందమహాశయా! మనము పూర్వమును సుఖదుఃఖములలో సమభాగులమయియున్నాము; కావున దీని సౌఖ్యముగూడ తామించుకయనుభవింపుఁడు! (బుడ్డి గోవిందునకిచ్చును.)

గోవిం—మంచిది! (బుడ్డిఁగయికొని) స్నేహమన నిట్టిదే! స్నేహమనఁగా చమురని యర్థము. ఒడలికిఁబూసికొన్నచోఁ జమురెట్లువదలదో మైత్రియు నట్టిదే కనుకనే మైత్రికి స్నేహమను పర్యాయపదమును బూర్వులేర్పఱచియుందురు! (త్రాగుటనభినయించి) ఆహాహా! ఎంతయానందము! జగన్మిథ్యాత్వమిప్పటికనుభవమునకు వచ్చుచున్నది. అంతయు నానందమయము! ఇఁక వేఱొకటి యీజగమున లేదు. (తనలో) నిన్నటి సాయంకాలమున దేవేంద్రుఁడు ముఖముపై గ్రుద్దియుండెను. ఆబాధ యింతటనయముకావచ్చును అబ్బా! పిడుగువంటి గ్రుద్దు గ్రుద్దినాఁడు మూర్ఖుఁడు!

తుల — మహాశయా! అంతయు మీ చేతి్రవుచుంటిరే! (బుద్ధిపీటికొని) (తనలో) జూమల తనజీవితమును దన ధనమును నాకొప్పగించినది. ఇఁక విశేషదివసము లుగడువవక్కఱలేదు. (ప్రకా) ఇప్పటికే జేజేందు్రిఁడు మరణమునకు సన్నద్ధుఁడైయుండకతప్పదు! చూడుఁడు! రేపుపదిగంటలకు వతని యంత్య క్రియామహోత్సవమును మనము కనులారఁగాందుము!

గోవిం — మీరు చెప్పినట్లు వాఁడు చావఁడు! వాఁడు మనకొఱకే రొదురుసూచు చుండును. వానిపిండాకూడు! ఇంకేమి చేయఁగలఁడు! మనరహస్యము బ్రహ్మభేదము. (తనలో) ఆనందకుటీరసంపదలలో నానాల్గవవంతు రేఁపువా్రి యించుకొని తీఱుదును. (ప్రకా) రేపుమన భాగములు పంచుకొనవలసియుం డును ఏమందురు?

నవీ — (తనలో) వీనికి రేపో మాపో విషప్రయోగము చేసి యుందు రాజ్యమున భాగమి ప్పించెదను. దగ్గఱకుఁ జేరఁదీసి నెత్తికి చేదరాచి పంపుటకన్న లౌకికత్వము మఱొండులేదు. (తెరవైపుజూచి) ఏమిప్రియతమా! గోవిందుని ప్రశ్నము నకుత్తరము చెప్పుము! (తెరలో శ్రీ)

నీయభిప్రాయమే నాయభిప్రాయము గాదా! నవీనా! నన్నడుగు టెందులకు?

తుల — (తనలో) ఈనవీనుఁడు నిన్న పెన్నవచ్చిన వంక! ఏమిప్రియతమా! యని యడుగుటయు జూమల తమయొుండొరుల కభేదాభ్యవహాయము చెప్పు టయు నాకు నిరాశగలిగించుచున్నది. కానిమ్ము! ఎట్లయినను దీనిని నావ శముఁజేసికొనక మానను.

నవీ — (గోవిందునితో) అల్లేవయుకొందము! బాబూ! గతరాత్రి రేవతీ మనోరమ ల నెత్తికొనివచ్చుటలో నవనికెక్కువ కష్టముగలిగినదో యించుక యోచిం పుఁడు!

గోవిం — మనము నలువురమును సమముగాఁ గష్టపడితిమి. ఈమూఁడేండ్లనుండియు జూమలకు సర్వవిధములఁ దోడ్పడినవారము మనముప్పరమేకదా! ఇంకెక్కువ తక్కువలు నిరూపింపనేల?

వలీ—ఏలయన? మూఁడువత్సరములనుండియుఁబడిన కష్టములనుబట్టి మీరన్నట్లు సమభాగస్థులమే కావలసియుండెను. కాని-నీ చేతులాఁటఁ బోఁగొట్టుకొన్న మనోరమను దిరిగి తెచ్చుటలో మిగుల శ్రమలఁబడినవారుండిరిగనుక, నంతరాంతములు అనఁగా దారతమ్యములనుబట్టి భాగలబ్ధిఁ గోరుట ధర్మము!

గోవిం—(అర్థోక్తియందే) అట్లయిన నిందఱకంటెను నేనే యెక్కుడు భాగమునకర్హుఁడను ఏలన,-

తుల—(అర్థోక్తియందే) ఏలయననేమి? మనోరమ సర్వస్వమును జామలచేతి కొప్పగించినవాఁడను నేనుగదా! నాకెక్కువ భాగము రావలదా? మఱియు దేవేంద్రుని యింటివెనుక గోడపైఁ గంబళిపఱచి యెక్కుడుమికి నానాశ్రమలఁబడి వచ్చితిని. (తెరలో స్త్రీ)

ఇప్పుడు మీరు సారాయపు మైకముచేఁ దప్పఁ బేలుచున్నారు! నోరుమూసికొనుఁడు!

తుల—ఇది కేవలమును మైకముఁ గలిగించునంతటిదిగాదు! కావునఁ బ్రమాదరహితులమైయే, కార్యాలోచనకుఁ గడంగుచున్నారము! నేను మనోరమయొక్క సర్వసంపదలను నీకుఁ గైవసము చేసితినంటిని. )ఇది మైకపుమాటయే నా? నీవప్పుడు రాకపోయినయెడల మనోరమ నాయర్థాంగియయ్యెడిది. ఆయాస్తి యంతకును నేనే సంపూర్ణ స్వామినయ్యెడివాఁడను. జామలా! తులసీదాసుఁడన నీవింత నీచముగాఁ దలఁచుచుంటివేమి? ఎదుటిపార్టీ ప్లీడరులకు దిగులు పుట్టునట్లు, న్యాయాధికారులకు మనస్సు వికలమగునట్లు ఆర్గిమెంట్లు చెప్పి యెంతెంత ఖ్యాతిఁ గాంచుచుంటినో, నీవెఱిఁగియున్నట్లు నీచముగా మాట్లాడుచుండువే! (తెరలో స్త్రీ)

నిజమేనయ్యా! మనోరమ ప్రాణంబులతో నున్నంతవఱకును భాగస్వాములెవ్వరును నోరెత్తకుఁడు! ఆమెను మఱల నెందులకుఁ దెచ్చితిమో యెఱుఁగుదురా?

తుల—(ఉలికిపడి) మనోరమను జంపవలయుననియే నా తెచ్చితివి?

నవీ—కాక మఱెందులకనుకొంటివి? (తనలో) కుముదినియు నాకుఁ బ్రియమైనదియే. జామల! కుముదిని! ఆహా! ఇరువురు సుందరీమణులు నాకు భార్యలు! నాయదృష్టమే యదృష్టము!

చ॥ మనసులు రెండు నేకమయి మాటలుఁ జేతలు నేకమై, ధనం
బును బరివారమున్ గలిగి పొందుగ నిర్వురు సుందరీ మణుల్,
ననువరియించి సంతసము నన్ భజియించెదువారుగాన నా
జనువు కృతార్థ; మన్యనర జన్మము లిత్తర నెత్త నేటికిన్ ౧

(పరిక్రా) జామలా! నీకంటెను గర్తవ్య నిశ్చయ మెవఁడెఱుఁగును?

తుల—(తనలో) హా! హా! మనోరమను వధించెదరా దురాత్ములు? సాధ్యమైనంతవఱకు దానిని బ్రతికించుకొందును గాక! దురాత్ముఁడగు దేవేంద్రుఁడు నాకొనరించిన పరాభవము వేయి జన్మములకైనను మఱవఁదగినది కాదు! కావున రేవతిని నాస్వహస్తములచే విధ్వస్తఁగావించెదను. (పరిక్రా) జామలా! పాపము మనోరమను జంపక మఱల నానుపత్రిపాలు గావింపరాదా?

(తెరలో స్త్రీ)

ఆనుపత్రికేల పంపవలెను? అది బ్రతికియున్నఁ దేవఱకును దేవేంద్రవిజయుఁడు మనలఁ బరాభవించుటకే యత్నించును,

గోవిం—వానిబనియే పట్టించినచో మనలనాతఁడడ్డుకొను టెట్లు? కనుక నీరాత్రియే వాని నంతమొందించుట మంచిది! వెదకినచో మనకు దొరకకపోఁడు! దొరకి చావక మానఁడు, వాఁడు నిన్నటిసాయంకాలమున నాతో ద్వంద్వయుద్ధమునకు దిగి నామణికట్టుపై గ్రుద్దిన గ్రుద్దునకు నారొమ్ము విఱిగిపోవలసినదే! కనుక మనోరమను నామోస్పటలునకుఁ బంపుఁడు! అక్కడనే నిర్బంధమున నుంపవచ్చును. మీరు మువ్వురును నాకించుక సాయముగానున్నచో నామార్తుని జితప్రభముఁగావించి యరిందముని యింటిలోఁ బడవైచివచ్చెదను. ఊఁ!......నాకంత కసిగానున్నది.

గుమస్తా—(ప్రవేశించి) గుడ్ నైట్ సార్! (తులసీదాసునితో) మహాశయా! కృష్ణవాటికనుండి గోపాలభట్టాచార్యుఁడు తమతో మాటాడుటకువచ్చి దర్శనముచేయనున్నాఁడు! సెలవైనచో వారిని దోడ్తెచ్చెదను.

తుల—(బ్రాహ్మడితో) ఏడిసినట్లేయున్నది! రామాయణములోఁ పిడుకలవేఁట. కొంచెముపని మీఁదనున్నాననియు, ఆఫీసుగదిలోనికి నేనేవచ్చి మాట్లాడెదననియుఁ జెప్పుము! నీవైనను అవతలనుండి, రావచ్చునో రాఁగూడదో యడుగవలదా?

గుమా—చిత్తము! క్షమింపుఁడు! (తనలో) ఈమోటుముండకొడుకెప్పుడును నిట్లే ప్రేలుచుండును. ఎన్ని సంవత్సరములనుండియో వీనిసేవచేయుచుంటిని వీనికి మరియాదయే తెలియదు. ఫస్టుతేదీకీయవలసినజీతము ఇరువదిదినములుగడచినను నీయఁడు వీనిమొగముమండ. వీనికదృష్టరేఖ యేచంకలో భగవంతుఁడు వ్రాసెనోగాని లేకపోయిన మ్యునిసిపల్ పాకీబండినీడ్చుచున్న పోతునకితేఁడన్నయో తమ్ముఁడో కావలసియుండెను. పార్టీలవద్దనుండి గుమాస్తాననుమని లాగికొని యొక్కదమ్మిడియైనను నాకు రానీక యంతయుఁ దానేమ్రింగును బ్రాహ్మణహోటలులోని యెంగిలిపచ్చడులను మ్రింగినట్లే యుభయపార్టీలనుండియు ధనముగ్రహించి మ్రింగుచుండును. వీనికి గొంతుకలోఁ గొండనాలుక లేదు. ఎప్పుడును జూఱదుఱఁ జూచుచుండును. ఎప్పుడో యొడలుమండి నేనే వీనిపెండ విఱిచివైచెదను. నాకంత మంటయున్నది.

తుల—పోవేమోయి? మామాటలకును నీకును సంబంధము లేదు.

గుమా—క్షమింపుఁడు! మిమ్ములనడుగకుండ నిక్కడికివచ్చినందులకు విచారించుచున్నాను.

తుల—ఆయేడుపు అవలకుఁబోయి యేడువవచ్చునులే! ఇఁక దయచేయుము?

గుమా—చిత్తము? (నిష్క్రమించును)

తుల—నవీనబాబూ! వీఁడువట్టి పోఁగరుపోతు ఎదుటిపార్టీ ప్లీడరునొద్ద రహస్యముగా ధనముసంగ్రహించి అనేక రహస్యములు చెప్పుచుండును. పోనీయని యూరకొనుచుందును. జీతమిచ్చుటలో రెండుదినములాలస్యమయ్యెనేని యూరంతా టముటమావేయించినట్లందఱకుఁ జెప్పికొని యేడ్చుచుండును. ఈతొత్తుకొడుకునకు రావలసినజీతమునుబాఱవైచి వీనిని పంపివైచెదను

డబ్బావదిలె శనిపట్టి పట్టున్నది. (తెరలో స్త్రీ)
తులసీదాసా! నేఁజెప్పినమాటకేమి యుత్తరమియఁగదవు?

తుల—ఏమందును? మనోరమను జంపుటమాత్రము నాకిష్టము లేదు. మీదట నీచిత్తము!

గోవిం—నిష్కారణముగా స్త్రీహత్యకొడిగట్టుకొననేల?

నవీ—ఇదివఱకే దానిధనమంతయుఁ జెడగొట్టి యపకీర్తిపాలు చేసితిమి. దానిధన మంతయులాగికొని బలాత్కారముగా నిలువెడలనడిచితిమి. మూఁడుసంవత్సరములనుండియు శైత్యమను నెపమున నిర్బంధమున నుంచితిమి. ఈమహాప్రయత్నములవలన ముప్పాతికా మువ్వీసము చచ్చి కొనప్రాణముతోనున్నది.
(తెరలో స్త్రీ)
నవీనా! కనుకనే దానిని బూత్రిగాఁ జంపుటమేలని నామతము. మీరు సమ్మతమైనను గాకపోయినను నది నేఁడు వహించితీరవలయును.

తుల
గోవిం
నవీ } (ఏకగ్రీవముగా) నీకభ్యంతరము చెప్పఁబోము! మేమిందులకు సంసిద్ధులమై యున్నారము.

(దేవేంద్రుఁడు అంధవైష్ణవ వేషముఁ బ్రవేశించును)

దేవే—(తనలో) గుమాస్తాను భయపెట్టి గదిలోబంధించితిని శ్రీశచంద్రునకు సమయస్ఫూర్తి మెండు వెంటనే వాఁడాగదితలుపు బయటగొళ్లెము పెట్టినాఁడు. ఇఁకవానిగతి వీరికిఁ దెలియదు ఇఁకఁ గార్యక్రమమునకుఁ గడంగదను.

(అందఱియెదుటకువచ్చినిలువఁబడును)(అందఱునులికిపడిఆశ్చర్యముతోఁజూతురు)

తుల—(భయముచే వణఁకుచు) (తేనిక్రోధముతో)

చ॥ ఎవఁడవురోరి పోకిరి! యిం కేలరవచ్చితి? బందిపోటుదొం
గవో, మఱికన్నగాఁడవో! వికారపువేసముఁబూనియున్న ము
చ్చవో, యిటనీకు నేమిపని? సత్వరమే యిటనుండిపొమ్ము; పో
వవో. భవదీయదుర్మదముఁ బాపెద! నీమెడఁబట్టి గెంటెదన్॥ ౧

దేవే—నన్నేల యెదపట్టి గెంటెదవు? నేను దొంగనా?

తుల—యెందులకా? పోకిరీ! నాయింటికి నీ వేలవచ్చితివి?

దేవే—నాయిష్టము! రమ్మనుటకును పొమ్మనుటకును నీ వెవఁడవురా?

తుల—నాయింటికివచ్చి యిట్లు పేలుచుంటివి! నీవు దొంగవు! హంతకుఁడవు! ఇది యంతయు ఘోరకృత్యము! పోయెదవా? పోవా? కదలవేమి? అరే! పోకిరీ! నీకు శాస్తిచేయవలయునా? యేమి?

దేవే—శాస్తులువద్దు, నీయుక్తులువద్దు! నోరు మూసుకొనుము పేలకుము!

తుల—నీవు పేలకుము! నోరుమూసికొని వచ్చినతోవ నేపొమ్ము! నాసంగతి యెఱుఁగుదువా?

దేవే—దుష్టుఁడా? నీకంటెను దొంగ లెవరురా! నీకంటెను హంతకు లెవరురా?

నవీ—నీ వెవఁడవో యడవిమనుష్యునివలె మున్నావు! కానిచోఁ బెద్దమనుష్యులతో నిట్లు ప్రసంగింతువా? పోపొమ్ము!

దేవే—(నవీనునితో) వాఁగక రెండుచేతులతోడను నోరుమూసికొని కూర్చుండుము! నీకంటెను నడవిమృగమే మేలు!

గోవిం—ఓహో! నీవందఱిని వలఁబెట్టి తిట్టుచున్నాఁడవే! ఇఁక బయటికి దయచేయుము! పరియాదగాఁబొమ్ము! నీ కిక్కడ నేమి పనియున్నది?

దేవే—ఏమిపనియా? దొంగలును హంతకులునగు మిమ్ముఁజూచిపోవుటకు!

తుల—నీ వెవఁడవు? చెపుమ్ము?

దేవే—ఎవఁడనా? నిరూపకాధ్యక్షుఁడను, దేవేంద్ర విజయ మిత్రుఁడను. తెలిసినదా?

నవీ—ఓహో! మహాశయా! మీరా? వినుటయేకాని యెప్పుడును జూచియుండ లేదు. నేఁడు సుదినము. ఏమిపనియుండి దయచేసితిరి? 'ఊరక రారు మహాత్ములు!'

దేవే—ఏపనియు లేదు. గతరాత్రి నాయింట నొకదొంగతనము జరిగినది. అహోరు
లతో మాటాడుటకే యిటవచ్చితిని.

తుల—మమ్ములనా యనుమానించుచున్నావు? నీ వెంతవాఁడవు? పెద్దమనుష్యుఁడా!
తులసీదాసు నవమానించినచో నేమగునో యెఱుఁగుదువా?

దేవే—నిన్నొక్కని నేకాదు. ఇటనున్న మీ ముగ్వురను బంధించి తీసికొనిపోయె
దను. మీరు ముగ్వురును, మిమ్ములను దోలుబొమ్మలవలె నాడించుచున్న
యీయువతియు నాయింటఁ జొఱఁబడి నాకుమారిని (నాభార్యను) నపహ
రించుకొని వచ్చితిరి! వారినెచ్చట దాఁచితిరో యిప్పుడు నాకొప్పగింపుఁడు!
లేకున్న నిప్పుడే మీ కాళ్లు చేతులకు సంకెలలు వైచి తీసికొనిపోయెదను.

నవీ—మేమపహరించితిమని నీకు సాక్ష్యముఁ జెప్పిన వారెవరు?

చ॥ తననయనద్వయింం దెఱచి, తా నసమస్తముఁ జూచి, యున్నదుం
డినయటులన్ వచించుటకు నేర్చిన సాక్షియె సాక్షి! యట్లుగా
కనిరతముఁ ధనాశయధికంబుగనొంది, యసత్యముల్ కనుం
గొనినటుపల్కు దుర్జనుఁడు గోవిదసన్నిధి మెప్పుఁబొందునే 3

కావునఁదగిన సాక్ష్యముఁ జూపి మాతోఁ బ్రసంగింపుము!

దేవే—సరే! సాక్ష్యమునకు మాత్రము లోపమేమి? (తెరవైపుఁ జూచి) శ్రీశచంద్ర
రాయా! ఇటురా! (శ్రీశచంద్రుఁడు దేవేంద్రునియొద్ద నిల్చును.)

తుల—(శ్రీశచంద్రునిఁ జూచి) ఈబాలుని సాక్ష్యముఁ గోర్టు వారెవ్వరు నంగీకరిం
చరు! ఇతఁడు మైనరు.

దేవే—నోరుమూయుము! ఇది సివిల్ చర్య యనుకొంటివి కాఁబోలును! క్రిమినల్
క్రిమినల్! ఇందు బాలురసాక్ష్యము తప్పనిసరి. (శ్రీశునిఁ జూచి) శ్రీశా!
ఇక్కడనున్న వారిలో నీ వెఱింగినవారిం జెప్పుము!

తుల—ఏడ్చి మొగముఁ గడుగుకొన్నట్లున్నది! ఎవఁడవురా తుచ్ఛా నీవు?

శ్రీశ—(పరిహాసముతో) దేవేంద్రుని యింటియొద్ద మీబండి గుఱ్ఱములకళ్లెములను బట్టుకొన్న శ్రీశచంద్రుడను. తెలిసినదా?

తుల—ఛీ! దొరమారాయుఁడు! నీకిట్టి యసత్యములు నేర్పినవాఁడెవఁడేనా? ఔరా! ఏమిదుండగము!

శ్రీశ—(క్రోధముతో) నీవచ్చినన్ని మాటలు వాడుచున్నావు. జాగ్రత్తగా మాటలాడుము! అన్యాయవాదీ! నీవును (గోవిందునిజూపి) యితఁడును నన్ను గుఱ్ఱములయొద్దనిలిపి మీరిరువురును లోనికిఁబోయి యొకగంట సేపటికివచ్చి నన్నుఁబొమ్మనలేదా?

తుల—మేమేయని నీవెట్లుచెప్పెదవు? లోకములో దొంగలెవ్వరనిన మమ్మే చూపెదునట్లున్నావే!

గోవిం—దుష్టుఁడా! యిట్టి తప్పుడుకూఁతలు కూయకపొమ్ము! ఏప్రేలు పట్టుకొందువనిన నడిప్రేలే బాకుఁగావలయులను కుఱ్ఱవాండ్రకా ప్రపంచజ్ఞానమును సాక్ష్యమును?

శ్రీశ—తప్పుడుకూఁతలు కూయుచున్నది మీరా? నేనా? (గోవిందుని జూచి) నీ రొమ్మను చెవియొద్దనున్న పుట్టుమచ్చయు (తులసీదాసునిజూపి) నీ కుడి ముక్కునకున్న పుట్టుమచ్చయు నేను జూచియుండకపోలేదు. మీమచ్చ మాపుటకే యామచ్చలు నాకుఁ గనఁబడినవి. నేనేమి తెలివితక్కువ వాఁడననుకొంటిరా? శ్రీశచంద్రుఁడు సామాన్యుఁడు గాఁడనుకొండు! ఇంచుక దూరముపోయి మీదారుణకృత్యములన్నియుఁ గనిపెట్టుచుంటిని. చివరకు మీయిద్దఱితో నొకపురుషుఁడు, నొకస్త్రీయును వచ్చి బండిపైఁగూరుచుండి పోయిరి! పాపమా యిరువురు యువతులను నపహరించుకొని పోయిరి! ఇప్పటికైనఁ దెలిసినదా? సిగ్గువిడచి మాట్లాడెదరా?

నటి—ఛీ! మాటాడకుము! ఇప్పటినుండియు నసత్యవాక్యములు నేర్చుకొనుము! బాగుపడియెదవు. దేవేంద్రా! ఈసంగతులన్నియు మాకుఁ దెలియవు. నీ యింట దొంగతనము చేయవలసిన యవసరము మాకేల? ఏది? వారంటు సమను తెచ్చితివా? తెచ్చినతోడల మాకుఁజూపుము.

దేవే—నాయుద్యోగమునకుఁ బ్రభుత్వమువారి ప్రత్యేకాజ్ఞాపత్రము లవసరము లేదు. దేవేంద్రుడన నెవ్వఁడనుకొంటివో, మీవంటి దుష్టులనెల్ల బంధించి ప్రభుత్వమువారి కొప్పగించుటయే నాపని. మరియాదగాఁ జెప్పుచున్నాను. బుద్ధిమంతులరైనా భార్యను నామనోరమను నెక్కడ దాఁచి యుంచితిరో చెప్పి యొప్పగింపుఁడు! లేనియెడల.

సవీ—(అర్థోక్తియందే) నీ మొగము, నీ మోర, లేనియెడల నేమి చేసెదవు? పోఁగా బట్టాచూచి, పాపరాజనుకొన్నాను, పేదరాజనంటోయి వీరరాజా? అన్నట్లున్నది నీ నిరూపణ. చాకచక్యము పో! బయటకుఁబో!

దేవే—(క్రోధముతోఁ దనకుడిచేతియందలి పిస్తోలుచూపి గర్జాస్వనముతో) పాపాత్ములారా! ఇదియేమో చూచితిరా?

కుల, గోవిం, సవీ—(ముగ్వురును పిస్తోలనులాగి లేచి పారిపోనుంకింతురు.)

దేవే—(క్రోధముతో గర్జించుచు)

చ॥ కదలకుఁడోరి దుర్మదులు! ♦ కాలము మీకిదె దాపురించె; నా
సుదతిని మామనోరమను ♦ చోరతఁ దెచ్చిన పాపపూర్ణ ఫలం
బిదె కుడువంగ మీకుఁ దగె; ♦ యిక్కడినుండి కదల్పకుండు మీ
పదములు: లేనిచో నిపుడె ♦ పాపపుమస్తములుర్విఁ గూల్చెదన్. ౪

ఓరోరి పాంతకాగ్రేసులారా! ఓరోరి చోరశిఖామణులారా!

సీ॥ కంబళిఁ బఱచి ప్రా ♦ కారంపుగోడపై
నెక్కి దూకిన దుష్ట ♦ కృత్యమునకు
నటమీఁద వెన్క వా ♦ కిటతాళమును ద్రీల్చి
సద్మంబుఁ జొచ్చిన ♦ సాహసమున
కువిదలు నిద్రించు ♦ చాండవారలకుఁ గ్లో
రోఫారమిచ్చిన ♦ క్రూరతకును

నాఁడె తెఱుంగకయున్న ♦ యుగ్మలుఁ లంబట్టి
కొనిపోవు మీఁదొంగ ♦ తనమునకును

తే॥ గీ॥ నతి నిగూఢంపుఁ జోటున ♦ నతివలిర్వు
రను వినిర్బంధితులఁ జేయు ♦ ప్రాభవమున
కర్హ్మఫల మందెదరు నిలుం ♦ డస్మదీయ
దారుణాశతఘ్నికా గుళి ♦ కారవముల.

ఓరోరి పాపాత్ములారా! సాధుచరిత్రయగు మనోరమను వధించుటకును, దత్సర్వసంపదలు ననుభవించుటకును హంతకియగు నొక పడుపుఁగత్తెను జేర్చికొని మీ రాడుచున్న యాటలు నే నెఱుంగుదును. నేఁటితో మీయాయువులు భూమికి మట్టమైపోవఁగలవు! మఱియును నా భార్యయగు రేవతి చేతిరుమాలు నెత్తుటఁ జొత్తిల్లఁ జేసితిరి క్రూరులారా! నోరెఱుఁగని పసికూన. సుబ్బరెయొక్క ఱొమ్ము పైనే దారుణకృపాణము నాటుకొనియుంటిరో యాకృపాణ మెటనున్నది? మీకుఁ బ్రాణములపై నాశయున్నచో వెంటనే యాకత్తియిటు దెచ్చి చూపుఁడు! ఇఁక విలంబమునకు సహింపఁజాలను, ప్రళయానల జ్వాలికా మాలికలనైనను నోర్వఁగలిగిన నోర్తురేమోకాని దేవేంద్రవిజయుని క్రోధాగ్నిముందట మీరు నిలువఁజాలరు! తెలిసినదా? లెండు! కదలరేమి? ఎంతెంత హంతకులైపోవుచున్నారు!

జాన—(దేవేంద్రుని వెనుకనుండి ప్రవేశించుచు వేగముతో) ఓరీ యిదుగో యాకత్తి! (దేవేంద్రుని వెన్నుపైఁ గొట్టును. దేవేంద్రుఁడు మూర్ఛిల్లును.)

తుల—సారాయపు బుడ్డితో దేవేంద్రుని నెత్తిపై మోఁది) చావుము మొండిముండకొడుకా!

శ్రీశ—(బిగ్గఱగా) హా! ఎంతదురంతము? (తనలో) ఇప్పుడు పోలీసులను బిలుచుకొని వచ్చెదను! (పరుగిడును.)

తుల—అదురాత్మునిఁ బోనీయనేల? వానినిగూడ యమసదనమునకుఁ బంపవలసినదే

(గోవిందుఁడును తులసీదాసుఁడును శ్రీశచంద్రుని వెన్నంటి పరువెత్తెదరు.)

నటి—(తనలో) ఈసమయమున నిటనిలుచుట ప్రమాదకరము! (పారిపోవును.)

జామ — (క్రోధాతిరేకముతో)

ఆ॥ పాఱుఁబోతులార! పరువెత్తెదరు దున్న
పోతులట్లు! సిగ్గు పొడమ దేల?
మీకారంబు లుర్వి మెలఁగంగఁగలవు నా
పలుకు వినుఁడు నిల్చి పందలార ౬

(తెరలో)

"అయ్యో! అయ్యో! అన్యాయము! హత్య! హత్య!
జనులారా! రండు రండు! పోలీసులారా! యెందున్నారు?"

నవీ — (తత్తరముతోఁ బ్రవేశించి) నీవుగూడ మాతో రమ్ము! జామలా! త్వరగా రమ్ము!

జామ — పని పూర్తిగాకుండఁగ నేనా పోవుట? వీఁడు చనిపోయినాఁడో లేదో చూడుము!

నవీ — చచ్చినట్లేయున్నది! నీవే చూడుము! నేనొకచోటికిఁ బోవలసియున్నది.

(నిష్క్రమించును.)

జామ — (తనలో) ఓరి దుష్టుఁడా! నీకాయువు మూడినది. హమ్మ (దేవేంద్రుని యొద్దకుఁజేరి పరిశీలించి) వీఁడింకను బ్రతికేయున్నాఁడు - అనఁగా కొనయూపిరితో నున్నాఁడు. పూర్తిగాఁ జంపివైచెదను. అరిందముఁడొక లెక్కగాదు! వీఁడే నా హృదయశల్యము! వీనిని వధించితి నేని నిష్కంటకముగ నా కృత్యములు నెఱవేఱును. (చీరలో దాఁచియుంచిన చురియనుదీసి) దేవేంద్రా! ఈప్రపంచమునకును నీకును గల సంబంధము మీ క్షణముననే తీఱినది. మన యిరువురమును సమానులము. ఒకరినొకరు పరిమార్చవలయునని బహు దీర్ఘకాలమునుండియుఁ బ్రయత్నించుచుండిమి. నేను జయమందితిని! నీవు మరణమందితివి! ఇఁక భూతభవిష్యద్వర్తమానముల నాకుఁ బ్రతిస్పర్థి లేఁడు! లేఁడు! ముమ్మాటికిని లేఁడు! జామలా! నీవు ప్రపంచమంతను మ్రింగినను వెన్నముద్దవలె నే యుండును. (చురియను సారించి) దేవేంద్రా! నీకీమార్గావసానమే జీవితావసానము! (పొడువఁబోవుచుఁ దెరసై

పుజూచి.) పాపపుజనులు వచ్చుచున్నారు! తగినంత నిగూఢముగా నుండవలయును. (రెండు కత్తులును మఱలఁ జీరలోదాఁచికొనును.)

(తెరలోఁగలకలము.)

జుమ—(ప్రకా) హానాథా! హానాథా! నన్ను విడిచిపోయితివా? (బిగ్గఱగ నేడ్చును.)

(అప్పుడు కొందఱు జనులు పటాక్షేపమునఁ బ్రవేశించి.)

జనులు—ఎక్కడ? ఎక్కడ? ఆహంతకునిఁ బట్టుకొనండి! పోనీకుకండి!

జుమ—హానాథా! హానాథా! అయ్యో! అప్పుడే ఆహంతకులపాలఁబడితివా? (దుఃఖము నభినయించి) అయ్యయ్యో! నేనేమిచేయుదును? అడుదానను నన్నుఁజూచి పాఱిపోయిన యాహంతకులు నిన్నెట్లు చంపఁగలిగిరి? హా! యేమిచేయుదును? అయ్యో! దేవుఁడా! (ఏడ్చును.)

ఒకఁడు—పాపం! ఎవరు వధించినారోకదా యీ పుట్టంధుని? హరహరా! పాపము శాంతించుగాక!

రెండు—అయ్యయ్యో! ఎంతదెబ్బ తగిలినదోకదా పాపం! యీసీసా పలిగిపోయింది!

మూఁడు—అయ్యో! రానురానెంత దుర్మార్గులున్నారు లోకంలో! ఏంచేస్తాం? కంచంలో ముద్దనోటఁబెట్టేసరికి నాలుగండాలు తప్పవలసియున్నది. పాపము గ్రుడ్డివాని నెల చంపవలసివచ్చిందోకదా!

నాల్గవ—ఏంచేటుకాలం వచ్చింది? ఆహాహా! యీకలియుగాన బుట్టడమే మహాపాపం!

అయిద—(నాల్గవ వాని చెవిలో) ఈ దుర్మార్గపుముండకు ఆఖూనీదార్లు మిండగాండ్రు కామోల్సును. లేకపోతే యీముసలి-టీకు నెందుకు చంపుతారు? మిండగాండ్రచేత మగని జంపించే కాలంగూడవచ్చింది!

రెండవ—హరహరా! యేదైనా చికిత్స చేస్తే బాగుంటుందేమో!

జుమ—అయ్యో! ఆయన బ్రతికియున్నఁగదా! యేచికిత్సయైనను జేయుట?

మోద—(ఆశ్చర్యముతో) అప్పుడే మరణించినాఁడా?

జన—మరణించియే యుండునని కొందును! హా నాథా! హా నాథా! అయ్యో! దేవుఁడా! (ఏడ్చును)

మాండవ—భయపడకు! మొల్లకామున్నదో యెలాగ్రాకమానదు. అయినా కొంచెం పరిశీలించడం మంచిది. (దేవేంద్రుని శరీరమును పరిశీలించి) ఒళ్లు కొంచెం వెచ్చగానే వుంది!

వాల్గర—(పరిశీలించి) కాని, యింతోసేఁపు ప్రాణినిలిచేటట్లు లేదు, ఇక్కడి డాక్టరు ఎవరో కదా?

జన—అయ్యో! ఇంకా బ్రతికియున్నాఁడా? (తనలో) ఈశనిగ్రహములు రాకున్నచో నిజముగనే ప్రాణములు విడిచియుందును. కానిమ్ము! ఈదెబ్బకుఁ బచ్చినఁగావలయును! లేకున్న నాయుపాయములు అనుపత్తిలోఁ బడియుండకలయును. ఇప్పటి నాప్రయత్నమునకు వీఁడడ్డురాఁడు ముమ్మాటికిని రాఁడు! (ప్రకా) హా! నేనెట్టి పాపాత్మురాలను! ఈయన కన్నుల యెదుటఁ జట్టెడు పసుపుగుంకుమతో పోవకపోయితిని. హా నాథా!

అయిద—నీభర్తకింకను ప్రాణములు పోయియుండలేదు. వెంటనే డాక్టరును బిలువనంపు!

జన—డాక్టరునకుఁ గబురంపిన రాఁడు. నేనే స్వయముగాఁబోయి తోడ్కొని వచ్చెదను. ఇప్పుడే వచ్చెదను. అంతవఱకు నీయనను గాచుచుండుఁడు! హా నాథా! హా ప్రియా? నాకింక గతి ఏమి? దుష్కాలమువంటి చావు నీకక్కడ దాపురించినది? నాథా? నాథా! నాథా! అయ్యో దేవుడా ?(కన్నులు తుడుచుకొని) జనులారా! హత్యచేయఁబడెనట. మీరందఱు నెఱిఁగియే యున్నారు! నాగతి యిట్లుపట్టినది. నాయదృష్ట మింతచక్కఁగనున్నది.

ఉ॥ ఎంతటినోము నోచితినొ • యింతటిసంపద లొందియుంటి; దే
వాంతక తుల్యులిప్పటికి • సంధువెంబట్టి వధించిపోయి: కీ
ర్త్యంతయు వారలంజనుపఁ • గాఁగ లెప్పటికైన, శ్రీహరీ!
యింతలు బ్రాఁచుఁబాములని • యెవ్వఁడు నెమ్మదినమ్మిత్రిమ్మలున్?

(తనలో) నాభలుభల భావము వీరికిఁ దెలియదు! పందడిలో సమారాధన యనినట్లింకొక చిత్రముగూడఁజేసి యిఁకఁబోరాదగాక (ప్రకా) నాయనలారా! యీ యంధునకు మిత్రుఁడగు నొక డాక్టరున్నాఁడు అయిదు రూపాయలు ప్రవేశ రుసుమిచ్చినఁగాని రాఁడు! కావిూ చీకుపైఁ గరుణించి యిప్పింపుఁడు! మీ ఋణమును మఱలఁదీర్చుకొందును!

మొద—(అయిదు రూ. లు. జూదరికిచ్చి) ఇవి తీసికొనిపోయి డాక్టరును దెమ్ము! వదిలము! పాపము! నీ దుఃఖంచూస్తే నాకు జాలివేస్తుంది. రెవరినైనా సాయం తీసుకుపో!

జూద—అయ్యా! తోడవసరములేదు, అదినాయెఱిఁగినయిల్లే, అంధుని జాగ్రత్తగా జూచుకొనుచుండుఁడు! హా నాధా! హా నాధా! (నిష్క్రమించును).

మొద—పాపమా చిన్నదాని దుఃఖంచూస్తే నాగుండె కరఁగిపోతున్నది. అవురా యెంతదుర్మార్గులయ్యా వాండ్రు!

నాల్గ—(అయిదవవానితో) నీవుచెప్పింది యిప్పుడు నమ్ముతున్నా.

మొద—ఏమని నమ్ముతున్నావు? యీముసలివాఁడు బతుకునేన?

నాల్గ—కాదు! ఆముండ తన మిండగాండ్రచేత చంపించిందని

మూఁడ—అలా అంటవేమిటోయి? పాపం ఈగుడ్డివానికామె భార్యఁట. ఆమె గుణాలుబట్టిచూస్తే ఆమెకు మిండగాండ్లెక్కడ? ఇలాగంటి పాపపుమాటలు పల్కకు శ్రీహరీ! (చెవులుమూసికొనును)

రెండ—ఆఁ ఆయేడ్పులోనేదో వికారంగూడావుందని తోస్తుంది. ఇంతరాత్రివేళ వంటరిగా డాక్టరుకోసము పోవడం వింతగావుంది.

అయి—యీచీకును జంపినవాళ్ళకున్ను దీనికిన్ని సంబంధం వుంటుంది. లేకపోతే ఇంతులు కాఁచుపాములని యివ్వెందుకు పలుకుతుంది?

మొద—పుణ్యం వస్తుందని అయిదురూపాయలామెకిచ్చానుగదా! పాపపుణ్యాలు భగవంతునికి తెలుసును. వూరికే నోటివట్టుపుమాటలెందుకయ్యా! పాపం యీగుడ్డివానినిజూచికదా యిస్తిని? నామాటేనిజం.

మూఁడ—అలా అయితే నీచేసినధర్మం బూడిదలోపోసిన నెయ్యేఅవుతుంది.

మొద—కృష్ణార్పితం రామార్పితం అనుకుంటాను.

తక్కినవారు—(నవ్వుదురు)

దేవేం—(కొంచెముటునిటు పొరలును)

మొద—పాపం! అవి నెపుణ్యం నుంచిదిగనకనే బ్రతికినాఁడు!

అయి—(నవ్వి) నీదబ్బుపుణ్యాన అను!

తక్కి—(నవ్వుదురు)

(అప్పుడు పోలీసుతో శ్రీశచంద్రుఁడు ప్రవేశించును)

శ్రీశ—అయ్యా! ఇదుగో మాతండ్రి! యెవరో నఱికినారు! చూఁడుడు.

అయి—ఆమె డాక్టరుకోసంపోయిందే!

శ్రీశ—ఎంత సేపైనది?

అయి—ఇప్పుడే! మీకెదురుపడ లేదా?

శ్రీశ—అదుర్మార్గురాలి మూలముననే నాతండ్రి కింతటి యాపదఘటిల్లినది. అది మాకెదురుపడినయెడల నేమైయుండెడిదో

దేవేం—(అటు నిటుఁబొరలి నీల్గును)

శ్రీశ—నాయనా! బ్రదికితివా? దేవేంద్రునిబట్టి లేవఁదీసి కూర్చుండఁబెట్టి) ఓయీ కానిస్టేబిల్! కొంచెము ఈయన వీపునకు ఆనుగాని నిలువఁబడుము!

కాని—(దేవేంద్రు నానుకొనును)

శ్రీశ—(అయిదవవానితో) అయ్యా! కొంచెము చికిత్స చేయింపుఁడు!

దేవేం—(మూర్ఛఁదేఱి కనులువిప్పిచూచి) శ్రీశా! చికిత్సయక్కఱలేదు' ఏమియక్కఱ లేదు! పోవుదముపద! ఆలస్యమగుచున్నది. ఓజనులారా! అదిపాపిఁ బరమ ఘోరురాలు!

అయి—(నవ్వి) మీరంధులన్నదే ఆనుండ! అది మీ పెండ్లాంగాదంటుండి?

దేవేం—పెండ్లమును గాదు. పెంకులును గాదు. అది నాలోక శత్రురాలు! నేనంధుండను గా వున నే వెనుక నుండివచ్చి నన్ను వెన్నుపై కత్తితోఁగొట్టినది. నేఁడు దాని చేతిలో నిట్టియవస్థ ననుభవించితిని మీ రేమి చేయుదురు? పొండు! దయయుంచుఁడు!

(జనులును పోలీసును నిష్క్రమింతురు)

దేవేం—శ్రీశా! ఇప్పుడేమి చేయఁదలఁచితివి?

శ్రీశ—ఇప్పుడు వారి వెంటఁబోవుటయే మంచిదని నాయభిప్రాయము.

దేవేం—అట్లే చేయుదము! ఇప్పటి పరిస్థితులను చూడగా వారేదియో భయంకర కృత్యమునకుఁ దలపడుచున్నారని తోఁచుచున్నది. కనుక మనము ప్రమత్తులమై యుండవలయును! నీవు బండ్లునిల్చెడు చాకీయొద్దకుఁబోయి కాచికొనుము. బహుశః వారందఱు నానందకుటీరమునకే పోవుదురు. నీవక్కడ నిల్చి వారిని వెన్నంటిరమ్ము!

శ్రీశ—అట్లే చేసెదను. మీరో!

దేవే—నేను గంగానది వంతెనయొద్దఁ గాచుకొనియుండెదను. అక్కడికి వచ్చిన వారి వెంటఁబోయెదను. నీవేమి చేసెదవు?

శ్రీశ—నేనా బండ్లునిల్చెడు స్థలమునకుఁబోయి యెవ్వరెవ్వరు వచ్చెదరో కనిపెట్టియుండెదను.

దేవే—వారు వేసము మార్చుకొనివచ్చినచో నెట్లు గుఱుతింపఁగలవు?

శ్రీశ—వారెన్ని వేసములు ధరించినను నేను సులభముగానే గుఱుతింపఁగలను. సందియము నొందవలదు.

దేవే—అయినచో శీఘ్రముగఁబొమ్ము! వారెక్కడకుఁబోయినను, నీవు వారి వెంటనే పోవలసియుందును. వారికంటఁబడితివేని చాలఁ బ్రమాదము వాటిల్లును. ఒక్కొక్కప్పుడు ప్రాణములకుఁగూడఁ దెగింపవలసివచ్చును. తెలిసినదా?

కిరీశ—తెలిసినది. బహుశః వారెటుపోయినను ఆనందకుటీరమునకుఁ జేరవలసి యుందురు కనుక నెట్లయినను వారిని వెన్నంటివచ్చెదను.

దేవే—మంచిది నీబుద్ధియతిసూక్ష్మమయినది. జాగ్రత్తగా మెలఁగవలయును సుమీ!

కిరీశ—అల్లే వీరును నక్కడికే వచ్చెదరుకదా!

దేవే—అవును. ఆలసింపకుము!

(ఇరువురును నిష్క్రమింతురు.)

## రంగము—ఆనందకుటీరోద్యానము.

దేవే—(తనలో) మనస్తాపమునకు మేరలేదు. కేవలీ మనోరథములు భయంకర మృత్యువు వాతఁబడఁబోవుచున్నాను! కాని కలనైనఁదలఁపని సంఘటనము జరిగినది. ఎవ్వతె మోహన విచక్షణములగు తనయపాంగ వీక్షణములఁదిలకించి యరసికుఁడననిగలఁచి, పగఁదలఁచి, గాఢాంధకారబంధురమగు హేయమందిరమున బంధించి, తలుపుబీగము వైచి, మత్తుమందుతోఁగూడిన ధూమమును బంపి, నిశ్చేతనునిఁజేసినదో, యాఢాకిని నాకిప్పటికి దొరికినది! ఎవ్వతెను బట్టుకొనుటకుఁ బ్రతిజ్ఞచేసి దేశమంతయుఁగోసి, మనసుసరోసి గాసిల్లియుంటినో, యావారిపిశాచి నేఁటికిదొరకినది! ఏఁడేండ్లకు సెలవుగ దీనిమొగముఁ జూచుటకైన వలనుగాకుండ నాఘోరరాక్షసి వెనుకపాటువచ్చి పడఁగొట్టినది. నిరాలంబుఁడనై పడిపోయితిని. పాపాత్ముకురాలవగుదో జామీలియా! నీవు దేవేంద్రునిచేతికి దొరికిపోయితివి! నీకిఁక దేవేంద్రుని సమ్ముఖమునఁనే మరణము సిద్ధింపఁగలదు! నీవు ఘాటకవు! శూర్పణఖవు! పూతనవు! నీరూపము భయంకరము! నీకోర్కియనంతము! నీసర్వాంగములును విషపుమ్రుచ్చులు! నిన్నాశ్రయించినవాని కకాలమరణముదప్పదు! నీకున్న ప్రబలశక్తియు, నీకున్న ధైర్యస్థైర్యములును బ్రపంచమున నేయువతికినిలేవు! ఓహో! వేషాంతరములుధరించి యానందకుటీర రంగమున మనోరమమైనటించితివి! (బాధనభినయించి) నాకపాలము పంచూర్ణము చేయఁబడినట్లు మిగులనొగులుఁ గల్గించుచున్నది! ఏఁపుమైఁబడిన దారుణ కరవాలాఘాతముకంటెను మస్తి

వ్యధ వేదన యినుమడిన్చైయున్నది! ఈరెంటి బాధలకంటెను రేవతీమనో రమల విషయమునఁగల విచారబాధ యెక్కుడగుచున్నది! (పరికించి) ఈదుష్టులు నన్నింతవఱకును గమనింపలేకున్నారు! ఈపరమ పతివ్రత మొదట పూలు సాహేబునకు భార్య - అనఁగా నుంపుడుకత్తెయే! బ్రాహ్మణుఁడెడ? తురకవనితయేడ? పెండ్లియేడ? ఆభర్త ప్రోత్సాహముచేఁ దమీజుద్దీను ముసలి ముసల్మానునకు ధర్మపత్నియై "అమ్మగారి గృహప్రవేశము అయ్యగారి స్మశానప్రవేశము" అనునట్లు చేసినది. తరువాత నవీన చంద్రునకుంపుడుకత్తెయైనది! అందును భారతీయుని కుమారియగు మనోరమయని చెప్పుకొన్నది. ఇంతటి మాయలమారి - యింతటి సాహసికురాలు - ఇంతటి దారుణచరిత్ర - ఇంతటి పాపాత్మురాలు - ఏలోకమునను నెక్కాలమునను నుండదు! గంగానది వంతెనమొదలు వీరిని వెన్నాడుచుంటిని. వాండ్రిటువచ్చుచున్నారు! ఇంచుక దాఁగియుండెదఁగాక! ఒకచో (దాఁగియుండును.)

(జామలయు నవీనచంద్రుఁడును ప్రవేశింతురు)

నవీ—(తనలో) ఈయంధతమసము ప్రకృతియందెల్లఁ దానయ్యైనిండి భయసంజనక మగుచున్నది! ఏమిచేయుదును? ఏదియో దిగులుకలుగుచున్నది. (భయముతో నిలిచి) ప్రియా! జామాలా!

సీ॥ తృణదానఘాటి యాంస్యముపైన నిడికొన్న
యసితవర్ణపు మేలిఁముసుఁగనంగ
గగనాంగణవయస్యఁ గప్పుఁగిలించికొనంగ
ధరణియెత్తిన కరఁతలములనఁగఁ
బ్రకృతికోమలి నిజఁప్రతికర్మరచనకై
తెరచిన కాటుకఁబరిణయనఁగఁ
గాళరాత్రి సముత్థఁఖడ్గసంచాలనఁ
గని వందురెడు జీవిఁకాండమనఁగఁ
తే॥ నీలమేఘంబుల వెవ్వేలెఁనింగిపైన
నదిమొవనతరుతతి పొందిఁమయ్యెఁ జిమ్మ

చీఁకటులు వ్యాప్తమయ్యెఁ బ్రసిద్ధిఁ గీచు
రాలకూఁతలు విశ్వవిక్రాంతి నెనసె! ౭

పరిశ్రయావసానంబున యట్లంధతమసము దక్క వేఱొండు దృగ్గోచరముగా కున్నది! హా! మనసున కేలొకో దిగులు నొదవుచున్నది! ప్రియసఖీ! నవీన చంద్రిఁ డెన్నఁడు నిట్టి భయంకర ప్రకృతిఁ గాంచియుండలేదు! ఏమి చేయుదును? (వణఁకును)

జామ—నిల్చితి వేమి? నడువుము!

నవీ—ఆపాదమస్తకము నాసర్వాంగములును భయప్రచలితములై పోవుచున్నవి ఈ రాత్రి కాళరాత్రివలె నన్ను వెన్నాడుచున్నట్లున్నది.

జామ(నవ్వి) పిచ్చివాఁడా! ఇట్లు భయపడినచోఁ, గార్యము కొనసాఁగఁగలదా? నీ వెన్నఁడు నింతటి ఘోరకృత్యములు చేసియుండఁగవు కావున భయపడుచున్నావు. నీవు ధైర్యము వహింపుము! ధైర్యరహితులకుఁ గార్యములు సిద్ధింపవు! (నవీనుని వీఁపు పైఁదట్టి) నేనుండ నీకేల భయము?

నవీ—నిజమే! ప్రియతమా! నీయభయప్రదానముచే భయవిరహితుఁడనైపోయితిని

(ఇరువురు నిష్క్రమింతురు)

దేవేం—(పరిక్రమించి) (తనలో) పాపము! వీని కప్పుడే దిగులు వొడముటకు హేతువు దురూహ్యము! ఇఁక నాలసింపరాదు. శచీంద్రునిఁ గలసికొనవలయును. (పరిక్రమించి తలుపుతట్టును)

{ శచీంద్రుఁడు ప్రవేశించి దేవేంద్రుని నాపాదమస్తకము నుఱుచూచును
దేవేంద్రుఁడును శచీంద్రుని నట్లే చూచును }

శచీ—(మెల్లఁగా) ఎవరు నీవు?

దేవే—(మెల్లఁగా) శచీ!

శచీ—మామా!

దేవే—అవునోయీ!

శచీ—ఎక్కడినుండి వచ్చుచుంటిరి?

దేవే—ఇంటియొద్దనుండియే వచ్చుచుంటిని విశేషములేమి? (కూర్చుండును)

శచీ—(కూర్చుండి) ఆరెండవకాంత జామలయఁట. జామలయనినఁ బాత్రిఁతకేడియే
నా? మఱొక్కతెయా?

దేవే—అదిపాత్రిఁతకేడీ! నేఁటికి మాయామనోరమయై దర్శనమొసఁగినది. ఇప్పుడి
క్కడనున్నవారెవరు?

శచీ—జామల కుముదిని నవీనచంద్రుఁడు మువ్వురు పరిచారకులు ఇద్దరు పరిచారి
కలు మొత్తమెనమండ్రు!

దేవే—మఱియెవ్వరును లేరా?

శచీ—లేరు!

దేవే—సర్వవిషయములను బ్రమాదరాహిత్యముతోఁ దిలకించుచుండుమని చెప్పితి
నిగాదా!

శచీ—అట్లేయుంటిని నేఁటియుదయమునఁ గుముదిని నన్నుఁ గలకత్తాకుఁ బంపి
నది. నేను దిరిగివచ్చునంతలో నేమేమి జరిగెనో తెలియదు.

దేవే—అట్లయిన నుబ్బునీకుఁ గనఁబడలేదా?

శచీ—లేదు! అతని నెందులకుఁబంపితిరి?

దేవే—హరహరా! ఏమియీసర్వనాశము?

శచీ—మామా! త్వరగాఁ జెప్పుము! నాకు దిగులువొడముచున్నది.

దేవే—ఏమిచెప్పమను? నేఁటియుషఃకాలమున నింటికిఁబోయి చూడఁగా రేవతీ
మనోరములులేరు రాత్రిమూఁడుగంటలవేళ వీరిచే నపహరింపఁబడిరి!

శచీ—(తనలో) హా హా! యెంత ఘోరము జరిగినది? (దుఃఖముతోఁ దనలో) ఏమె మధురభాషణములు నా శ్రవణముల కాహ్లాదకరములై యుండెనో (యను నిమిషము నే లావణ్యవతీతిలకమును మనమున భావించి తనివిదీఱకుంటినో,) యేమె మనోజ్ఞవదన సందర్శనమున నా చక్షురింద్రియములు ధన్యములయ్యెనో, యా లలితాంగి - యా మనోరమ - హా! - శత్రుకరవాలమునకు గుఱియైనది. ఈ క్షణమువఱకును నామెయే నాకు విశ్వసౌఖ్యదాయిని యనుకొంటిని! దైవమా! నా హృదయమును నిశితదారుణకృపాణధారచేఁ జీల్చివైచితివి! (ప్రకా) మామా! మర్మభేదకమైన మీ భాషణము నాకు శాశ్వతభూలోక నరకనివాసముఁ గలిగించినది. హా! అత్తయు మనోరమయు నెందున్నారు? ఈ యానందకుటీరమును వంచించి యున్నారా? లోకమునంతయుఁ గబళించు కరాళమృత్యుస్వరూపిణి - జామలా పిశాచి చేయు చిత్రవధములకుఁ బాల్పడనున్నారా? హా! యెంతకష్ట మెంతకష్టము? మామా! యేమి చేయుదును? మూఁడుగంటలు గాదు! సూర్యోదయము వఱకును నేనిక్కడ నేయుంటిని. నా యభాగ్యదేవతయే నా నెత్తియడఁచినది! (నేలపైకొరఁగును.)

దేశే—(శచీంద్రునిని పైఁ జేయి వేసి లేవనెత్తి) వత్సా! యిది దుఃఖింపఁదగిన సమయముగాదు. ఊఱడుము!

శచీ—మామా! నే నేమి చేయవలయును? (కన్నులు తుడిచికొని)

ఉ॥ ఏవిధి జీవితంబు వహియించెదనో; ననుఁ బెంచునట్టి యా
రేవతినిన్, మనోరమను మృత్యువు మ్రింగఁగనుండ నక్కటా!
యీవిధినేదరిద్రుఁడని యెన్నఁడు నెంచఁగనైన లేఁ; దికన్
హా! విధి! యెంతకైనఁదగవా? సుచరిత్రుల నేడిపించుటల్ ॥ ౮

దేశే—శచీంద్రా! మీ యత్తకై నీ వేయింతగ వగలఁ బొగులుచుంటివి. ఇట్టి యాపద్విషయమున నే నెట్లుండవలయును? ఊఱడిల్లుము! ధైర్యమే మనకిప్పుడవలంబనీయము! సుబ్బ నిద్రించుచుండఁగా నతని కాలుసేతులు బంధించి నోట గుడ్డలు క్రుక్కి పోయిరి! వానిని నీ యొద్ద కంపితిని. వాఁడును గూడ నిచ్చట బంధింపఁబడియెఁగాబోలును! శశిచంద్రుఁడను నొక బాలుని వెం

టుఁగొని వీరినందఱను దుల్సీదాసుని యింటియందుఁ జూచితిని. ఈ జుమలయే నాపైకినుండి కత్తితోఁ గొట్టిపోయినది!

శచీ—మీరిక్కడి కెట్లు రాఁగలిగితిరి?

దేవే—శ్రీశంద్రునిఁ జోకీయొద్దకుఁ బొమ్మని నేను గంగానది వంతెనయొద్దనుంటిని. ఈ జుమలయు నవీనచంద్రుఁడును బెట్టెబండియెక్కి వచ్చుచుండగా నా బండి వెనుకతట్టునఁ గూర్చుండివచ్చితిని. అప్పుడు జరిగిన సంభాషణమువలన నే యది జుమలయని తెలిసికొంటిని. వారివెంటనే యిక్కడికి వచ్చితిని.

శచీ—సైతానా మీకగపడలేదా? అదిపులివంటిది! అదుక్కనెట్లు తప్పించుకొంటిరి?

దేవే—అది చప్పుడు సేయక నాపైకి వచ్చుచుండెను. నారెండు చేతులతోడను దానికంఠమును బట్టికొని బలముకొలఁది నొక్కివైచితిని. అది కిక్కురుమనకుండఁ జచ్చిపోయినది! దాని హృదయమును గత్తితోఁ జీల్చివైచితిని. తలుపుఁదెఱచుకొని వత్తమన్న నది బిగింపఁబడియుండెను. గోడపైకెక్కి దుమికి యివ్వటికివచ్చితిని! నాబుద్ధికిఁ జూడఁగా నేఁడనేకహత్యలు జరుగునేమో యను సంశయముదయించుచున్నది. ఎట్లయినను రేవతీ మనోరమలు నేఁడు వారిచే వధింపఁబడుదురు! కనుక వీరి ప్రయత్నములను మనము ప్రతిఘటించుటకు సంసిద్ధులమైయుండవలెను. (తెరవైపు చెవియొగ్గి) ఏదియో యడుగులచప్పుడగుచున్నది చూచివచ్చెదను. (లేచి పరిక్రమించి తెరవైపుజూచి (తన) ఈ గాఢాంధకారమున మిన్నును మన్నును నేకమైయున్నవి. (నిరూపించి) ఆనందకుటీరమునందలి దీపకాంతులు వీరివీఁదికిఁ బ్రసరించుచున్నవి. (నవ్వుకొని) ఓరిగంబయ్యలారా! మీరేనా! మీవేషములట్లు వైచికొంటిరేమి? ఎన్నఁడు నభ్యాసములేని వేషధారణమిప్పుడు మీకుఁగావలసివచ్చినది! కావుననే మీరు వేషములు వేసికొన్నట్లు గనఁబడుచున్నారు! ఇఁక మీస్వరూపములే శాశ్వతముగ నంతర్ధానము నొందగలవు! అయిదుపురిలో నొకఁడు మురారిగుని యవతారముగ గోవిందుఁడు! మఱియొకఁడు నవకానుదునియవతారముతులసీదాసుఁడు' (ఆలకించి) ఎక్కడిదీపాదధ్వని?

శ్రీశ—(ప్రవేశించి దేవేంద్రునకుఁ గొంతదూరమున వెనుక నిల్చును.)

దేవే—(సంశయముతో) పదముల సవ్వడి వినఁబడుటలేదే! (రెండడుగులు ముందునకు నడుచును)

శ్రీశ—(రెండడుగులు దేవేంద్రునితో సమకాలమున నడచి) (తనలో) ఎవఁడో కుతంత్రుఁడు నన్ను వెన్నాడుచున్నాడని తోచుచున్నది. అతఁడు నాకు ముందున్నాఁడా? వెనుకనున్నాఁడా? (దిక్కులుచూచి) ఏమియు నగపడుటలేదు (ఆగును)

దేవే—(తనలో) ఏమి యీ చిత్రము? వాఁడు నా కే ప్రక్కనున్నాఁడో? (కొంచెము నడచును)

శ్రీశ—(దేవేంద్రుని పదధ్వనిలోఁ దనపదధ్వని యేకముచేసి నడచును)

దేవే—(తనలో) ఇంకొక విధమున నిరూపించెదంగాక (లెక్కగా మూడడుగులు నడచి మరల వెనుకకడుగిడును)

శ్రీశ—(కొంచెము వ్యవధానముగ నట్లే యడుగిడును.)

దేవే—(తనలో) ఇప్పటికిఁ దెలియఁగలిగితిని. నేను వట్టిభ్రాంతి జెందియుండలేదు. ఎవ్వఁడో నా వెంట వచ్చుచున్నాఁడు! (సందేహముతో) వాఁడు శ్రీశచంద్రుఁడు కాఁడుగదా? అయినను వానియొద్దకుఁబోయి పరిశీలించెదను (వెనుకకుఁదిరిగి శ్రీశచంద్రునియొద్దకువచ్చి నిలువంబడును)

శ్రీశ—(తనలో) ఇతఁడు బహుశః దేవేంద్రవిజయమిత్రుఁడైయుండును. వానిచో నిక్కడరహస్యవిభేదనము చేయవలసినయక్కఱ యేమున్నది? అయినను గాకున్నను జాగ్రత్తగనుండుట మేలు! (ప్రకా) ఎవరునీవు?

దేవే—(శ్రీశచంద్రుని చేయిపట్టుకొని) నేనీ యింటియజమానుఁడను. నీవెవఁడవు?

శ్రీశ—నేను తోటమాలిని!

దేవే—అయినచో నింతటిచీకటిలో నిక్కడఁ దిరుగుచున్నాఁడవు?

శ్రీశ—ఇల్లువిడిచి నీ వేల యిట్లొంటరిగా వచ్చుచున్నాఁడవు?

దేవే—నీవు శ్రీశచంద్రరాయలవుగావా?

శ్రీశ—(సంతోషముతో) నీవు దేవేంద్రవిజయమిత్రుఁడవుగావా?

దేవే—శ్రీశా! (కవుఁగలించుకొని సంతోషముతో) వాయానా! యెంత సాహసివోయి! ఈభయంకరార్ధరాత్రి గాఢాంధకారము మిన్నును మన్నును నేకముచేయుచున్నదే! యెట్లు రాఁగలిగితివి?

(శ్రీశుని శచీంద్రునియొద్దకుఁ దీసికొనిపోయి చేయి విడుచును)

శ్రీశ—మీరు పట్టినపట్టుతోఁ బ్రాణములు పోవునంతటి బాధగలిగినది అబ్బా! (నొప్పి నటించి) ఈబాధలో మీ రేమంటిరో విననైతిని.

దేవే—నీవిప్పుడిక్కడి కెట్లు రాఁగలిగితివి?

శ్రీశ—మీయనుగ్రహమున రాఁగలిగితిని.

దేవే—నీవిప్పుడుపోయిన యిరువురి వెంటను వచ్చితివా యేమి?

శ్రీశ—అవును నేను కాశీఘట్టమునొద్ద వీరికొఱకుఁ గాచికొనియుంటిని "అక్కడనుండి పడవపై గంగానదిని దాటి రావలయు" నని వీరాలోచించుచుండఁగా పడవలరేవునొద్దకేను మునుముందుగాఁ బోయితిని. అప్పుడొక్కపడవయే యటనున్నది పడవవాండ్రవ్వలివైపునకుఁ దిరిగి మాటాడుకొనుచుండఁగా వారి కెఱుక లేకుండఁ బడవలోఁజేరి బల్లక్రింది భాగమున డాఁగియుంటిని ఇంచుక సేఁపునకే యీదుష్టులిర్వురునువచ్చి పడవవాండ్రకుఁ రైకమిచ్చి యందుపైఁ గూర్చుండిరి. వెంటనే మాఱుమాటాడక పడవ గంగానది యివ్వలియొడ్డునకుఁ జేరెను.

దేవే—(సంతోషాశ్చర్యములతో) ఎంతసాహసముచేసితివోయి! వాండ్రు నిన్నుఁ జూచినట్లయిన నెంతకష్టము సంప్రాప్తించియుండెడిదో యెఱుఁగుదువా?

శ్రీశ—ఎఱుఁగకేమి? ఇరువురును నన్నుఁబట్టి నట్టేటఁబడవైచియుందురు. ఓస్! అంతమాత్రమునకే నేను భయపడుదునా?

దేవే—అట్లుజరుగదు. నీదొక్కచించి నీప్రాణముపోయినపిదప నిన్నెట్లో కాచి యుందురు!

శ్రీశ—కానిండు! (ఆవేశముతో మొగముకెంపురింప) ధర్మముకొఱకుఁ బాటుపడు చున్న నన్ను దుష్టులు వధించినను దీర్చినను నాకు మేలేయగును! మహాశయా నాకుఁ బ్రాణములపైనున్న ప్రేమకంటెను ధర్మముపైఁ బ్రేమయెక్కుడు.

దేవే—(సంతోషముతో) శ్రీశచంద్రా! నిశ్చయముగా నీవట్టివాఁడవే యగుదువు

శచీ—కర్తవ్యమేమి?

దేవే—ఏమున్నది? ఇప్పుడు రేవతీ మనోరమ లెందు నిర్బంధింపంబడిరో యగని తప్పింపవలయును. అందులకుఁదగిన యాలోచన చేయుము!

శచీ—(ఆలోచించి) ఆ! తెలిసినది! ఆనంద కుటీర సౌధమున నైరృతి కోణమున నొక గదియున్నది. అది బందీల కనువగుచోటు.

దేవే—(అర్థోక్తియందే) ఆ ప్రదేశమునకు నుగమిప్పుడు ప్రత్యేకముగాఁ బోవుటకు వీలగునా?

శచీ—లేదు. ఆ మందిరమునకుఁబోవుమార్గ మిప్పుడే దుర్జనులున్న సభామందిరము నుండియే పోవలయును.

దేవే—అయినచో మనము కొంతసేపూరకుండి వారిని వెన్నంటుటయే కర్తవ్యమా?

శచీ—కాదు! మామా! నేఁటిరాత్రి భయంకరమగు కృత్యము జరుగఁబోవుచున్నది. ఇందుమన కెంతవరకు విజయము నొందఁగలమో తెలియదు, కనుక నిప్పుడే పోవుదము!

శ్రీశ—అయ్యో! యీయన మన శచీంద్రబాబే కాదా?

దేవే—అవును. మా మేనల్లుఁడు! శచీంద్రా! యిప్పుడీయింట నెందఱున్నారో! యిందుకు చెప్పుము.

శచీ—కుముదిని, జామల, గోవిందుఁడు, తులసీదాసుఁడు, ముగ్గురు పరిచారకులు ఇద్దరు పరిచారికలు, ఓహో! చెప్పమఱచితిని! ఆనందకుటీర నవీన నాయకుఁడగు నవీనచంద్రుఁడు, సుబ్బు, అత్త, మనోరమ! మొత్తము పదుమువ్వురు!

దేవే—అట్లయినచో నీరాత్రియందే జామలకీ క్రూరకార్యము నెడ సహాయము చేయువారు తొమ్మండుగురు! ఈ తొమ్మండ్రు చేతులనుండియు రేవతీ మనోరమలను సుబ్బును దప్పింపవలయును.

శచీ—మీరు చెప్పిన వర్ణనను బట్టి యిందఱి చేతులనుండియుఁ దప్పించుటకొక యెత్తును, జామలచేతులనుండి తప్పించుటకొక వేఱెత్తునై యుండునని తోఁచుచున్నది.

శ్రీశ—అయ్యో! జామలయెవరు?

శచీ—అది, యీ క్రూరకార్యముల కధిష్ఠానదేవత తెలిసినదా?

దేవే—అదియే నీవు చూచుచుండ నా వెన్నుపై ఖడ్గముతోఁ గొట్టినయువతి! శ్రీశా! భయపడకుము!

శ్రీశ—భయ మెట్టిదో శ్రీశ యిందాఁక నెఱిఁగియుండలేదు!

శచీ—అబ్బాయీ! భయమేట్టిదో! నీకీరాత్రియే తెలియఁగలదు!

శ్రీశ—అందఱకును భయమనునది నాకాశ్చర్యముగాఁ గనఁబడును.

దేవే—ఇఁక మనమాలసింపరాదు! శ్రీశా! నీయొద్ద నేదైన నాయుధమున్నదా?

శ్రీశ—ఒక చిన్న కత్తియున్నది.

దేవే—(ఒకపిస్తోలు శ్రీశునకిచ్చి) ఇదిగూడ నీయొద్దనే యుంచుకొనుము! శచీ! యిఁక మనమిద్దరము నీ కార్యక్రమమునకుఁ గడంగుదము లెమ్ము!

శ్రీశ—ఎక్కడకుఁ బోయెదరు!

దేవే—మే మొక భయంకర కార్యముఁ జేయఁబోయెదము!

శ్రీశ—నన్నుగూడ మీలోఁ జేర్చుకొనరా? అందులకుఁ దగనివాఁడ నేనా?

దేవే—కావని కాదు! పసివాఁడవు! నిన్ను కుసుమలపాలు చేయనేల? యని సందేహము!

శ్రీశ—ఇదుమరేమి? మీతోఁబాటు కష్టసుఖములలో సమభాగార్హుఁడనను కానుఁడు!

శచీ—శ్రీశచంద్రుఁడు సామాన్యబాలకుఁడనుకొంటిని ఇతఁడొక ప్రసిద్ధపురుషుఁడగునని నామదికిదోచుచున్నది.

దేవే—అట్లయిన శచీంద్రా! నీవు సిద్ధముగ నుంటివా?

శచీ—కాకేమి? సిద్ధముగనె యుంటిని.

దేవే—శ్రీశచంద్రా! నీమాటయేమి?

శ్రీశ—చెప్పెడిదేమి? యిదే సంసిద్ధుఁడనైయుంటిని.

దేవే—అట్లయిన మన బూట్సులను విడిచి మాలనుంచుదము

(ముగ్వురును బూట్సులను విడిచి వేయుదురు)

దేవే—శచీంద్రా! నీకిదివఱకుఁ గొన్నిటోపీలను దుస్తులనిచ్చి యుంటిని. అవి యిటు తెమ్ము!

శచీ—తెచ్చెదను. (నిష్క్రమించి ప్రవేశించి) టోపీలు తీసికొనుఁడు!

(ముగ్వురు టోపీలను ధరించుకొందురు!)

శ్రీశ—మహాశయా! మీ పిస్తోలు నాకిచ్చితిరి మీయొద్ద నాయుధమేదైన నున్నదా

దేవే—నాకును శచీంద్రునకును పిస్తోళ్ళును ఖడ్గములు నున్నవి. మనము ప్రాణములకుఁగూడఁదెగించవలసిన సమయము వచ్చినది "సాహసేలక్ష్మిః" అని వినలేదా? మనము సమయోచితసాహసముఁ గృతార్థులముగాఁగలము శచీంద్రా ఆనందకుటీరమునందలి అన్ని భాగములను నీవుచక్కఁగఁ జూచియుంటివి కదా?

శచీ—నేనెఱుఁగని చోటు లేదు!

దేవి—అలసింపనేల? దారితీయుము!

(ముప్వురును నిలువఁబడుదురు)

శచీ—మామా! పోవుదము!

తే॥ చంపకనికుంజసౌరభ ♦ సమితిసుఖము
ననుభవింపఁగ నర్హమై ♦ నది జనంబు
కాని దైవికదుర్విపా ♦ కమున భుజగి
యనుభవించుచు నున్న దే ♦ మందువిధని?॥

(ముప్వురును నిష్క్రమింతురు)

చతుర్థాంకము సమాప్తము



# మనోరమ

## పంచమాంకము.

రంగము:—ఆనంద కుటీరమునందలి సభామందిరము.

[తులసీ దాసుఁడును గోవింద ప్రసాదస్వామియుఁ గుర్చీలపైఁ గూర్చుండుదురు].

తుల—డాక్టరు మహాశయా! ఈక్షణమునఁ గూడను నా మనస్సు మనస్సులో లేదు. నా ప్రాణములు బొందిలో లేవు. భగవంతుఁడు నాకు సెలవిచ్చియున్న యెడల నొక్క నిముసమున నే యిక్కడ వ్రాలియుండుదును. (జేబురుమాలుతో విసరుకొనును).

గోవిం—అంత భయ మేలనండి? కసిదీఱ శత్రువు స్త్రీత్వమును గాజుబుడ్డిచే పంచూర్ణము చేసివైచితిరిగదా? (నిలువఁబడి)

ఉ॥ సరియగు వేళకే హృదయ శల్యముఁ జుల్కన నూడఁదీసికొం
టిరి! తరుణీ ధనంబు లవి నెమ్మదిఁ గైవసమైన యట్ల ను
స్థిరులయి యుండకేల మఱి దీవ్రభయంబునఁ దమ స్థలంబు సి
త్తురు? భయపడ్డవారలకుఁ దోఁచునొకో సకలార్థసంపదల్? ౧

తుల—హృదయశల్య మూడినట్లే భావింతును, కాని—యా దుష్టముండకొడుకు గడుం గడుసరి! అకారణమునఁ బోలీసుల వెంటనిడికొని యిక్కడకు వచ్చునేమోయని యుల్లము దల్లడిల్లుచున్నది

గోవిం—(ఉలికిపడి) మహాశయా! నేఁడు పిశాచము లేవియో వెంట నంటుచున్నట్లున్నవి.

తుల—(నవ్వి) ఏల భయపడెదరు? పిశాచము లేమి? వెంట నంటు టేమి? మీకుఁ బిశాచములపై నమ్మకమున్నదా?

గోవిం—హైందవుఁడనై యున్నంతవఱకును నమ్మవలసినదే, కాని, పాశ్చాత్య విద్యాసంపర్కముచే నట్టినమ్మకము దూరము చేయుచుందును. దయ్యములు

పట్టినవనియు, భూతములు పట్టినవనియు, రోగులను భూతవైద్యుల కొప్పగించుచుందురు. సమాజ విషయముగాన సరే యనుచుందును. మఱల నెవ్వరైనను నన్నట్లే నిశ్చయించు కొనుచుందును. ఇవి యసభ్యవైక వేద్యములే!

తుల—భూతవైద్యులుమాత్ర మేమిచేయుదురు? మంత్రపు బెత్తము నాడించుచు నేదోకొంత యాడంబరము సేయుదురు. రోగులును భయపడి యేదో చెప్పుదురు! పాశ్చాత్య గ్రంథములలోఁగూడఁ బిశాచాదులున్నవి. ఇవి పామర జనులను భయభ్రాంతులను జేయుటకు నిర్మింపఁబడిన కవికల్పిత పాత్రములు అదియొక ప్రహసనము! మహాశయా! నేఁడు మాయింట జరిగిన యాలోచన లందొక రహస్యము వెల్లడినది. వింటిరా? అక్రమాక్రాంతయగు నానందకుటీర సంపదకు జమలాకరుమిని నవీనుడే ముఖ్యాధికారిఁలట.

గోవిం—ఎవ్వరు ముఖ్యాధికారులైనను నాసొమ్ము నాకు వచ్చుటయే నాకుఁ గావలసినది. "వైద్యస్వామీ! త్వరలో మీబహుమతి మీరు గైకొనుఁడు,,"ని జనుల హెచ్చించినదేగాని (లేచి నిలువఁబడి) చరాచర రూపమయిన యాస్తియంతయు మూఁడు భాగములుగఁజేసి నామూఁడవవంతు నేనుబుచ్చికొందునని జనుల తలఁప లేదు. ఏమందురు?

తుల—తక్కిన రెండు భాగములకు నేనును, నవీనుఁడునుగదా! ఈ మీమాట నాకు సంపూర్ణాంగీకారము. ఆస్తియంతయు సర్వ రహస్యములతోడను స్వాధీనముఁ జేసినవాఁడను నేను! మనోరమ నున్మాదినిగా నిర్బంధించిన వాడవు నీవు! ఊరక కూరుచుండి రామ గులామును జంపినవాఁడు నవీనుఁడు! మీ యాలోచన యమోఘము! (తెరవైపు చెవియొగ్గి) ఊరకొనుము! (సంజ్ఞ చేయును).

(నవీనుఁడు ప్రవేశించును.)

తుల—<br>గోవిం— } (లేచి నిల్చుందురు)

నవీ—కూర్చుండుఁడు!

(ముగ్గురును కుర్చీలపైఁ గూరుచుందురు)

నవీ—క్షేమముగనే వచ్చితి ననుకొందును!

తుల—(నవ్వి) కాకేమి? మీరును వచ్చేయని యనుకొందును. అందును నానందము తోడనే వచ్చియుందురు.

నవీ—ఏమట్లనుచున్నారు?

తుల—మీ ప్రియురాలితోఁ గూడ నొంటిగ వచ్చుటలో నానందముగాక నే ముండును?

నవీ—అంతమాట యనుండలకపోదరు? మా ప్రియురాలితో వచ్చుట నాకానందకర మెట్లు?

(కుముదిని ప్రవేశించును)

కుము—(నవీనుని ప్రక్కను కుర్చీపైఁ గూర్చుండి) నాథా! విశేషము లేమున్నవి?

నవీ—(కుముదుని ముంగురులు సవరించుచు) ప్రియా! విశేషములకుఁ గొదువ యేమున్నది? మేము నలువురము తులసీదాసుని మందిరమున నుండఁగా, నటకు దేవేంద్రుఁడు వచ్చి మాచేఁ బునర్జన్మ మెత్తునంతటి విపత్తునకుఁ దేఁబడినాడు!

కుము—(నెటికలు విఱిచి) వాని మొగము మండ! వానికంతటి శాస్తి అయినదని మీరు చెప్పుచున్నారు. యిప్పటికి నాకసిదీఱినది! వానినిగూర్చి జామలా సోదరి చెప్పుచుండఁగా వినుచుందును అప్పుడు మనసులో చిఱ్ఱు చిఱ్ఱుగా నుండెడిది! నాకడుపుమంట చల్లాఱినది.

(పటాక్షేపముగా జానల ప్రవేశించి)

జాను—నవీనా! మీరే నెట్లనుదురు? అతని పునర్జన్మమునకు నే నే—నాకృపాణా ఘాతమే మూల కారణము!

తుల—అగ్నికి గాలి తోడైనట్లు నీ కత్తిదెబ్బకు నా సాగాయపుబుడ్డి దెబ్బయు సహకారి అయినది. ఆ మొండి ముండకొడుకు నాపైఁ గలియబడి యొదలం

తరయూ విఱిచి విసరి పాఱవైచుటచే నాకాలిబెణుకు కొంతయును వదలకను మానలేదు.

గోవిం—ఆసమయమునకు శ్రీశచంద్రుఁ డల్లరియే చేయక నీకృపాణము నాచేత నే యున్న యెడల నశ్వత్థామ ధృష్టద్యుమ్నుని వధించి నట్లతనిఁ జిత్రచిత్ర వధలకుఁ బాల్పఱచి ముక్క-ముక్కలుగ జక్కాడివైచి యుందును., ఆపా పాత్ముఁడు నన్ను లుంగఁజుట్టి పట్టియెత్తి వీథిలోనికి విసరి పాఱవైచి నాఁడు !

జామ—మీరందఱును బిత్తికిత్తనముచేఁ బాఱిపోయితిరి ! ఆసమయమున జనులు రాకుండినచో నతని ప్రాణము లీపాటికి నరకమునఁ జేరియుండెడివి ! అయి నను కొందఱు యేమున్న దికే !

నవీ—ప్రియురాలా ! నీకంత యాలస్యముగ నాయొద్దకుఁ జేరితి వేల ?

జామల—నేను రిత్తయేత్తు వేస్తురు " డాక్టరునొద్దకు బోయివచ్చెద నైదు రూపాయ లియ్యుమంటిని. ఒక మాధురుఁడు నమ్మి నాకయిదురూపాయలు నిచ్చి నాఁడు ! తరువాత నొక డాక్టరువద్దకుబోయి అయ్యా ! నాభర్త ప్రాణా పాయ స్థితియందున్నాఁడు దయచేయవలయునని చెప్పితిని. ఇదిగో భోజ నముచేసి వచ్చెదనన్నాఁడు. మీ యుపకారమునకు—మీ శ్రమమునకుఁ దగిన ఫలితము నందెదరు. త్వరగా దయచేయుఁడని చెప్పి యొకచో డాఁగి యుంటిని. పాపమా డాక్టరు సత్వరముగ భోజనముచేసి యొక్కఁడు బహు మతి యొందవలయునను నాశతో నద్దెకొక పల్లకీ మాట్లాడుకొనెను. ఆబో యీలకుఁగూడ నెక్కఁడను బనిదొరకక పోవుటచే మహోత్సాహముతో నోంకార ధ్వనిసేయుచు నా డాక్టరును తీసికొనిపోయిరి.

గోవిం—చతురమతివగు నో జామలా ! నీబుద్ధి చాకచక్యము వర్ణనాతీతము !

జామ—వినుము ! నేను గుఱుతుచెప్పిన యింటియొద్ద నాపల్లకీ యాగెను. నేనిది యుంటయఁ జూచుచునే యుంటిని. డాక్టరు పల్లకీదిగి యాయింటితలుపుఁ గొట్టిపిల్చినాఁడు. వెంటనే లోపలినుండి దృఢకాయుఁడగు నొక ముస ల్మాను యువకుఁడు వచ్చెను. అతనిఁజూచి డాక్టరు " నీవు వైద్యము

చేయవలయును గదా,, యనియడిగెను. నాకువైద్యమేమి! మిమ్మెవరు పిల్చిరి? అని యతఁడనెను. డాక్టరు తెల్లఁబోయి చూచుచు నామోనమునకు వెంటఁగంది పల్లకీ బాడుగకూడ వృథాగా నిచ్చుకోవలసి వచ్చినందులకు విషాదము నొందుచు బోయీలకు బాడుగ నిచ్చివైచి కాలినడకలఁ దన యింటికిఁ బోయినాఁడు. (బిగ్గఱగానవ్వును).

అందఱును—(నవ్వెదరు).

తుల—నీవింతటి చతురవు గావుననే యీ ప్రపంచమంతయు నీచే జయింపఁబడుచున్నది.

కుము—నా భాగ్యరాశివగు జామలా! నీయండచేతనే యేనింతటి యున్నత సంపదలనుభవింపఁ గలిగితిని.

గోవిం—(లేచినిలిచి) జామలా! లోకోత్తర చరిత్రవగు నీయాశ్రయ లాభము వర్ణింప నేరితరము?

మ॥ చతురాలాపముచేఁ బరిప్లవ కటా • క్షశ్రీ నిపాతంబుచే,
నతి సమ్మోహన మంత్రతంత్రతతిచే, నత్యంత భైషజ్య వి
స్మృతిచే, నిర్జరసుందరీ జనతనూ • ధిక్కారిపై పుణ్య సం
తత సౌందర్యముచే, జయించెద వహో! • త్రైలోక్యమున్ మానినీ

యిన్ని లక్షణములు నొక్క-జామలకేయుండును, తక్కిన యువతుల కిందొకటి రెండు మాత్రమేయుండగలవు!

నళి—మహాశయా! అనుదిన సన్నిధానమున నీమె సౌందర్యము నుపాసించుచున్న నాకే, నేడేలాకో క్రొత్తసోయగమట్లు భ్రాంతిగలుగుచున్నది. మీపలుకులయందతిశయోక్తి యించుకయును లేదు.

తుల—నవీనమహాశయా! ఈమె సౌందర్యానలజ్వాలలమధ్యమున నా డెందంబు భస్మమైపోవుచున్నది. నిజముగా నింతటి సుందరి వర్తమానకాలమున లేదు. (తనలో) కుముదినియు నింతకుఁదీసిపోవునది కాదు. కాని ముగుద. ముగ్ధ

యయినను మనోరమకంటెఁ జతురు! సౌందర్యచాతుర్యము లొక్కచో నివసించుట పురాకృత పుణ్యవిశేషము. (ప్రకా) జామలా! నీకటాక్షపరంపరలు. శరపరంపరలంబోలె మద్ధృదయ విదారణ మొనరించుచున్నవి.

జామ—మీరందఱు నన్నిట్లు గౌరవించుట నిజముగా నా పూర్వజన్మ తపఃప్రభావము.

గోవిం—మానవమాత్రుఁ డెవ్వఁడును నీ సౌందర్యము నుపాసింపకుండఁజాలఁడు! మానవులమాటయేల? దేవతలందఱు నీకై పరితపించుచున్నారో! జామలా! యిప్పటి నీమధురాలాపములు నా హృదయవేదన కుపశమనహేతువులు నుమీ

జామ—మీరన్న పలుకు సత్యమే! కాని, దేవేంద్రుఁడు మాత్రము చుఱచుఱఁజూచుచుండును.

నవీ—వానిపిండాకూడు! వానికేమి తెలియును? పట్టివిరవపుముండకొడుకు! ఈ కేసులో నేయతఁడు పని చేయక పోయినయెడల నీపాద సేవకుఁడై నీవెనువెంటఁ గుక్కవలెఁ దిరుగుచుండెడివాఁడు!

జామ—వానికంతభాగ్యమును, నాకంతటిదశయు నీజన్మమున లేకుండుటచేతనే, మేమిరువురమును బద్ధవైరులమైయుండఁగలిగితిమి. (ఆలోచించి) నేఁడు తులసీదాసుఁడును, గోవిందప్రసాదసేఠులును మాయింటికివచ్చుట మహాభాగ్యము!

తుల—క్రొత్తగఁ బలుకుచుంటివేమి? జామలా!

జామ—దేవేంద్రుఁడు మరణింపలేదుగదా!

తుల—నేఁడు మరణింపకున్నను రేపయినను మరణవార్త వినకుందుమా?

జామ—అంత భాగ్యవంతులమా? రేపుమీమీఁద వారంటు జారీచేయఁబడఁగలదు!

తుల—ఎట్లు? వారంటువచ్చినను నామట్టునకుఁ దప్పించుకొనఁగలుగుదును.

జామ—అట్లు తప్పించుకొన నవసరము లేదు. కావుననే శాశ్వతసుఖమును మాయింటఁ గయికొనఁగలిగితిరి! దేవేంద్రుఁడిఁక మనల గుఱుతించినప్పుడుగదా యాలోచింపవలయును?

గోవిం—నిజమే! యిప్పుడు స్మృతికివచ్చుచున్నది! (ఆలోచించి) "ఏకక్రియాద్వ్యర్థకరీబభూవ"! రేవతీ మనోరమా పాత్రలు రెంటికిని మేము సహాయభూతులమైవచ్చుట వారంటునుండి తప్పించుకొనుటకుఁగూడ నదనయినది.

నవీ—జుమలా! అదేమట్లు చెప్పెదవు? నిన్నను సుబ్బువచ్చియుండెనుగదా! అతఁడుపోయి దేవేంద్రునకీవృత్తాంతము చెప్పకుండునా?

జుమ—(నవ్వుచు) సుబ్బెక్కడనున్నాఁడు? నిన్న నేయతనిఁబట్టి బంధించియుంచితినిగదా?

నవీ—పాపమా పసిబాలునిట్లన్యాయముగ నిర్బంధించుట యేమియు బాగుగలేదు!

జుమ—పోనిమ్ము! నీయభీష్టప్రకారమతనిని విడుదలచేసెదను.

నవీ—విడిచిపుచ్చినయెడల నతఁడు దేవేంద్రునకీరహస్యవృత్తాంతము చెప్పఁడా? అప్పుడు దేవేంద్రుఁడు రక్షకభటులను దోడ్కొనివచ్చి యీనరదకుటీరము ముట్టడింపఁడా?

జుమ—సందేహింపబనిలేదు. వచ్చినమాత్రము వాఁడేమిపావుకొనును? పోనిమ్ము! సుబ్బును విడిచిపెట్టను లే!

నవీ—ఏమిపావుకొనునా? మనలనందఱను బంధించి తీసికొనిపోవును! పాపము! నోరెఱుఁగని పసిబాలునిఁబట్టి, బంధించి, యన్నమును నీరును లేకుండఁజంపుట నీగొప్పతనమునకు లోపముగాదా?

జుమ—ఏమిలోపము? ప్రియతమా! వానిని విడిచిపుచ్చినయెడల వాఁడు దేవేంద్రునితోఁ జెప్పఁగలఁడా?

నవీ—(నవ్వి) అది చొప్పదంటుప్రశ్న! ఆప్రశ్నకర్థమేలేదు. ఆప్రశ్నమునందే యర్థముగూడనున్నది. మానవుఁడైయుండి, అందును మాటాడగలవాఁడైయుండి, తన వృత్తాంతము నొరులతోఁ జెప్పికొనలేఁడా?

జుమ—నేనొక్కమాట యడిగెదను. ఇక్కడ వైద్యశాస్త్రపారంగతులగు మీరిరువురు డాక్టరులున్నారు! రైతుల కొంపలుముంచి వారిని దిక్కుమాలపాలు

నీయంతకల యొక పీడరుబాన్నఁడు! ప్రపంచమున మీకుఁదెలియరాని విషయములుండవనుట స్పష్టము. మీరు మువ్వురు నాలోచించికొని యొక్క ప్రశ్నమునకు సమాధాన మొసఁగుఁడు! "మానవుఁడు పునర్జన్మమును బ్రతికియుండియే పొందఁగలఁడా?,, అనునది ప్రశ్నము.

నవీ— జామలా! నీసమస్య యెవ్వరికిని బూరింపరానిదిసుమీ!

గోవిం— ఇదిక్రొత్త వింతసమస్య! ఇది సృష్టికర్తయును బూరింపలేఁడు.

కుల— పునర్జన్మమనఁగా— నొక శ్రీమంతుని సంపూర్ణదరిద్రునిఁ జేయుటయే యయ్యెనేని, యట్టిది నాచేయు గ్రామపరీక్షలయొక్కయు, నేనుజెప్పు నుపన్యాసముల యొక్కయు సారాంశమేయని నాయభిప్రాయము.

జామ— అయినచో, నేఁజెప్పెదవినుఁడు! నేనిచ్చిన పునర్జన్మసమస్యకు నేనే యర్థము చెప్పవలసివచ్చినది. నామందు సీసాలోని యొక్క యౌషధ రస బిందువుచేతనే మనుష్యునకుఁ బునర్జన్మము వచ్చునట్లు చేయఁగలను- ఆబిందువు పానీయమునఁ గలిపియిచ్చెదను. అతఁడు త్రావి సుఖముగనే యింటికి బోవును.

గోవిం— (నవ్వి) నీసమస్యా పూరణమునకర్థము లేదు. ఇఁకఁ బునర్జన్మమెట్లు వచ్చును?

జామ— అతఁడెక్కడనుండి వచ్చుచుండెనో, తనకెవ్వరు గాన్పించిరో, యేమేమి మాటాడిరో యేమియు నెఱుఁగఁడు. చాలాకాలమున కతఁడు మరణించినను, దన జీవితమున మనవిషయమున నేమియు జ్ఞప్తియందుంచుకొనఁ జాలఁడు!

నవీ— (అదలిపడి) జామలా! యిప్పుడతని విడువరాదా?

జామ— నాథా! విడుచుటెందులకు? అతనిని దరువాత విడువవచ్చునులెమ్ము!

నవీ— అట్లయిన రక్షకభటులు మనల వెంటాడరనియే నీనిశ్చయమా?

జామ— నిశ్చయమే! (సగర్వముగ) వెంటాడినను దిరిగిపోలేరు' తెలిసినదా? రక్షక భటులువచ్చి యీ యానందకుటీరమును ముట్టడింతు రనుకొందము. అప్పుడు

వారికి రేవతీ మనోరమల పీనుఁగులుగూడ నెచట నున్నవో కనుగొనుట కష్టము!

నవీ—(అదటిపడి) ఇప్పుడు రేవతీమనోరమల నిరువురను వధింపవలయుననియే నీనిశ్చయమా?

జామ—కాకేమి? ఈరాత్రియే వారింబరలోకమున కంపితీరవలయును!

నవీ—నిష్కారణముగా నిరువురు సుందరీమణులను నకాల ప్రాణాన్మరణముల పాలు చేయుట యెంతయో యసహ్యముగ నున్నయది. వారేరోగమువచ్చి చని పోయిరని లోకులనుకొందురు?

జామ—(అర్థోక్తియందే) మూర్ఛరోగమున నని! తెలిసినదా? (వికటముగా నవ్వును)

(దేవేంద్రుఁడు తొంగిచూచి వినుచుండును)

నవీ—ఇరువురు యువతులు, ఒకేరకపు మూర్ఛరోగముచే, నొక్క సమయముననే మరణించెనను వృత్తాంతమును లోకులు విశ్వసింతురా?

జామ—వారినెట్లు విశ్వసింపఁజేయవలయునో నేను సంపూర్ణముగ నెఱుఁగుదును! భయపడకుము!

నవీ—(బొమముడివైచికొని) జామలా! నీవెంత సుందరీమణివో యంతక్రూరాత్మురాలవు! ఎంతచతురమతివో యంత కఠినహృదయవు! ఒకపిశాచబాలిక మానవీరూపముఁ దాల్చిన నెట్లుండునో? యిపుడు నీవట్లుంటివి!

మ॥ నినునమ్మంగు వినోదలాలు మజివా ♦ నిన్ నమ్మవీవున్; గుణం
బున, విద్యం, జతురత్వసంపదల, నె ♦ వ్వున్ మీకుమీరే సమ
త్వ నిరూఢింగసినారు! సాహసమునం ♦ వైద్యంబునం దొండురుల్
గనియున్నారలు సామ్య, మట్లగుట నేఁ ♦ గంటిన్ భవత్క్రూరతన్ ॥

దేవే—(తనలో) ఈ నీయభిప్రాయముతో నే నేకీభవించుచున్నాఁడను.

జామ—ప్రియా! యేల యీనిష్ఠురోక్తులు?

చ॥ పతివచియించి నట్లు బహుళభంగుల సేవలొనర్చియుంటి నా
మతికిఁ బ్రమాదమొక్కయెడ మాత్రము సేరఁగనీక, స్వామి స
మ్మతి ఘనకృత్యముల్ నెఱపి మాన్యతఁగాంచితిఁగాక! నాదు దు
ష్కృతియొకటైనఁగంటివె? వచించెద వేల నిరర్థవాక్యముల్॥ ౪

గోవిం—(తనలో) ఇప్పుడు జామలా నవీనులకున్నై మనస్యము సంభవించినది. ఇది యే నాతపఃఫలము! (ప్రకా) నవీనచంద్రా! యీచంద్రవదన పల్కులు సత్యములు!

నవీ—సత్యమున కేమిలెండు! ఇట్లు ఘోరహత్యగావించుటకంటె నిర్బంధించుట మేలు! ఈమె సాహసమున జుగుప్స జనించుచున్నది!

తుల—ఎట్లయినను జామల కృత్యములు నెఱవేఱుటే యుత్తమకార్యము! ఆమె కార్యములు నిరంతరాయముగ నెఱవేఱును గాక!

జామ—నవీనా! నావిషయమున నెట్లయిన నటుకొనుము! నేనుమాత్రము నాసర్వాంతః కరణములతో నిన్నుఁ బ్రేమించుచు నేయున్నాను.

నవీ—నీయిష్టము వచ్చినట్లు చేయుము! ఇప్పుడు కర్తవ్యమేమి?

జామ—వారిని వధించుటయే కర్తవ్యము!

తుల—(అదరిపడి) వారిని వధించు టెట్లు?

జామ—ఒకరి యౌషధబిందువును పానీయమునఁగలిపి యిచ్చెదను. అదియే వారికి జీవితాంత తులసీతీర్థము గాఁగలదు.

తుల—వారు త్రాగకపోయినచో?

జామ—ఇంకొకవిధమునఁ జంపెదను.

తుల—ఆయుపాయ మేది?

జామ—జామల యుపాయములకుఁ బుట్టినిల్లు మహాశయా! యేల నన్నింతగా నొత్తిపల్కుచున్నారు? (నవ్వును)

కుల—నీమధుర శరచ్చంద్రికా మందహాసము నాహృదయమును బరవశముఁ జేయుచున్నది.

గోవి—అట్లయినచో నింక మేమేమి చేయవలయును.

జుమ—ఇప్పుడు మీ రేమియుఁ జేయనక్కరలేదు! పోయి పరుండుఁడు!

గోవిం—ఎక్కడ బండుకొనవలయును? సుందరీమణీ! నాహృదయ మవశమైపోవుచున్నది. నీ సాన్నిధ్యమునుండి నీ యతిలోక రామణీయకమును గనులారఁ జూచుచు నుపాసించుచుండుటయే నాకుఁ గావలసినది! అహా! సౌందర్యము నీసొమ్ము! ఇఁక నేను వేఱొకచోట శయనింపఁజాలను.

జుమ—ఆయుపాసనా సిద్ధిత్వరలోనే మీకుఁ గలుగుఁగాత! మీయుపురుష సోపానములకుఁ బ్రక్కనున్న గదిలో శయనింపుడు.

గోవిం—ప్రియతమా! ఇప్పుడు మే మేమియు నీకు సాయపడనక్కరలేదా?

జుమ—అక్కరలేదు! నవీనుఁడును నేనును గలసి మీపని ముగించెదము? మే, మే మేమి పనులు చేసియుంటిమో సర్వమును మీరు దరువాతఁ జూచుకొనవచ్చును.

గోవిం—ఆపని చేయుటలో మాకంత శ్రమయుండదు. మహోత్సాహముతో నొనరింపసంసిద్ధులమైయుంటిమి. కావున నీయుత్సవమున మమ్ముఁ బాల్గొననిమ్ము!

జుమ—అంతశ్రమయేల? పోయి పరుండుఁడు! మీ పనియంతయు మేమే తీర్పఁగలము!

గోవిం—మాపనియనఁగా?

జుమ—మీరు చేయఁదలఁచినపని!

గోవిం—అదియే చక్కఁగా విస్తరింపుము!

జుమ—మీ రింక రాజభటులకుఁ బట్టువడకుండ శాశ్వతసుఖము నీయానందకుటీరమునఁ గైకొందురని చెప్పియుంటిని ఆశాశ్వతానందమే, ఆశాశ్వతసుఖమే

మీరుపొందునట్లు మీపనియంతయుఁ దీర్చెదను! ఇప్పటికి బోధపడినదని తలఁచెదను.

గోవిం—ఇంకను స్పష్టీకరింపఁబడలేదు. (సందేహముతో తులసీదాసునుఁ జూచి) మహాశయా! మీకేమైన బోధపడినదా?

తుల—యేమియు బోధపడినదికాదు!

జాన—(నవ్వి) (అర్థోక్తియందే) బోధపడుటలేదా? మీయిరువురనుగూడఁ బరలోకమునకంపెదము. అనగా—నిరువురను జంపివైచెదము! విద్యావంతులరయ్యు మీరింతమాత్రము గ్రహింపఁజాలకుండుట వింతగానున్నదే! (వికటముగానవ్వును)

గోవిం—(విచారముతో) నిశ్చయముగనే చెప్పుచుంటివా?

తుల—నీమాట సత్యమనియే నమ్మవలసినదేనా?

జాన—ఇందసత్యమేమున్నది? నిశ్చయమే చెప్పితిని.

తుల—పిడుగడిచినచందమున మామరణవృత్తాంతము మాకెఱింగించుచుంటివే! (విచారముతో)

ఉ॥ ఆసలుగొల్పి, నాదుహృద♦యాంబుజమున్ వికసింపఁజేసి, యీ
దానుని నిన్నియేండ్లుగ ము♦దంబునఁ జేరఁగఁదీసి, యెన్నఁడుం
గాసాకలైన నీయక యు♦కాల హతాస్మరణంబు పాలుగాఁ
జేసితి విధిన్యాయ్యముని♦చెప్పుదురే యొటనేని భూజనుల్॥ ౫

మఱియును,

చ॥ సకలధనంబు నీదగు ప♦శంబున నిల్వఁగఁజేసి సాధురా
లికి "మతిచెడ్డ"దంచు సభ♦లీకృతయత్నుఁడనౌచు వైద్యశా
లకుఁగొనిపోవలేదె? జమ♦లా! యిపుడీవు కృతఘ్నురాలవై
యకటకటా! హతాస్మరణ♦మందఁగఁజేసెదు న్యాయమేనఁటే? ౬

ఇంతకును నిన్ను నవలనీవననియేమున్నది? (దుఃఖముతో) హా! మనోరమా!

మ॥ ననునాసాసలఁజేరి, నావలన♦నైనన్ నీమహాసంపదల్
గొనఁగా వీలగునంచు నమ్మితివి! నేఁ♦గూర్చుండ నాచుర్ భవ
ద్ఘనసంపన్నిచయంబు నీజాములకున్♦గాఢంబుగా నప్పగిం
చిన ఘోరాఘఫలంబు దుర్మరణమై♦చేడ్పాటు నొందించెనున్॥ ౭

జూములా! ఏమిచేయుదును? సర్వమునునీవనినమ్మితిని. నానమ్మకమమ్మగా వించితివి.

గోవిం—(దుఃఖముతో) ఇఁకబశ్చాత్తాపమునఁ గొంతపాప మునశమింపఁజేసికొను టేగదా! జూములా!

ఉ॥ నీవు నవీనచంద్రుఁడును♦నెయ్యులరయ్యెద; రట్లుగాన సం
భావిత భాగ్య భోగ్యముల♦పట్టున నిర్వురుగూడికొంద్రు: నే
నోవిధినిర్ణయంబునను♦నోపఁగరాక భవత్కృపాణధా
రావిగళాసుఁడై నరక♦రాజ్యముఁజేరెద మిమ్ముఁజేరుటన్॥ ౮

హా! నీసౌందర్యానల కీలికలంకరాళించుకొని నాహృదయకమలమును గబళించుటచే, నీచరణసేవామృతమున నించుక శాంతి నొందఁగలదని నిన్నుజేరితిని. చేరినందులకుఁదగినఫలిత మందితిని.

చ॥ బహుమతులిత్తునంచు♦బహుభంగుల నాసలఁగొల్పికొల్పి ప్ర
త్యహము భవత్కృపామహిమఁ దత్పరతన్ నెలకొల్పినట్లు, స
న్నహనముచేసినట్ల; నివు♦ణత్వముఁజూపి, యకాలమృత్యుసం
వహనము నాకుఁగూర్చితివి♦వహ్వరె! చాలుదు వెంతవానికిన్॥ ౯

జాము—ఏమయ్యాయట్లు నిష్ఠురములాడెదరు? నాహృదయము జాలిగలదో కాదో యించుకయూహింపుఁడు! రతీశభటులకుఁ జిక్కితిరేని మీప్రాణము లురి

స్తంభమునఁ బోఁగలవు. అట్టియపకీర్తియుత దుర్మరణము మేలో, యిట్టి నా చేతి సుఖమరణము మేలో యూహించుకొనుఁడు.

గోవిం—నీవు చెప్పినప్రకారము మేము మరణమునకు సంసిద్ధులమైయున్నాము కాని మిత్రత్వమునకు శత్రుత్వముఁ గలుపుట నీకు మేలుగా దోచుచున్నది.

జామ—మీకంత కోపమెందులకు? మీకు నేను సుఖముఁ గలిగించెదనుగా నా? చంపుటనఁగా రక్షకభటులకుఁ జిక్కకుండునట్లు మీచిత్తములకుఁ బరిణామముఁ గూర్చుటయే సుఁడీ?

గోవిం—ఏమిచేసినను నీదే భారము! పోరాడుము! సెలవు! తులసీదాసా! పోవుదము రమ్ము! రక్షింపుమన్నవానిని భక్షింపుచున్నారు!

తుల—ఇదిగో వచ్చితిని జామలా! యింకఁ జెప్పవలసినది లేదు.

(ఇద్దరును నిష్క్రమింతురు)

నవీ—(కుముదినిఁ జూచి) ప్రియా! మేముచేసిన యీ యాలోచన విషయమున నీయభిప్రాయమేమి?

కుము—నేనుచెప్పవలసినదేమున్నది? (జామల వీపుపైదట్టి) జామలకును నాకును భేదముగలదా? (నిలిచి)

చ॥ ఇరువురు మొక్క కార్యమున నేకమతిం జరియించినార; మీ
రిరువురి సౌహృదంబు నిగ మేము మెలఁగంగల; మింకఁ జిత్తము
వ్వరిని దలంచినంతన యు పార్శ్వథయాకులమై చలించు నా
తరుణి మనోరమం బడయు దాఁక సుఖం బొడఁగూడ దెప్పుడున్॥

దేవే—(తనలో) ఆహా! "వివాహశ్చ, వివాదశ్చ, సమయోరేవశోభతే,, కుముదిని, జామల యంత నెఱజాణ గాకున్నను గ్రామ్యమున జామలకు సహోదర్యయుని గాఁదగ్గదియే!

నవీ—నీనిశ్చయ మట్టిదేకదా? కుముదినీ! చాలఁ బ్రొద్దుపోయినది. నేను రేవతీ మనోరమలను వధించినపిమ్మట నీయొద్దకు వచ్చెదను. నీహృదయశల్యములగు మనోరమారేవతుల ప్రేతములను నీకనులారఁ జూచి సంతసించెదవు, ఈ ప్రపంచమున నీయభిమతము దీర్చుటకన్న నాకుఁగావలసిన దేమున్నది?

కుము—ప్రియా! నవీనచంద్రా! నేను నీకుఁ గ్రొత్తదాననా?

నవీ—ఎన్నఁడును గాదు! ఇరువురి హృదయములును ప్రణయశృంఖలాబద్ధములైనవి నాకీ విశాల ప్రపంచమున మీయిరువురే నాసుఖసాధనములు! ఇఁకఁబోయి నీశయన మందిరమున శయనింపుము!

కుము—(జామలను జూచి) అక్కా! యిఁక నేఁబోయి పరుండెదను, అన్నిటికి నీవే యున్నదానవు. జాగ్రత్తగఁ గార్యముఁ గొనసాగించుకొనుము!

(నిష్క్రమించును)

నవీ—ప్రియా! ఇఁకఁ గర్తవ్య మేమున్నది?

జామ—మారణమహోత్సవారంభ మేకదా!

నవీ—జమలా! నీ మారణవ్రత మెందఱితో నుద్యాపనము గాఁగలదు!

జామ—అందఱితోడను.

నవీ—(అదరిపడి) ఇందుఁ గుముదినికూడఁ జేరియున్నదా యేమి?

జామ—(నవ్వుచు) అహా! కుముదిని లేకుండ వ్రత మెట్లు?

నవీ—(అర్థోక్తియందే) అదేమట్లనియెదవు? కుముదినిని విడిచిపెట్టవా? అది నీకే యపకారముఁ గావించినది? మఱియు నాపైని నాకిచ్చి వివాహము చేసితివి గాదా? ఇప్పుడే యాసుందరీ రత్నమును దూరముగావించెదవా?

జామ—కుముదినిని వివాహముచేసినమాట సత్యమే! ఇప్పుడు దూరముచేయుటయు సత్యమే! అది నాకపకారము చేయకపోయిన నేమి? నాయభిమతమట్టిది. నేనే నీకిచ్చితిని, నేనే మరలఁ గయికొందును.

నళీ—జామలా! నీవింతకఠినహృదయవని నేనెన్నఁడు ననుకొనలేదు.

జామ—(అర్థోక్తియందే) నేను మృదుహృదయను గానా? వాథా! బ్రాహ్మణకాల లంబిపై యుపనిషద్రహస్య సారమంతయు గ్రహించితివి. శత్రుమిత్ర వైష మ్యము తద్విరుద్ధము గాదా? వెఱుగుపడెదవేల?

నళీ—(భయముతో) నాకీ వేందాతసిద్ధాంతము ప్రాణాంతకముగఁ దోఁచుచున్నది.

జామ—నళీనా! మన యిరువురకును, భేదమున్నదా? ఉన్నచోఁ బ్రేమ కాస్పద మెక్కడ!

నళీ—లేదు, భేదమేయున్నచో నింతకాలమునుండియు నేను నిన్నుఁ బ్రేమిం చుటెట్లు?

జామ—(ఆనందము నటించి) అదియే నాకుఁ గావలసినది! ప్రియా! ఈలోకమున మనమిరువుర మేకదా యుందుము!

నళీ—(ఆనందముతో) ప్రియా!

సీ॥ అతిలోకరమణీయ ♦ మైన నీనెమ్మోముఁ
గనులపండువుగ నేఁ ♦ గాంచునపుడు
మధురసుధాధార ♦ మఱపించునీపల్కు
శ్రుతిపర్వముగ విను ♦ చున్నయపుడు
నతినిశితంబులై ♦ నట్టినీచంచలా
పాంగంబు లెడదఁగీ ♦ ఱ్ఱుచునపుడు
పటుభయంకరములౌ ♦ భవదౌషధ రసాయ
నములపై డెందంబు ♦ బ్రమయునపుడు
తే॥ నీదు గంభీరచేష్ట పం ♦ డితులకైన
మిగుల భేదింపరాకుండ ♦ నెగడునపుడు
వనిత! నీయందనాకు వి ♦ శ్వాసమమరె
నీవులేకున్న జగమున ♦ నిలువగలనె?॥ ౧౧

కావున రమణీమణీ! నీవే నాసర్వస్వమవు! అహా! నీవుఁ బ్రేమ మయమూర్తివి

జూమ—(సంతసముతో) నాథా! నాజన్మము కృతార్థమయినది. నీవంటి రసిక వరుండు నాకు విభుండగుట కంటెను గావలసిన దేమియున్నది? నన్ను మఱవవలదుసుమీ!

దేవేం—(తనలో) నవీనుండు మైకమునం బడిపోవుచున్నాండు! దుర్భేదకమయిన మోహమాయతని నావేశించినది.

నవీ—ఏలమఱచిపోయెదను? ఎన్నడును మఱవంజాలను. (ఆలోచించి) జమలా! ఒక్కమాట (వేళ్లులెక్కించుచు) తులసీదాసుండు—గోవిందప్రసాదసేనుండు—సుబ్బ—రేవతి—మనోరమ—

జూమ—(అర్థోక్తియందే) కుముదిని—కెరసి ఆర్యారు!

నవీ—కుముదినికూడం జేరవలసిన దేనా?

జూమ—(నవ్వి) ఎందులకుం జేరదు? నాథా! మన యిరువురమే కదా యుండవలసినది?

నవీ—సరే! నీవుండ నాకుం గుముదినియేల? "ఇద్దఱు పెండ్లాల మధ్య యిఱుక్కచ్చి"నట్లు నాకీబాధ యనవసరము! నీపలుకున కెదురుచెప్పను. జూమలా! ఆఱుశవము లొక్కరాత్రి నీ సౌధమున నుండుటా? ఇన్ని గోతులు త్రవ్వువా రెవరు? గంగానదిలోం బడవైవుదమన్నను మోసుకొని పోవువా రెవరు? నే నొక్కండ నేమి చేయంగలను?

జూమ—ఎవ్వరును గోతులు దీయనక్కరలేదు. గంగకు మోసికొని పోవనక్కఱలేదు. ఇక్కడనే కుళ్ళిపోనిమ్ము.

నవీ—అయినచో రక్షకభటులు మనలంబట్టుకొనరా?

జూమ—ఎట్లును బట్టికొనలేరు.

నవీ—మన మేమైపోవలయును?

జూమ—ఏమగుదుము? ఒక్క టేగతి!

చ॥ వినుము నవీనచంద్ర! పృథివీస్థలియందెటనైనఁ బోలినన్
మనలను బట్టఁజాల రను మాట యథార్థము సుమ్మ! ఏటికిం
గనఁబడకుండ నొండొరుల కౌగిలితో భువనంబు లన్నిటం
జనుదము పంచభూతముల సంగతినొందు; భయంబు లేదికన్॥

కుముదిని మరణించెనను నపవాదము లోకులెల్లరను విశ్వసించిరి, కుముదినియు మనోరమయుఁ బడియుండుటంగాంచి నేనును మనోరమయుఁ జనిపోయితిమని విశ్వసింతురు! ఇఁక నీరహస్యము నెవ్వరు భేదింపఁగలరు?

దేవే—(తనలో) హా పాతుక్రాలా! ఈరహస్యమును మేము భేదించుచున్నామని నీవనుకొనుట లేదు!

నవీ—నేను పాటిపోవుదును! రక్షకభటులు వెన్నాడుదురు! తప్పించుకొనుదానవు నీవేకాదా! నాపాపము బ్రద్దలు కాకపోదు!

జుమ—ప్రియా! జుమల నిన్నుఁదన సర్వాంతఃకరణములచేతను ప్రేమించుచున్నదని యెఱుఁగవా!

నవీ—(ఆనందముతో) నీనిశిత కటాక్షపరంపరలు నాకు శరపంజరము కాఁగలవు! (ఆలోచించి) ప్రియా! ధనమువిషయమయి యేమి యాలోచించితివి?

జుమ—అది దాఁచియుంచితిని

నవీ—అది యెక్కడ దాఁచితివి?

జుమ—ఎక్కడనా? యీ యింటనే

నవీ—నాకుఁ దెలుపరాదా?

జుమ—నేనంత వెఱ్ఱిదాననా? ఇప్పుడు తెలిపినయెడల నీశవములను విడిచి పాఱిపోయెదవు. మనకర్తవ్యమును బూర్తి చేసికొన్నపిదప నంతయు నీకొప్పగించెదను. అప్పుడే నీవీధనములకును, నీ సౌధములకును, నీభూములకు, నాకును స్వామివయ్యెదవు! నానవీనా! నీవే నా స్వామివి!

వీ—నేనులాంతివాఁడననియేకదా నీయుద్దేశము?

జుమ—అట్లయినచో నిన్నెను మనసారఁ బ్రేమించుటేల? (నవీనుని గవుఁగిలించుకొని ముద్దుఁగొనును)

నవీ—(ఆనంద పారవశ్యముచేత) ఆహా! అమృతము! ఆనందము! 'ఆనందో బ్రహ్మ' 'బ్రహ్మానందం పరమసుఖదం' ఆహాహా! లావణ్యమయీ! అమృతశీతలములు నీ సర్వాంగములును నాకు శాశ్వత విశ్రాంతి నొసంగుచున్నవి. ఈజన్మమున నింతటిసుఖము మఱొండుచోట నలభ్యము నీ చరణకమలముల సేవించుటకంటె నాకుఁ గావలసినదేదియును లేదు!

జుమ—కాకున్నచో లోకమంతయును నన్నుఁజూచి మోహింపఁగలదా? ఈయదృష్టమే లేకున్నచో నేనిట్లు త్రిలోకసుందరినై పుట్టగలనా? (కౌఁగిలి విడిపించుకొనును)

నవీ—కాకున్నచో శక్తియే పరదేవతయని శాక్తేయులొప్పుకొందురా?

జుమ—నా స్వామీ! నేనెల్లప్పుడు నీ సౌందర్యము నేఅభిలషించుచున్నదానను కావున నా సర్వప్రయత్నములకును నీవు సహాయభూతుఁడవు గావలదా?

నవీ—సర్వసంసిద్ధుఁడను. ఇఁకఁ బ్రారంభింపుము!

జుమ—వచ్చెదనుండుము (నిష్క్రమించి యొకమందులపెట్టెతోఁ బ్రవేశించును.)

నవీ—(జుమలయొద్దకుఁజేరి చూచుచుండును)

జుమ—(ఒకయౌషధపు సీసా మూఁతఁదెఱచి వాసనచూచునట్లభినయించి) అవురా! యెంతనిర్భాగ్యురాలను! ముక్కులు బిగిసికొనిపోయినవి! నేఁడే పడిసెము పట్టినదే!

నవీ—ఇప్పుడు నేనేమిచేయవలయును?

జుమ—ఇందలి యౌషధము నాగసంపెంగపూవులాగునఁ బరిమళించుచున్నదేమో చూడుము! నాకు వాసనయే తెలియుటలేదు.

నవీ—కొంచెము, మీచేతిపైఁ జమిరివాసన చూతునా?

జామ—(అర్థోక్తియందే) వలదు వలదు! ఒక్కబొట్టు చేతిపైఁబడె నేని యిక నాకు దక్కవు. జాగ్రత్త

నవీ—ప్రియా! వాసనచూచినచోఁ బ్రమాదము లేదుగదా?

జామ—వాసనచూచిన బ్రమాదము రాదు. ఒడలిపైబడిన భస్మమగుదువు.

నవీ—ప్రియా! అట్టి దివ్యౌషధములు నీయొద్దనున్నవి! బ్రదికింపఁగలవు-చంపఁగలవు. అఘటనా ఘటనాశక్తియు నీయొద్దనే యున్నది. (వాసనచూచి) ఆహా! యిది యెంతగఁ బరిమళించుచున్నది! ఎవ్వఁడును నాకుఁ దీనివిషయమై చెప్పనైతివి! (మిక్కిలిగ వాఘ్రాణించి) హా! సర్వప్రపంచమును గిఱ్ఱునఁ దిరిగిపోవుచున్నది. (లేచి యాసీనా నభ్చటనుంచి తల రెండుచేతుల తోడను బట్టుకొని) ఓహో! జామలా! కన్నులు మూసికొనిపోవుచున్నవి! అంతయు నంధకారబంధురము- హా! హా! (క్రిందఁబడి తన్నుకొని) అంతయు నానందము! జామలా! జామ-జా-హో-అ-అ-(మూర్ఛిల్లును)

జామ—(వికటహాసము చేసి బిగ్గఱగా) ఒక్కటి! (ఆనందముతో)

పాట జంఝూటి—త్రిశ్రగతి

ఎందులకు-నన్నుఁజేరి-తిచ్చటను-నవీనచంద్రి

సుందరుఁడవు-మ్రిందితివి-వసుంధర డించెదవిఁకనీ

కేశ—(తనలో) ఎంత భయంకర వ్యాపారము జరిగినది! అహాహా! ఎంతమాయావిని యిది! వాండ్రిను నిల్లే చనిపోయెదరాయేమి?

జామ—(పాడుచు ఆడుచు నవీనునియొద్దఁజేరి పరిశీలించి)

ధనమెను నాదగు చక్కం-దనమును-ఘనములు గఁదలఁచి

ననువరియించినకతన ని-ధనము దితి-వహహా వలచి యెంత

వహ్వారే! వహ్వారే (ఆడుచు)

మును గురుఁడగు పూలుసాహె-బునువలచితి మోహముచే

ననయము నిన్ననయునిఁ జేకొననైతి వివాహముచేనందు

మ॥ యమలోకంబు నవీనచంద్రి! యిపుడే నా చేరియున్నావు, నీ
భర్తిమ మెల్లన్ నశియించె నీవు బ్రదుకన్ రా దట్లు జీవించినన్
జమలా దేవికిఁ బ్రాణసంకటము హెచ్చున్; దీర్ఘనిద్రాధ్యయా
ఖముదంజూచుచు నేనయుంచు మదిలోఁ గుల్ నమ్మి గాఁ బ్రవృద్ధుల్ ॥ ౧౩

కావున నన్నిఁక నెవ్వరును బట్టుకొనఁజాలరు! ఓహో! ధనము! ధనము!
(నిలువుటద్దమునఁ జూచుకొని) నా సౌందర్యమునకేమి లోపము?

మ॥ తమిజుద్దీనుని సర్వసంపదలు నై దమ్మిం బ్రవర్తిల్లె, గు
ల్సుమకై యిచ్చినవాఁడరందముఁడు! త్రైలోక్యంబు మెచ్చన్ మనో
రమ సర్వస్వము నేను గైకొనిన చిత్రించె విచిత్రంబు! నా
శ్రీమ మెల్లన్ ఫలియించె నా జననమే సార్థంబు ముమ్మాటికిన్ ॥ ౧౪

ఇఁక మిగిలియున్నవారు రేవతి-మనోరమ-సుబ్బి! వీరు మాత్రమే యిప్పటికి బ్రదికియున్నవారు!

దేవే—(తనలో) దీనినలుగురిం బట్టి చూడఁగా నిద్రింపఁబోయిన యీ మువ్వురును గూడ విష ప్రయోగముచే మరణించిరని తోఁచుచున్నది. ఇఁక గతియేమి?

దావు—(మేజాపైనున్న సారాయపుసీసా గైకొని) ఇఁక దేవేంద్రుఁడేమి చేయఁగలఁడు? బ్రదికినంతకాలమును నవధిలేని రేవతీ వియోగముచేఁ గృశించి కృశించి చావఁగలఁడు! (సారాయముఁ గ్రోలి) మైకము బాగుగనే వచ్చుచున్నది (గంజాయి పీల్చి) అల్లాహో అక్బర్! నేఁడెంత సుదినము! దేవేంద్రుఁ డేయున్నచో-దేవేంద్రుఁ డేయున్నచో-నీ హత్యలన్నియుఁ గనులారఁ జూచి ప్రాణములు విడిచెడివాఁడు! హత్యలు-హత్యలు-అన్నియు హత్యలే! (గంజాయి పీల్చి) ఇలాహి- ఇల్లిల్లా! మహమ్మదు రసూలిల్లా! బలే! బలే! ఆయిదుగురు సేవకులును గూడ నాచే మరిణింపవలసినవారే! యమరాజా! నీయుద్యోగులలో నావంటి పనివాండ్రు గలరా? ఒక్క దినమున నెందఱను నీ రాజ్యమునకంపితిని

(నవీనుని వైపు చూచి) (ఉలికిపడి) ఇదేమి! నవీనుఁడిట్లయినాఁడు? (ఆలోచించి) కాదు కాదు! నిజముగాఁ జనిపోయినాఁడు! (ఒక వస్త్రము నవీనుని పైఁ గప్పి)

నవీనచంద్రా! యిప్పటికి నీవు యమరాజ్యమునఁ జేరియుందువు! (సారా
యము త్రావి)

కవి॥ చతురత చేతనె సర్వజనంబుల ♦ సంహారణం బొనరించెద, నా
చతురిమయే కలికాలమునందు వి♦శాలసుఖంబులు పూర్ణమహో
న్నతధనముం గయికొంటకు నెప్పుడు♦ నామది యుత్సవమందెనో నా
చతురతయిప్పుడే లోకవశీకృతిఁ♦ జాలఁ గృతార్థతనొందమనెన్ ॥౧౫

ఏదిరో మఱచితిని...(సారాయపు బుడ్డీయాడించుచు ఇదిరో మఱచితిని.
ఇది నాకు ముఖ్యమయిన సాధనము ఓ...ఏదిరో మఱచితిని(ఆలోచించి)
ఏమియును లేదు! రామగులాము ప్రమాణపత్రికతో నున్న 17 క అను కాగిత
ములకట్టను జూడవలసియుండెను. (అని యొకపత్రిక్కఁ బరిక్రమించి)
అయినను దొందఱయేమి? రేపటి యుదయమునఁ జూచుకొనవచ్చును. ఇఁక
నాత్మమహోత్సవమునకుఁ బోయెదను గాక! మైకము తగ్గుచున్నది! (సారా
యము త్రావి) భేష్ ఇప్పటికి మైకము సంపూర్ణముగ లభించినది.

దేవేం—(తనలో) ఈ రాక్షసి తప్పఁద్రావి సారాయపు మైకముచే నన్నుఁ జూడ
లేకపోయినది. మంచిది ఇట్లుండినఁగాని నాకార్యము నెఱవేఱదు. అమ
వ్వరకే యంతఃపురమందిరములను విషవాయువులచేఁ బూరించియున్నదని గ్రహిం
చినయెడల నప్పుడే వారికి దుర్మరణములు రాకుండ నడ్డగించియుందును కాని
మ్మ! ఇప్పుడు దీనిని వెన్నాడి చనెదగాక! (జామలవెంట నడచును)
(ఆ వెనుక శచీంద్రుఁడును శ్రీశచంద్రుఁడును క్రమముగా నడతురు)
ఝుమ—(మేడమెల్లి కెక్కుచు)

పాట

ముందుగనే కుముదినిఁ గన-బోయెదఁ గాకిపుడు నాకుఁ
దొందఱ గొనేమున్నది యా-నందకుటీరంపుగదుల

దేవే—(తనలో) ఈపిశాచి యదృష్టవశమున మనోరమను రేవతిని జూడఁబోలేదు
నయమే యాయినది (శచంద్రునితో మెల్లఁగా) మీరీ స్తంభముల చాటున దాఁ
గియుండుఁడు! నేఁబోయివచ్చెదను.

శచీందుమతులును శ్రీశచంద్రుఁడును స్తంభములచాటున దాగియుందురు)

జాము—(ఉలికిపడి) (తనలో) ఏమిది? యాశ్చర్యముగనున్నదే! పిశాచమేదో వెను వెంట వచ్చుచున్నట్లున్నది (వెనుదిరిగి చూచును)

దేవే—(స్తంభముచాటున దాఁగును)

జాము—ఏమియుఁ గనఁబడదే! నాకంటెను భయంకరపిశాచి యీలోకమునను లేదు. నాయాపధముల ముందు పిశాచములేకావు! యక్ష రాక్షసులుఁగూడ నెందులకును బనికిరారు. జాములా! భయపడకుము! ప్రపంచమునందలి సర్వశక్తులును నీయందే కేంద్రీభవించియున్నవి. ధైర్యసాహసములు నీజన్మహక్కు! (నడచి నిష్క్రమించును)

దేవే—(నిరూపించి తనలో) హా! జాముల కుముదుని శయనమందిరమునకుఁ బోవుచున్నది. అహో! అగదియంతయు విషవాయువుపరిపూరితమైయుండుటచేఁ గాఁబోలును జాముల తనముక్కునకు రుమాలు బిగించికొని క్రొవ్వువత్తిదీపము వెలిగించి యంతకుమున్దున్న దీపము నార్పివైచినది. అది విషదీపమైయుండ వచ్చును. ఎంతభయంకరవ్యాపారము! తనకుఁ దెలియకయే కుముదవి మృత్యువుం గవుఁగిలించికొన్నది! (నిరూపించి) అదిగో కిటికీతలుపులను దెఱచివైచుచున్నది.

(తెరలో జామల బిగ్గఱగా)

రెండు !!

"కుముదినీ! నీవునీప్రియుఁడగు నవీనచంద్రునివామాంకమున సుఖంబుండుము,,

దేవే—(విని నిరూపించి) (అసహ్యముతో) ఇస్సీ! ఆ రాక్షసి యతికోమలమగు కుముదిని వక్షమును నిశాతకృపాణముతోఁ బొడిచివైచినది! అయ్యో! దీపముగూడ నాఱిపోయినది. అంతయుఁ గాఱుచీఁకటి! ఇఁక నాలసించినఁ బ్రయోజనములేదు. (వేగముగ శ్రీశచంద్రుని యొద్దకువచ్చును.)

శచీ—(ఉద్విగ్నుఁడై) మామా! ఏమిసమాచారము?

దేవే—మనమిప్పుడు చాలఁగష్టస్థితియందున్నారము. కుముదిని మరణించినది! పాపము దానిహృదయము కృపాణముచేఁ జీల్పఁబడినది.) మీ మేనత్తయు, మనోరమయు నెచ్చటనుండిరో చూడవీలగునా?

శచీ—ఇప్పుడువీలున్నది! ఏమిచేయవలయునో త్వరగాఁజెప్పుము!

దేవే—కుముదిని తనశయనమందిరముననే మరణించినది. ఆరాత్రి చీల్చుటకు ముందే విషముచేఁ జనిపోయినది. కనుక కుముదినిని దీసికొనిపోయి రేవతీ మనోరమలున్న గదియందుంపుఁడు!

శచీ—తరువాత నేమి చేయవలయును?

దేవే—ఆగదియందు దీపమున్నచో నార్పివైచి రేవతీ మనోరమలను కుముదిని పోయిన శయనమందిరమునకు నంపవలయును. వారిరువురను మిగుల జాగరూకులైయుండునట్లు చేయవలయును. త్వరపడుఁడు! తెలిసినదా? జామల యావైపునకు రాఁబోవుచున్నది.

శచీ—జామల మమ్ముఁగలను జూచినచో నేమిచేయవలయును?

దేవే—అది చూడకుండునట్లు చేయుట భారము నాది! నడువుఁడు! శ్రీశచీంద్రా! జడిసికొనక ధైర్యముతోఁ బ్రవర్తింపుము! (నిరూపించి) అదిగో అదివచ్చుచున్నది. దాఁగియుండుఁడు!

(ముగ్గురును స్తంభములమాటున దాఁగియుందురు.)

(జామల వెడలిపోవును.)

దేవే—(పొమ్మని శచీంద్రునకు సంజ్ఞచేయును.) (శచీంద్ర శ్రీశచంద్రులు నిష్క్రమింతురు.)

దేవే—(తనలో) వీరునిర్విఘ్నముగాఁ గార్యపరిసమాప్తి నొందించువఱకును జామల యావైపునకుఁ బోకుండఁ జేయవలయును. ఏమిచేయుదును? (ఆలోచించి) తెలిసినది! ఒక గదిలోనికిఁబోయి తలుపువైచికొందును! జామల భయపడి సాయము కైకొనుటకై దానికొఱకు సభామందిరమునకు వచ్చును

పిదపదానితోఁ గొంత కాలక్షేపము చేసెదఁగాక! ఇంక మునిందు మసిపూసి
కొని నవీనుని ప్రేతమును లేవఁటించి జామల హృదయమును గలంగింపెదఁగాక.
(నిష్క్రమించును.)

## రంగము—శయనగృహము.

[తులసీదాసుఁడును గోవిందప్రసాదసేనుఁడును మరణించినట్లు పడియుందురు]

జామ—(ప్రవేశించి) (తనలో) లోకులకు మరణమనిన నింతభయమేల? ఎవ్వరు మరణించుటకు భయపడుదురో వారు జామల నాశ్రయించినచో నెట్టిభయమును లేకుండ మరణింపఁగలరు! ఆహా! జామలా! సర్వశక్తులును నీసొమ్ములు ఏకాలమందును నెవ్వరును జేయలేని నిగూఢభయంకరకార్యములు నీవవలీలగఁ జేసివైచుచున్నదానవు! కావున నీవంటిబుద్ధిమతి నీవంటిపిశాచి యిఁక బ్రపంచమున నుండఁజాలదు! (పరిక్రమించి మృతులనిర్వురఁజూచి యానందముతో) (పరి కా) ఓహోహో! న్యాయవాదియు వైద్యస్వామియు నా? మీకు శుభమగుగాత (ముక్కులకు రుమాలు బిగించికొని దీపము నార్పివైచి కిటికీలు దెఱచి క్రొవ్వువత్తి వెలిగించి యిరువురను బరిశీలించి నవ్వి, (పరి కా) ఓహో! నాలుగు! (బిగ్గరగా నఱచి నవ్వును.)

నా సౌందర్యము నాసించి నాభోగము నాసించి మీరిరువురును భూలోకము విడిచిపోయితిరి! ఈప్రదర్శనమును దేవేంద్రుఁడే చూడఁగలిగినచో నతఁడు గూడ మిమ్ములను వెదకికొనుచుఁ బోవుచుండెడివాఁడు! ఎప్పటికయినను వాఁడు మిమ్ముఁబట్టుకొనుటకు నరకమునకు రాకపోఁడు లెండు! నాకు శత్రువులును మిత్రులును సమానులే! నామగఁడగు ప్రాణసాహెబు మరణించిన పిదప కేవలము వైరాగ్యము నవలంబించి ప్రేమించి మిత్రులను ద్వేషించి శత్రులను, జంపివైచుచున్నదానను. ఆహాహా! (వికటముగా నవ్వును.)

(తెరలోఁ దలుపువైచిన చప్పుడు)

(విని) (ఆశ్చర్యముతో) ఈచప్పుడేల కలిగినది? నన్నెవరయిన గెంటాడుచున్నారా? (పరిక్రమించి) (తెరవైపునకుఁజూచి) ఏల యీచప్పుడిట్లుగలిగినది? (ఉలిక్కిపడి) జ్ఞానముచే మరణమునొందిన నవీనుఁడు నన్ను గెంటాడు

చుండెనా యేమి? అతఁడు పిశాచమై యుండెనా యేమి? అయిన నేమి? జమల కంటెఁ బిశాచి భయంకర యగునా? అట్టిచో జమలకు భయ మేల? (ధైర్యముతోఁ బరిక్రమించి) (నిరూపించి) ఇదియా? తెలిసినది! నిష్కారణముగా భయం పడితిని! గాలిచేఁ దలుపు గొట్టుకొని ధ్వనించినది. కనుక జమల భయపడరాదు! ఇంతకుమున్న భయ మెట్టిదో జమల యెఱుఁగదు! (తెరలో)

'ఎఱుఁగవు'' (వికృతస్వరముతో) ముమ్మాటికిని వెఱువవు.

(విని) యిది యేమి? మనుష్య భాషణము గాదు పిశాచ భాషణము వినఁబడుచున్నదే! (ఆలోచించి) ఎవరు నీవు?......ఏమియు నుత్తరము రాలేదే! ఆకాశవాణి నన్ను మెచ్చుకొనుచున్నది. (ఆకాశము వైపు జూచి) ఓయీ యాకాశవాణీ! నేను భయ మెఱుఁగ ననుచున్నావా? మంచిది! (తనలో) మైకము చాలవఱకుఁ దగ్గిపోయినది! పోయి మరి రెండు సీసాల సారాయముఁ ద్రావెదఁ గాక!

(నిష్క్రమించును)

రంగము — ఆలోచనామందిరము.

జమల — (కుర్చీపైఁ గూర్చుండి సారాయముఁ ద్రావుచు) నేఁ డేలొకో యెంత ద్రావినను దనివి లేకున్నది! (గంజాయి పీల్చి) ఇంకను మైకము ఎక్కువ యగుట లేదు. (సారాయముఁ ద్రావి) హాయ్ హాయ్! (ఇంతకుమున్న నవీనుఁ డున్న వైపునకుఁ జూచి ఆశ్చర్యముతో) ఏమిది? యితఁ డేమైనాఁడు? చనిపోయెను గదా! చనిపోయినవాఁడు సులల నెక్కడకుఁ బోవును? (ఉలికిపడి) నాకు భయము కలుగుచున్న దేల? (ధైర్యముతో) (తనలో) నవీనుఁ డెక్కడకుఁ బోయియుండును? అతఁడు పిశాచ మగునా? హైన్సు ప్రొఫెసరు డార్వినువంటి విజ్ఞానవతంసులు పరిణామవాదము చేయుచు, కోఁతి మరణించియే మనుష్యుఁ డగునని సిద్ధాంతీకరించిరి గదా! మనుష్యుఁడు మరణించి యే మగును? పిశాచ మే యగునా? అయినచోఁ బిశాచము గూడఁ గనఁబడి తీఱవలయును గదా? కన్నులకుఁ జూడరాని, చెవులకు వినరాని రూపములఁ గనుఁగొను పాశ్చాత్య విద్వాంసులు గూడ మరణించిన మనుష్యుఁ డేమగునో చెప్పరైరి. అహా! వైజ్ఞానిక సిద్ధాంతము! తప్పక పిశాచమే కాఁగలఁడు! ఔషధరసమును నావలెనే యాఘ్రాణించినట్లు నటించి పాఱిపోయినాఁడా? (సారాయము త్రావి జోగుచుండును).

దేవే—(నవీనుని పిశాచమువలె వేషము ధరించి) (సులోచనములు పెట్టుకొని ప్రవేశించి తనలో) ఇప్పటికి శచీంద్ర శ్రీశచంద్రులు తమకార్యమునట్లే కృతార్థులైయుండఁగలరు. కొంతసేపిచట నాకప్రహసనము ప్రదర్శింపవలయును. (జుమలకు వెనుక దూరమున నిల్చియుండును.)

శ్రీశ—(ప్రవేశించి మెల్లగా) మహాశయా!

దేవే—(వెనుకకుఁదిరిగి) శ్రీశా! కార్యము నెఱవేర్చుకొంటిరా?

శ్రీశ—సంపూర్ణముగా నిర్విఘ్నముగా నెఱవేర్చుకొంటిమి.

దేవే—ఇక్కడనొక ప్రహసనము ప్రదర్శింపఁబడును. గావున నవీనుని కళేబరమును నొకచోట (దాచియుంచుఁడు.) మీరును ప్రమత్తులరయియుండుఁడు! రహస్యము దృఢగుప్తము కావలయును.

శ్రీశ—చిత్తము (నిష్క్రమించును.)

జుమ—(కన్నులువిచ్చి) (తనలో) కన్నుమూసినను దెఱచినను నొక్కటేవిధముగ స్వప్నములు వచ్చుచున్నవి. అన్నియుఁ బిశాచములే! ఎన్నఁడునిట్టి భయముఁజెందియుండనైతిని (నవీనచంద్రుఁడు పడియున్న వైపునకుఁ దిలకించి (తనలో) ఇఁకను నవీనుఁడు గనఁబడుటలేదేల? (ఉలిక్కిపడి) అతఁడు మరణింపలేదా? కాదుకాదు! నిశ్చయముగా మరణించినాఁడు! అయిననో నతనిశవమేమైనది? (కుర్చీనుండిలేచి) (పరిక్రమించి) ఎక్కడనుగనఁబడదే ((ప్రకా) నవీనచంద్రా! ఎక్కడనున్నావు?

దేవే—(నవీనుని కంఠస్వరముతో) ప్రియతమా! ఇక్కడనేయున్నాను!

జుమ—(ఉలిక్కిపడి దేవేంద్రునకభిముఖముగానిలిచి పిశాచమునుజూచి నివ్వెఱఁజెంది) ఇదేమివికృతాకారము? ఎవ్వఁడవు నీవు? (తనలో) కన్నులు మూతవడుచున్నవి. ఈచీకటియుఁ బిశాచములాగుననే యున్నది.

దేవే—ప్రియతమా! నేను నవీనచంద్రుఁడను.

జుమ—(భయముచే వణఁకుచు మేజాపైనున్న పిస్తోలుతీసి చేతఁబట్టుకొని) ఎవఁడ వోయీ నీవు?

పిశా—నేను నవీనుని పిశాచమును (వికృతస్వరముతో)

చ॥ నిరుపమ సుందరీమణిని • నిన్ను మనంబలరన్ వరించి, నీ
కరుణకుఁ బాత్రిమాదు నను • కాంక్ష వసించితిఁ గూర్చి రచి త్తవై
వెఱవక నన్నుఁ జంపితి వ • వీను పిశాచమనేను నిన్ను నే
మఱక చరించువాఁడ జగ • మందుఁ బ్రియా! యిఁక సర్వవేళలన్॥ ౧౩

జామ—అయినచోఁ గాంచికొనుము! దురాత్మా! యిఁకఁ బిశాచములఁగూడ వధించెదను ఇదే యారంభము!

పిశా—ఎప్పుడును సంసిద్ధుఁడనైయుందును.

జామ—(పిశాచమును గురిచూచి పిస్తోలు పేల్చును.)

పిశా—(వికృతముగా నవ్వి) ప్రియతమా! యింకను నీకు నాపైఁ గసిపోవలేదా?

జామ—నిన్ను నేనేమియుఁ జేయలేనని తలంచియా నవ్వుచున్నావు? నిన్నిపుడు చంపెదను కాంచికొనుము! జామల యొక్కరో రాలుగుదువా?

పిశా—జామలా! తులసీదాసుఁడును గోవిందుఁడును జచ్చినట్లు నేఁజావలేదు. కనుక నీవు నన్నేమియుఁ జేయఁజాలవు నేను మానవుఁడనైనఁగదా నీవు నన్ను జంపుట!

జామ—అయినచో నీకుఁ జావులేదా?

పిశా—జామలా! ఔషధము వాసనచూపించుటచేఁ జావనే చచ్చితిని ఎన్నిసారులు చావుమనెదవు? ఒకసారి చంపనే చంపితివిగదా! ఇఁక చాలదా?

జామ—నేను నిన్నుఁ జంపితినా? అసత్యము చెప్పకుము!

పిశా—ప్రియా! నిజముగా నన్నుఁ జంపితివి. నీచేతులారఁ బాషధమిచ్చి, నీమనసారఁ జంపితివి. నేను జచ్చితినను సంతసముతో నీవు నవ్వితివే! జామలా!

జామ—అసత్యవర్త్యము నవీనా! ఇదిగో యిప్పుడే చచ్చెదవు! నిజముగాఁ జచ్చెదవు. (పిస్తోలు పేల్చును)

పిశా—(వికృతముగా నవ్వి) ఏది? ఇప్పుడు నీగుత్తియేమైనది?

జామ(క్రోధకంపితస్వరముతో) నాయెదుటనా నీదంభములు? నీవు మొదటఁ జచ్చి నచో నిట్లుబ్రదికియుండఁ జాలవు. చచ్చుటయేది? పిశాచమున కేది?

పిశా—నేనకాలమృత్యువు నోటఁబడితిని అందుచే దారుణమరణము నొందితిని కావునఁ బిశాచమునయితిని జామలా! నీకింకను నమ్మకము గలుగలేదా?

జామ—నీవు నిజముగాఁ బిశాచమవేనా?

పిశా—కాకేమి? మనుష్యుఁడనే యైనయెడల నీపిస్తోలుగుండ్ల కెదురుగా నిలువఁ బడుదునా?

జామ—పిశాచమవా నీవు! కాదుకాదు మొదట నీవు చచ్చినట్లు నటియుండఁగాఁ నిజముగాఁ జచ్చితివనియే విడిచితిని ఇఁక నీవు దప్పించుకొనఁజాలవు.

పిశా—పిచ్చి జామలా! ఈనిశ శార్దూలిలాగునఁ గన్నులఁ గానకున్నావు. కనియు నమ్మలేకున్నావు నేను పిశాచము నగుదునో కానో యింకను పిస్తోలు పేల్చుము! అప్పటికి నీకు సందేహనివృత్తి కాఁగలదు. ఎన్ని సారులు పేల్చెదవో పేల్చుము!

జామ—(భయముతో వణఁకుచు) (తనలో) హా! ఇదియేమి భయంకరపరిణామము ఈపిశాచము నన్నుఁ జంపునాయేమి? అయినను ప్రయత్నించి చూచెదఁ గాక! జామలా! ధైర్యము నీకుఁ బట్టుఁగొమ్మ! (పైకి) ఇదిగో కాల్చెద నుండు! (క్రోధముతో) ఒక్కయడుగైనను గదల్పము!

చ॥ శ్రమపడి వాదముల్ సలిపి, శాస్త్రవిదుల్ వచియింపరే పదా
ర్థములకు లేదు నాశ మని; తత్పరిశోధన లెల్ల బూదిలోఁ
గ్రిమముగఁ గల్పివైచుటకుఁ గాజనియించెఁ బిశాచమా! యిదే
జామల తదీయసంహరణశూరతఁ జూచెదు గాంచికొమ్మటన్ ॥ ౧౭

(నవీనుని రొమ్మునకు గురిపెట్టి పిస్తోలు పేల్చును)

పిశా—(సుస్థిరుండై నిలిచి నవ్వుచు) (తనలో) దీనికి మైకముతోంబాటు ధైర్యము ను వదలుచున్నది. (ప్రకా) జామలా! సంపూర్ణముగ నాశముచేసితివి! వహ్వారే! వహ్వారే! ఏమి నీసంహారణశూరత్వము! బాగుబాగు! ఏదీ యింకొకసారి కాల్చుము! (వికటముగా నవ్వును)

జామ—(విసుంగుదలతోం బిస్తోలు క్రిందంబెట్టి బిగ్గఱగా) పో! పొమ్ము! నీవు నరకమునకుం బొమ్ము! నీవు పిశాచమని నేను నమ్మను.

పిశా—నీవు నమ్మకపోయినంతమాత్రమున నేను పిశాచమును గాకపోను. జామలా! యెదుటనున్న పిశాచమును గనులాఱంజూచియు నేను నమ్మనందువేల?

జామ—నీవు పిశాచమవుకావు. ముమ్మాటికిని గావు. అయినచో నిచ్చటికి రావు.

పిశా—కావు కావని కాకివలె నఱచినం బ్రయోజనములేదు. నీపైగలం శత్రుత్వముం దీర్చుకొనుటకే వచ్చితిని.

జామ—ఏమిచేసెదవు?

పిశా—ఇప్పుడు నీవు నన్నుంజూచి భయపడుటలేదా? నిన్ను భయపెట్టి నాశము చేయుటకే వచ్చితిని.

జామ—లేదు లేదు ముమ్మాటికిని భయపడను.

పిశా—ఏల భయపడవు? కఠినములై గాలములవలె వాండియయిన నా నఖములతో నీహృదయకోశముల జీల్చి నీనెత్తురు ద్రావినంగాని భయంపడవు. జామలా! హాహా అన్నంతమాత్రమునం బిశాచ మెగిరిపోవు ననుకొంటివా?

జామ—ఏమంటివి? నేనే యొక పిశాచమును. పిశాచమును పిశాచ మేమిచేయంగలదు? నాశరీరముపై నీవు చేయిరైన వేయంజాలవు. తెలిసినదా? (తనలో) ఈసమయమున ధైర్యమును గనంబఱుపకుంటినేని నిజముగా నీపిశాచము నన్నింతగతికిం దీసికొని రాకమానదు.

పిశా—ఓహో! నీవుగూడం బిశాచమవేనా? అయినచో నింతకుందరివగుటేల? జామలా! క్రూరకృత్యములలో నీవు పిశాచివంటిదానవగుదువు. కాని నిజముగాం బిశాచమవుకావుసుమీ! నీవు మానవివి! జాగ్రత్తగానుండుము!

జూమ—నీవు భద్రముగానుండుము! ఓరి మదాంధుఁడా!

చ॥ నిలువుము రోరి నీచయుట • నీవు మనుష్యుఁడవైన పిశాచపుం
గలిమిని బుట్టినాఁడవో, యఖండ పరాక్రమము మెప్ప నేరికిం
దలఁకని రేవతీ పతివో • తత్పరతం గనుడుగ్ర శతఘ్నికా
గుళికల విస్ఫులింగములు • గుండియలం జొఱఁబాఱి ప్రేల్చెదన్॥ ౧౮

పిశా—(వికవిక నవ్వి) నేను పిశాచమనని చెప్పుకొనుచుండఁగా సందేహింప నేల? నీయిచ్చవచ్చినన్ని సారులు పేల్చుకొనుము. జూమల! నిన్నుఁ బ్రేమించితిని నీచేతవధింపబడితిని నిన్ను విడువఁజాలక నీపైఁగల మోహముఁ దీర్చుకొనుటకు వచ్చితిని నీవు వద్దన్నను నిన్ను నేను విడువను జంటఁగలు తేనెపెరకడ కొరులరానీయవు. అయినను భల్లూకము వానినాక్రమించికొని తేనెపె అను నైకొనఁగలదుసుమీ! ఏల యీద్వేషము? ఏల యీదురహంకారము?

జూమ—(క్రోధముతో) సరే! పలుమాటలేల? ఇదిగో కాఁచికొనుము! (పిశాచము గుండెలను గురిచూచి పిస్తోలు పేల్చును) ఇదిగో చచ్చితివి!

పిశా—(కదలకయే) ఇదిగో బ్రదికితిని. (వికటముగా నవ్వును) జూమలా! నీప్రాణములు కడముట్టఁబోవుటచేతనే భయంకరపిశాచము నెదుర్కొనుచున్నావు జాగ్రత్త! జాగ్రత్త! ఏల యీకపటధైర్యము?

జూమ—(క్రోధముతో) ఓకౄరపిశాచమా! యిఁక నీవిచ్చటినుండి తొలఁగిపొమ్ము. జూమల సాధారణురాలు కాదు.

పిశా—కాకేమి? నీయసాధారణశక్తులు మానవులనే మోసగింపును గాని, యెప్పుడును నిన్ను వెన్నాడుచున్న పిశాచమునొద్ద నీమంత్రములు బనిసేయఁజాలవు! తెలిసినదా?

జూమ—పని సేయునో చేయవో మాదెబ్బఁ గాచికొనుము (తనలో) నిజముగా నిట్టి పిశాచ సందర్శనము నాకెన్నఁడును గలుగలేదు. నాగుండియలు తడఁబడుచున్నవి. ఈపిశాచము వదలునట్లు లేదు. ఏమిజేయుదును? వీఁడిదిక్కిక బాహాయుద్ధమునకు వచ్చునా? (ఆలోచించి) వలదు వలదు అది నిరూపణములో

మాయమై నన్నాక్రమించికొని నిశ్చయముగాఁ బ్రాణముఁదీయఁగలదు. ఏమియుపాయము? దీనిచేతిలోనే నాకు మరణము విధింపఁబడినదా? హా! యింతకంటె నన్యాయమేమున్నది? అయినను సాధ్యమయినంత ప్రయత్నముతోఁ బిస్తోలుయుద్ధమే చేసెదఁగాక! (ప్రకా) ఓక్రూర పిశాచమా! ఈ దెబ్బతప్పించుకొని బ్రదికినప్పుడు నీవు పిశాచమవనియే నమ్మెదను.

పిశా—అట్లయిన నాకు మిక్కిలియు సంతోషము! జూమలా! యించుక జాగ్రత్తగా నుండి కాల్చుము!

జూమ—అట్లనుచుంటివేమి? నావిూఁది దయచేతనా?

పిశా—నీయందు నాకు దయ యుండునా? నీమేలునకే. నీసంశయము నివారించుటకే చెప్పుచుంటిని.

జూమ—అట్లయిన నదియేదియో నించుక చెప్పుము.

పిశా—నేను మూఁడంకెలు లెక్కపెట్టెదను. మూఁడు అని నేనుచ్చరించినపుడు పిస్తోలు పేల్చుము!

జూమ—చెప్పుము.

పిశా—ఒకటి—

జూమ—(పిస్తోలు సరిగా పట్టుకొనును.)

పిశా—రెండు—

జూమ—(పిశాచము గుండెకు గురిచేసి చూచుకొనును.)

పిశా—మూఁడు!

జూమ—ఇదిగో చచ్చితివి! (పిస్తోలు ప్రేల్చును.)

పిశా—(వికటముగా నవ్వి) ఓహోహో! జూమలా పిశాచిగారి శతఘ్నిప్రయోగమేమైనది? నేను బ్రతికియేయున్నాఁడను. ఇప్పటికైన నాపైఁగల సందియము తీఱెఁగదా?

పిశాచ జన్మమెత్తినందులకు ఫలము నీయుష్ణశోణితమును దనివారఁగ్రోలుటయే. తులసీదాసుఁడును, గోవిందప్రసాదసేనుఁడును నావలెఁ బిశాచములయిరా?

జుమ— వారుకారు! ఏలయన, వారు నిద్రించుచునే మరణించిరి.

పిశా— కావుననే వారు పిశాచజన్మము నెత్తరైరి. నేనో చూచుచుఁజూచుచు విషమని తెలిసికొనుచునే ప్రాణములు విడిచితిని. ఇప్పుడు నేను పిశాచమయితిని తెలిసినదా? (వికటముగా నవ్వి) జుమలా! నీవును జావకపోవవు. నీవును నావలెనే పిపాసల సంతప్తవై వ్రేగకపోవవు. తెలిసినదా?

జుమ— (భయముచేఁ గన్నులు మూసికొని తనలో) నేఁడీపిశాచము చేతులలో నాకు మరణము తప్పదు. హా! దీనిబారినుండి తప్పించుకొను టెట్లు? ఇంకను సాహసము చేయుదునా? వలదు వలదు. అయినను ధైర్యమవలంబింతును. (ప్రకా) ఓపిశాచమా! (కన్నులు తెఱచి మఱల మూసికొని తనలో) కన్నులు తెఱచుటకును వీలుగాకున్నది. అంతయు భయము. అంతయుఁ బిశాచమయము. హా! హా! జుమలా! మానవుల కెవ్వరికిని భయపడని నీవు పిశాచములకు భయపడకతప్పదు. (ప్రకా) పిశాచమవు నీవు కావు! నీవలన నాకుభయ మూకంతయును లేదు.

పిశా— నీవెవ్వరివలనను భయపడవు గాఁబోలును. (నవ్వును)

జుమ— ఒక్కనివలననే నాకు భయము!

పిశా— వాఁడును పిశాచమేనా? (నవ్వును)

జుమ— కాఁడు మానవమాత్రుఁడే దేవేంద్రవిజయమిత్రుఁడు వానివలననే నాకు భయము!

పిశా— నేను పిశాచమను దేవేంద్రుఁడాసుపత్రిలో నుండఁగలడు నేను బ్రదికియున్నప్పుడే నాకీసంగతిఁ జెప్పియుంటివిగదా! (వికటముగా నవ్వును)

జుమ— (తనలో) ఏమిచేయుదును? చూడలేను కన్నులు మూతలువడుచున్నవి. ఒడలు మంచుచెమ్మటలు పోయుచున్నవి. ప్రపంచమంతయుఁ దిరిగిపోవుచున్నగ

హా! హా! (చేతిలోని పిస్తోలు విడిచి) నన్ను రక్షించు దిక్కెవరు? (మూర్ఛిల్లును.)

పిశా—(నిష్క్రమించును)

(శచీంద్రుఁడును శ్రీశచంద్రుఁడును బ్రవేశింతురు)

శచీ—(మెల్లగా) ఈరాకసిని జూచితివా?

శ్రీశ—చూడకేమి? తులసీదాసుని యింటనే యుంచుక చూచితిని.

శచీ—ఇది యింకఁ ద్వరలోనే మరణింపఁగలదు!

దేవే—(ప్రవేశించి) శచీంద్రా! యిప్పుడేమి చేయుదువు?

శచీ—మామా! యిప్పుడీరాకాసి కాలుచేతులకు బలమగు సంకెలలు దగిలింతము! కానిచో నీరాక్షసి మఱలఁ బట్టువడదు.

శ్రీశ—మిత్తరుబాబు అనుజ్ఞ యిచ్చినచో నిమిషములోఁ జేసివైచెదను

దేవే—వలదు వలదు ఇది మనచేతిలోనిదే. తత్క్షణమే నవీనుని మృతకళేబరము నిటకుఁదెచ్చి యథాపూర్వముగాఁ బెట్టుఁడు నవీనుని యెముకలన్నియు నలంకరించి తీసికొనిరండు! నేను రేవతీమనోరమలను జూచి వచ్చెదను పోవుదము (మువ్వురును నిష్క్రమింతురు)

[శచీంద్రుఁడును శ్రీశచంద్రుఁడును నవీనుని మృతకళేబరముఁదెచ్చి యథాపూర్వముగానుంచి దానిపై వస్త్రమును గప్పెదరు]

శ్రీశ—శచీంద్రా! నేను మిత్తరుబాబు నొద్దనుండెదను.

శచీ—ముసల్మానుఁడనైయున్నాఁడనుగాన నేనుగూడఁ గొంత దీనితో సంభాషింతును.

శ్రీశ—నేను చూచుచునేయుందునులే (నిష్క్రమి)

శచీ—(ఒకప్రక్క నిలుచఁబడియుండును.)

చుసమతునునటె! వచ్చితివటె! పిశాచికి నిద్రయెక్కడిది? శార్దూలి! నిశీథసమయమున నిద్రపట్టునా? మాగణమేనిద్ర.

జూమ—నీవు తురుష్కుఁడవుగావా?

శచీ—కాను నేను హిందువుఁడను.

జూమ—అట్లయిన నీవు పత్తేదారుఁడవేనా?

శచీ—అవును.

జూమ—దేవేంద్రవిజయుఁడవా? మఱియొకఁడవా?

శచీ—మఱియొకఁడను.

జూమ—(పిస్తోలుఁగైకొని గుఱిచూచి క్రోధముతో) దురాత్మ!

ఉ॥ అచ్చటినుండి యొక్కయడుఁగైనఁ గదల్పకు మోరిసీచ! నీ
వుచ్చె శతఘ్నిగోళమున భూమిపయిం బొరలంగ;

(పేల్చును.)

శచీ—(కదలక నిల్చి నవ్వుచు) శభాసురే!

మెచ్చితి నీప్రయోగము; నిజేమనములోపల నిన్నుఁబట్టి నే
నచ్చెఱసాలనైచెద; నహంకృతి సర్వమడంచి వైచెదన్॥ ౨౦

జూమ—దురాత్మ! నన్నుఁబట్టికొనిపోయెదనంటివా? (కత్తి చేతందుకొని తనలో) పిస్తోలు గ్రహచారవశమున నేమియుఁ బనిసేయుటలేదు! ఇఁక వీని నీకృపాణముచే ఖండించి యొండైనఁ జాటిపోయెదను. ఇక్కడనే సారంగముకూడ నున్నదిగదా. ఇందుఁ జొఱఁబడితినేని నన్నెవ్వఁడును బట్టుకొనఁజాలఁడు ఈకృపాణముచేతనే దేవేంద్రుఁడు ప్రాణావశిష్టుఁడుగఁ జేయఁబడినాఁడు దీనిచేతనే వీనినిగూడఁ జంపెదంగాక. (తెరవైపునకు పెద్దదిగా రెండడుగులు పరిక్రమించి పరికించి) ఓరీ! ఏమంటివి? నన్నుఁ బట్టికొనిపోయెదనంటివా?

శచీ—అవును. నీవిక్కడినుండి తప్పించుకొనినప్పుడు జూచెదనులే.

జూమ—మాటలు తిన్నఁగా రానిమ్ము. నేనెవరో యెఱుఁగుదువా?

శచీ—నీవు ఫూలుసాహేబుగారి యంతఃపురకాంతవు వారి శిష్యురాలవును. వారి యుంపుడుకత్తెవును.

జూమ—అట్లే పట్టుకొనుము. ఆ మొఱ్ఱకుక్కను దీర్చుకొమ్ము.

శచీ—జూమలా! నీటక్కరితనము నాయొద్దనా? పట్టుకొనకమానుదునా?

జూమ—పట్టుకొను టెందుకు? నీకృపాణముచే నన్నుఁ జీల్చివైవరాదా?

శచీ—ఇప్పుడు చీల్పను.

జూమ—ఎప్పుడనుకొంటివి?

శచీ—స్త్రీహత్య చేయుటలో నీవును నీయింటిమగఁడు ఫూలుసాహేబును మిన్నలు. మేము స్త్రీహత్య చేయుదుమా? పాపాత్మురాలా! వదలకుము.

జూమ—పాపాత్ముఁడా! నీవు మితిమీఱి వదరుచున్నావు. జాగ్రత్త. మేమే స్త్రీని జంపితిమి?

శచీ—ఓహోహో! దాఁచుటకూడనా? జానకీబోసుగారి తనయను రోహిణిని. తమిజాద్దీను పరిచారికను కుముదినిని ఎన్నియని చెప్పఁగుదును?

జూమ—అట్లయినచో నన్నుఁ బట్టుకొనుము.

శచీ—నేను విడువను. కాని ఒక్క సంగతి యడిగెదను.

జూమ—ఏమిది?

శచీ—నీయొద్ద నొక కృపాణమే నా? మఱి యేయాయుధమైనఁ గలదా?

జూమ—ఏమియును లేదు. నన్నుఁబట్టుకొనుట నిశ్చయమే యయినయెడల నేనిక్కడినుండి యొక్కయడుగైనఁ గదల్పను. ఏదీ చూతము రమ్ము! దేవేంద్రవిజయా! నాయెదుటనా నీసాహసము?

శచీ—నేను దేవేంద్రవిజయుండను గావున తొలుత నే చెప్పితిని.

జుమ—కాదు. నీవు దేవేంద్రవిజయుఁడవే.

దేవే—(ప్రవేశించి జుమల వెనుక నిల్చి) నేనే దేవేంద్రవిజయుఁడను.

జుమ—(వెనుదిరిగి చూచి భయముతో) హా!...హా!...దేవేంద్ర...విజయుఁడు!

దేవే—అవును. నేను దేవేంద్రుఁడనే.

జుమ—(తనలో) ఇఁక భయపడనేటికి? ఎట్లయినను వీని బారినుండి తప్పించుకొనవలయును (పైకి) ఇప్పుడు నీవు వచ్చిన పనియేమి?

దేవే—నిన్ను బంధించి కొనిపోయి కారాగారమునఁ బడవైచెదను.

జుమ—నే నేమి చేసితినని బంధించెదవు?

దేవే—ఖూనీలు చేసితివని బంధించెదను.

జుమ—నేను ఖూనీలు చేయుచుండ నెవ్వరు చూచిరి?

దేవే—నేను చూచితిని. నీపాపఫలంబు పండలయి నా చేతిలోఁ బడితివి పలాయోద్యాన మందిరమున నన్ను జూచియుండివి. అప్పటి దేవేంద్రుఁడను గాను నీపాపములకుఁ దగు ప్రాయశ్చిత్తము కారాగారమునఁ జేరఁగాని పూర్తిగాదు.

జుమ—ఇప్పుడు నన్నేమి చేయమందువు?

దేవే—నీవు మానుబ్బును బంధించితివి. పాపము నోరెఱుఁగనిపట్టి. వాఁడెక్కడ నున్నాడో చెప్పుము

జుమ—ఎక్కడ నుండిన నేమి? వాఁడు నీకు దొరకఁడు బ్రతికి యేయున్నాఁడు.

దేవే—ఎక్కడ నున్నాడో చెప్పుము.

జుమ—నాకంత యవసరము కాదు. అనవసర ప్రసంగము చేయకుము. నీ భార్యగతి చూచుకోవవలదా?

దేవే—నాకంత యావశ్యకము లేదు.

జుమ—ఎందుచేత!

దేవే—ఆమె బ్రతికియేయున్నది.

జుమ—ఆమె చచ్చియున్నది. యెట్లెఱుంగవూ! యెట్లీపలుకులు పలికెదవు.

దేవే—జుమలా! సారాయిప్రకైఫు యింకను విడవలేదా?

జుమ—సత్యమే చెప్పుచున్నాను.

దేవే—నేనును నిశ్చయమే చెప్పుచున్నాను. (తెరవంక జూచి) రేవతీ! యిటురమ్ము

రేవ—(ప్రవేశించి) నాథా! యీతప్పుడుముండయొద్దకు నన్నేలరమ్మంటిరి?

జుమ—(రేవతినిజూచి) హా! వచ్చినదే మలబ్రదికినది. దేవేంద్రా! మనోరమ చనిపోయినదిగదా ఆదికూడ బ్రతికినదా?

దేవే—సందియమేల? ఆమెమనోరమయని యొప్పుకొందువా?

జుమ—ఒప్పుకొనకున్న లాభములేదుగదా! కుముదినికూడ జనిపోయినది. అది గూడ బ్రదికినదా?

దేవే—కుముదినియు, తులసీదాసె నవీనచంద్ర గోవిందప్రసాదులును మరణించిరి.

జుమ—నీతండ్రులను జంపుకొని నీవారిని బ్రదికించుకొంటిరి.

దేవే—వాతండ్రులను నీవేచంపితివి.

జుమ—నే జంపితినని నీకెవ్వరు చెప్పిరి?

దేవే—ఎవ్వరా? నేనుచూచితిని. నేనే చెప్పుచున్నాను.

జుమ—నీసాక్ష్యము నేనంగీకరింపను.

దేవే—నీ వెవ్వరిసాక్ష్యము నంగీకరింపవు.

జుమ—ఇప్పుడు నన్ను బంధించి చెరసాలకు దోడ్కొనిపోరాదవా? (తనలో) ఇంక బారిపోవలయును. తరువాత గసితీర్చుకొందును. (తెరయొద్దకు జేరి· ప్రిరా) ఏమి! నీప్రియత్నమున్నట్లా—

దేవే—(అర్థోక్తియందే) ఎప్పుడును గాదు.

జామ—అయినఁ బట్టుకొనుము.

దేవే—విడిచెదననుకొంటివా? బెదరింపులేల?

జామ—పట్టుకొనఁజాలవు (నిష్క్రమించును.)

దేవే—(ఆశ్చర్యముతో) ఎంత మోసము జరిగినది! శచీంద్రా! యిక్కడ భూగర్భమున్నట్లు ముందుగ నించుకంతయుఁ దెలిసికొనఁజాలకపోయితిమి. తెలిసినచో నది మూర్ఛిల్లినప్పుడే బంధించియుందును.

శచీ—నేను బంధించెదనని మొట్టమొదటనే చెప్పితినిగాదా! ఇంతకుఁ జేతికిఁజిక్కినపిట్ట యెగిరిపోయినది. మరల నెంతకాలమునకన్ని క్రిములకు దొరకునో.

దేవే—చింతింపకుము. అది త్వరలోనే దొరకఁగలదు. శచీంద్రా! నీవు రేవతిమనోరమలను జాగ్రత్తగఁ గాపాడుచుండుము. శ్రీశచంద్రా! యిటురమ్ము!

శ్రీశ—(ప్రవేశించి) ఏమి చేయుమందురు?

దేవే—నేనీభూగర్భమునఁ బ్రవేశించి దాని వెనువెంట వచ్చెదను. నీవు తక్షణమే పోయి గంగానదియొడ్డునఁ గాఁచికొనియుండుము. అక్కడికి జామలవచ్చెనేని, నీపిస్తోలుచూపి భయపెట్టి దానియొద్దనున్న కత్తిని లాగికొనుము. అది యీఁదుకపోయినయెడల-నదిసాహసముతో నీపైకి వచ్చినయెడల-ముందువెనుక లాలోచింపక పిస్తోలు పేల్చి చంపుము! అది చచ్చినను మనకు మేలే-బ్రతికిచిక్కినను మనకు మేలే-ఒకయరగంటవఱకును దానిని నిల్పినచో మఱియు మంచిది. నేను నక్కడికే వచ్చెదను. పొమ్ము! అలసింపకుము.

శ్రీశ—చిత్తము! (నిష్క్రి)

దేవే—శచీంద్రా! జాగ్రత్తగనుండుము! (జామలపోయిన దిక్కునకు నిష్క్రి)

రేవ—శచీంద్రా! అమాయలమాతినుండ దెట్లు తప్పించుకొనిపోయినదోయి?

శచీ—అత్తా! ఇక్కడనె సొరంగమునఁ బడిపోయినది. అది యిఁకదొరకదు మనమిఁక నింటికిఁబోవుదము రమ్ము!

(ఇరువురును నిష్క్రమింతురు)

శిశి—(నిద్ర కన్నులు దెఱచి) మహాశయా! మనమిప్పు డెచ్చటనున్నారము?

దేవే—గంగాతీరమున నున్నారము. దీనికి జిక్కిపోయితి వేమి? జాగ్రత్తగఁ జరింపుమని చెప్పియుంటినిగదా!

శిశి—నేను జాగరూకుఁడనై యేవచ్చుచుంటిని. (నిలువఁబడి) అట్లు వచ్చుచుండఁగా నేపొదమాటుననో డాగియుండి యారాకాసి వెనుకపాటున నాతలపై బలముగ గ్రుద్దినది. తెలివిదప్పి పడిపోయితిని. నేను మేలుకొనవచ్చిచూడఁగా నంధకారమున గంగానదీజలముల నాపాపాత్మురాలు నన్ను బుటకలు వేయించుచున్నది. బాబూ! మీరేరాకున్నచో నీపాటికి నన్నది చంపియుండెడిది.

దేవే—ఇంతకును భగవంతుఁడు మనలఁ గరుణించుచున్నాఁడు. ఇఁక నానందకుటీరమునకుఁబోయి మనవారిం గలిసికొందము గాక (పరిక్రమించి) ఆపాపాత్మురాలి దర్శన స్పర్శనములచే నపవిత్రులమైన మనయిరువురము గంగానదీస్నానముచేఁబునీతులమైతిమి. ఆహా! ఆనందమున నానందము!

(ఇరువురును నిష్క్రమింతురు.)



రంగము—ఆనందకుటీరము.

(ప్రవేశము—(దేవేంద్రుఁడును శిశిరచంద్రుఁడును)

శిశి—ఆహా! అత్యంతసుందరమగు నానందకుటీరమునకువచ్చితిమి. మహాశయా! ఇట్టి సుందరమగు సౌధము నెన్నఁడును జూడలేదు. పుష్పకవిమానము లాగున నిది మిగుల సుందరముగనున్నది.

దేవే—శిశిరా! హిమాలయగుహాంతరాళముంబోలి యీమహాసౌధాంతర్భాగమునఁ జేరి రెండు శార్దూలములు నేఁటికి దఱుమఁబడిపోయినవి! ఒకటెయిటనే మరణించినది. రెండవది పలాయితమయినది. అదియును నీలోకము విడచుటవలన నీసౌధావతంసమున కానందమందిరత్వము సిద్ధింపదు.

శ్రీశ—(నవ్వి) మనుజుల నెప్పుడెప్పుడి యిపటఁజేరునో యొకరికెఱుక? ఆంధ్రరాష్ట్రములో సాహసముగలవారుందురుగాని యీజాతులవంటివారుండరు. అబ్బా! దీనియొక్కలీలలో నెంతబలమున్నది! వీరు పిశాచవేషములో జనులను భయపెట్టిరి. అయినను వది సాహసమునకు తెనుదీయలేదు.

దేవే—నేనును నెందఱినో చూచితిని. ఇట్టి మాయావిని యెప్పుడును నాకుఁదటస్థింపలేదు. ఆచంద్రతారార్కమును నపకీర్తి యీజాతులకే రాదగియున్నది.

శ్రీశ—తొలుతనే వన్నింతటి ఘోర వంఘటన సంకటములఁ జొఱఁబెట్టిరి. అయినను మీవంటి నిరూపకాగ్రగణ్యుని యాశ్రయముండినచో శ్రీశచంద్రుని కాంతయుఁ గొఱఁతగలుగదు.

(కచేరీద్వారముఁ రేవతీమనోరమలు ప్రవేశింతురు)

దేవే—ప్రియసఖీ! రేవతీ! యిటువచ్చితి రేమి!

రేవ—ఈ దయ్యాలకొంపలో నొక్క నిమేషమయిన నుండలేను. కనుక నేయిటు వచ్చితిమి.

మనో—(ఆనందముతో) తండ్రీ! దిక్కుమాలిన యీమనోరమ మీకు నమస్కరించుచున్నది. (సాష్టాంగపడును)

దేవే—అమ్మా! సౌభాగ్యవతి వగుము! మనోరమా! తెమ్మ! ఏల వన్నింత గౌరవించెదవు?

మనో—(లేచి నిలువబడి చేతులుజోడించి) తండ్రీ! యేలగౌరవింపకుందును?

చ॥ అలఘురహస్యగర్భిత మ ♦ హావిపదంబుధి నీఁదరాక నీ
లలిత పదాబ్జనౌకఁ బసి ♦ లాబుగఁ జేరి తరించితిన్: శుభం
బలరెడు నీను సన్నిధి న ♦ యంబున నుండినఁజాలుఁగాక! మూ
ఖులనిట నెన్న నేఁటికి? కిది ♦ గో మఱి మీకునమస్కరించెదన్॥

మూఁడు వత్సరములనాఁడే నీచరణసాన్నిధ్యముఁ జేరియున్నచో నిన్నాళ్లిట్టి యిక్కట్టులు ప్రాప్తింపకుండెడివి. దీనావనా! నాసంపదలు నాకు లభవించినవి. నాశత్రువులు నశించిపోయిరి. ఇఁక నాకుఁగావలసినదేది.

దేవే—అట్లనకుము!

మ॥ జామలా రాత్రిసి చచ్చునంతకును జంతుప్రీతిగా నిద్రయే
నిముసంబున్ లభియింప; దిల్లలుకఁగా నే పండువౌనా? మదీ
యమనశ్శల్యముఁబోలె నున్నదది; హా త్యల్ దానిచేతల్; మనో
రమ! భీతిల్లకుమమ్మ! యీశ్వరుఁడు భద్రంబుల్ కడుంగూర్చెడున్

మనో—(చకితరాలై) అట్లను చుంటిరేమి?

శ్రీశ—అక్కా! ఆ రాత్రి మాకుఁ జిక్కక పారిపోయినది!

మనో—మీయిరువురకును జిక్కకపోయినదా? యేమయిపోయినది?

శ్రీశ—(నవ్వి) యేమైనదా? దానిని వెదకుకొనుచు నేంబోయితిని. మాకొలఁకది డొంకలచాటున దాగికొనియుండి నేఁగనఁబడినంతనే యెత్తికొనిపోయి పడవపైఁగూర్చుంటి నన్ను మునకలు వేయింప మొదలు పెట్టినది.

రేవ—పాపము! పసివాఁడవు. నీవేమిచేయుదువు? అగడుపుఁదనపుముండయేగదా యిమ్మల్ని తిప్పలు పెట్టినది?

మనో—(దేవేంద్రునిజూపి) ఆర్తశరణ్యుఁడగు నీమహానుభావుఁడు నన్నుఁదప్పించి యుండెనుగాఁబోలును ఎంతయాపద ప్రాప్తించినది!

దేవే—శ్రీశచంద్రుని బంపక శచీంద్రునే పంపినచో నది మనకు జిక్కియుండెడిది

శచీ—మామా! దానిపన్నుగడ లెవ్వరికిఁ దెలియును? అది సారంగము గుండఁజారి పోవునని మనమెఱుంగుదుమా?

మనో—(స్మృతినభినయించి) ఆసారంగముసంగతి మొదటనే నేను మీకుఁ జెప్పి యుండవలసినది. నేనయద్దానిని బూడ్పించితిని. ఆదొంగముండ మఱలఁ దప్పించుకొన్నది గాఁబోలును.

దేవే—అట్లయిన నీమందిరమునగల యన్నిరహస్యభాగములును నీవెఱుంగుదువా?

మనో—అయ్యో తండ్రీ! తెలియఁగ లేమి?

దేవే—అయినచో మనము సుబ్బును వెదుకవలయును. శీఘ్రా! నీవును నేనును మనోరమయుం బోయి ఆనందపుటీరమంతయు వెదుకవలయును.

(ముగ్గురునిష్క్రమింతురు)

దేవే—అబ్బాయీ! మీమామగారన్నట్లు జామల దొరకునంతవరకును నాకు నిద్రయుండదు. ఏరాత్రి నేమాయగావచ్చి నన్నుఁజంపునోయని నాకుదిగులు పుట్టుచున్నది.

శచీ—ఇఁక దిగులుపడవలదు. అది కొలఁది కాలముననే పట్టువడఁగలదు. ఏఁడు సంవత్సరములనుండియు దీనిపాలఁబడి కష్టపడఁజాలక మామయును నేనును, బడిన శ్రమలకు మితి లేదు. నేటికిఁ బాపము బ్రద్దలయి మామచేసినట్లు పరాభవింపబడిపోయినది.

రేవ—అనల్వురు నెట్లు చనిపోయియుందురు?

శచీ—ఎట్లా? విషముచేఁ జంపఁబడిరి.

రేవ—మమ్ముల నది యేలచంపలేదు?

శచీ—మీరు శాత్రవులతో నుండఁగనే మిమ్ములను జిత్రవధచేయవలయునను కొన్నది. అది కనుపెట్టి మామ నాదిని పోఁకపోటికిఁ దీసికొనిపోయెను. మేము మిమ్ములను దప్పించితిమి. (తనలో) ఆహా! అదృష్టదేవత నన్నుప లాలించుచున్నట్లున్నది.

సీ॥ కన్నులార నాకల్కిఁ ♦ గనవైతి నెమ్మని
మెఱుఁగులు గడుమిఱు ♦ మిట్లుగొలుపఁ
జేయార నిన చ్చెల్వ ♦ చిగురుఁగైదోయిఁబ
ట్టక పోతి బుల్కలి ♦ ట్టలముగాఁగ
మనసారఁ గౌఁగిలిం ♦ పఁగనైతి నడరుచే
నమ్ముగ్ధయుఱచునో ♦ యని తలంచి
చెవులార విననైతిఁ ♦ జెలువమిన్న మనోజ్ఞ
కలనాదభరితంపుఁ ♦ బలుకుగములు

తే॥ వెలఁది నాపదనుండి త ♦ ప్పించునపుడు
సంకుచితచిత్తమున లజ్జ ♦ యంకురింప
మఱియు నోరూఁబల్కఁ జరిం ♦ పకయపోతి
నీరమణి చిత్తమెవరిపైఁ జేరెనొక్కొ॥ ౨౮

మ॥ తరుణీరత్నములెల్లఁ దల్లులని డెం ♦ దంబందు భావించి లి
స్త్రరభక్తిఁ గొలుతుఁ; మనోరమను మాత్రింబేరు కూలంకషో
ద్ధుహార్దంబునఁ జూచుచుంటి; నిదియే ♦ దో దైవచిత్రింబగుఁ
బరసీజాసన యొట్లునఁ దలఁచునో ♦ స్వామీ! కటాక్షింపవే॥ ౨౯

పౌరుష మునకు దైవసాహాయ్యమువలయును. కానిమ్ము ఏమికానున్నదోకదా (ఆకసముఁజూచి) (పరికించి) అహో! వరిభాతమగుచున్నది.

సీ॥ మందాకినీ సరి ♦ న్మహనీయసవిలాస
గమ చిత్రసైకత ♦ కలనయునఁగ
మిత్రభావన సము ♦ న్మిషదహస్సుందరీ
గాఢానురాగరా ♦ గంబనంగ
నిజదైన్యసంపాది ♦ నీరజాస్త్రాగమా
కులనిశాభామినీ ♦ చలనమనఁగ
వికసదంబుజవన ♦ ముకుల నిర్గతరజో
రమణీయలిప్త చి ♦ త్రింబనంగ

తే॥ నవియె తొలిసంజకెంజాయ ♦ లాకసమున
సుజనహృదయంగమంబులై ♦ సొంపుఁగూర్చె
జారచోరుల హృదయముల్ ♦ సంతపించె
ననగఁ జుక్కలు వెలువెల ♦ నై యడంగె॥ ౩౦

కీర్తి—(ప్రవేశించి) శచీంద్రబాబూ! విరహవేదనలోఁబడి కొట్టుకొనుచున్నట్లున్నావు.

శచీ—(తనలో) బాలుఁడయ్యును వీఁడు బహుకుశాగ్రబుద్ధి. ఆవులించినఁ బేవులు. లెక్కపెట్టఁగలఁడు! వీఁడు [illegible] చున్నాఁ

(పరికించి) ఏమో! యీపరిభ్రాంతరమణీయ ప్రకృతి వాచ్యాపునకశ్లో కవబడు చున్నది.

రేవ—శ్రీశచంద్రరాయా! నీవుమంచివాఁడవు. సుబ్బుసంగతియేమైన దెలిసినదా!

శ్రీశ—మనోరమ మందిరమునందలి యంతర్భాగము లన్నింటిని మాకుఁ జూపినది. ఒక నిగూఢమగు మందిరమున నిస్త్రాణుఁడై బద్ధుఁడైయున్నాఁడు పాపము మొన్నటి సాయంకాలమున మీరు పెట్టితిరిదియే కాని మఱల నన్న మెఱుఁగఁడు. చిక్కి స్మృతిఁదక్కియున్నాఁడు వివర్ణుఁడై బంధింపఁబడి దిక్కులేక యందుబడియున్నాఁడు. మా పుణ్యవశమున నతఁడు ప్రాణములతో నారికి నాఁడు. ఆవృత్తాంతము మీకుఁ దెల్పుటకే యిటవచ్చితిని,

రేవ—పాపమువాని కెంతయాపదఘటిల్లినది. వానినిగుమారునివలెఁ బోషించుచున్న దాననువాఁడింకను రాలేదేమి?

శచీ—మామవానినిదోడ్తెచ్చుచున్నారమ్మ అదృష్టవశమునసందఱమును సుఖులమైతిమి

శ్రీశ—అమ్మా! నేనుమాత్రముమీకుఁ గుమారునివలెఁ బోషింపఁదగనా? వాఁడును నేనును, నిరువురు కుమారులము.

(మనోరమయును సుబ్బును దేవేంద్రుఁడును బ్రవేశింతురు)

రేవ—(కంటఁదడిపెట్టుకొని) సుబ్బూ! యిటురమ్ము.

సుబ్బ—(రేవతికి నమస్కరించును) అమ్మా! మీ రేమైపోయ్యారో మాశిరమ్మని శచీంద్రబాబువద్దకు యీడకొచ్చితిని. ఆరాక్షసిముండ నన్నుఁబట్టుకొని దాఁచేసింది. మొన్నరాత్రి మనింటను, ఈరాత్రి యీయింటను నాకుఁ గట్టాలు తప్పినాయిగావు. ఇంతకీ మీరు సుకంగావున్నారు. నాక దేసాలును

దేవే—శచీంద్రా! అదృష్టవశమున మూఁడుదినములలో నింతటి రహస్యమును మనము భేదింపఁగలిగితిమి. దైవసాహాయ్యము మనపట్ల సంపూర్ణముగానున్నది.

శచీ—ఇదియంతయు మీ చాకచక్యమును మీబల సాహసములును జేసిన రహస్యభేదనము.

మనో—తండ్రీ! మీయల్లుని పలుకులత్యంత సత్యములు. నిశ్చయముగా మీరు భగవంతుని వంటివారు.

దేవే—(తనలో) ప్రథమ సందర్శనముననే మనోరమా శచీంద్రులకు గాఢానురాగము హృదయములఁ బరివ్యాప్తమయినది. ఇట్టి యనురక్తదంపతులకు వివాహమతి శ్రేయస్కరమయినది. (ప్రకా) మీరిటువలె నన్నింతగా భూషించుట వాకిష్టముగాదు, ఏలయన, దైవసాహాయ్యము లేక మానవప్రయత్నము ఫలింపఁగలదా?

శచీ—కొంచెము సేపు మీ మాటయే యంగీకరింతును. పనియంతయుఁ బూర్తి చేసికొని వచ్చితిరా?

మనో—(సిగ్గుతోఁ దలవంచుకొని) సంపూర్ణముగా మీ మామగారు కార్యమును బూరించినారు కాని—చాలవఱకును సొమ్ము జామల హరించినది.

శచీ—(అర్థోక్తి యందేనవ్వి) హరింపనిమ్ము, మనకది దొరకకపోదు. మనమదృష్టవంతులముగదా!

దేవే—17 క. అనుపత్రి సంపుటము నినుపపెట్టినుండి తీసితిని. దానిప్రకారము చరరూపమైన సంపద చాలవఱకు లభింపలేదు. ఇఁక మనమందఱమును బద్మపుష్కరమునకు...మనమందిరమునకుఁ బోవుదము.

(ఒక రక్షకభటుఁడు ప్రవేశించును)

భటు—మహాశయా! నమస్కారములు. (నమస్కరించును)

దేవే—ఏమోయీ, నీ విక్కడివాఁడవేనా? నన్నెఱుఁగుదువా?

భటు—చిత్తము ఎఱుఁగ కేమి?

దేవే—ఇన్ స్పెక్టరు రామకృష్ణముఖర్జీ నేఁటియుదయ మెనిమిదిగంటల కిక్కడికి రాఁగలఁడు, నీవిక్కడఁ గాఁచికొని యుండుము.

భటు—చిత్తము మీ యానతిచొప్పునఁ జేసెదను!

(అందఱును నిష్క్రమింతురు)

పంచమాంకము సమాప్తము.

## రంగము - దేవేంద్రుని యాలోచనామందిరము.

(ప్రవేశము, కుర్చీపైఁగూర్చుండి)

దేవే—(తనలో) కాలమంతయు భయంకరమై యున్నది. దినదినగండము - నూరేండ్లాయువు. ఈయుద్యోగమునఁ బ్రవర్తించిన యెంతటివారలకును నాపదలు తప్పకున్నవి. కొందఱు మరణముఁ బొందుచున్నారు. కొందఱు కీర్తియు ధనమును బ్రజాబహుమానమును బొందుచున్నారు. ఏఁడేండ్లనుండియు నీయుద్యోగమునఁ బనిసేయుచునే యుంటిని. అదిమొదలు ప్రభుత్వమువారరిందమపాళయునితోఁబాటు నన్నుఁగూడ నిట్టి విషమసంకటగర్భితాపరాధపరిశోధనలకుఁ బురికొల్పుచున్నారు. అదృష్టవశమున విజయమందుచునే యున్నాను... మూఁడు వత్సరములనుండియుఁ జెక్కుడుములు గుడుచుచున్న మనోరమ యిప్పటికిఁ దనధనమును బొందఁగలిగినది. మనోరమాశచీంద్రుల హృదయములందు గాఢానురాగముద్భవించినది. కనుక నిరువురకును వివాహమొనర్చినచో శుభకరము... ఇరువదేండ్లు వచ్చియు మనోరమ యింతవఱకు నవివాహితయైయుండుటే యంతగ బాగుగలేదు. అందును దల్లి లేదు- తండ్రి లేఁడు- తోఁబుట్టువులు లేరు. ఎటుజూచినను నాధారను దిక్కు లేక యిట్లుండుటమాత్ర మేమిసౌభాగ్యము. ఏమతముఁ జూచినను సంతయు వర్ధాన్నముగ నేయున్నది. ఎవరికివారు మామతమే యెక్కుడను దురభిమానము నొందియున్నారు. ఇరువదిసంవత్సరముల వయస్సువచ్చియు మనోరమ యిట్లుండుట నామనసునకుఁ గష్టముగ నున్నది.

రేవ—(ప్రవేశించి) నాథా! యేమాలోచించుచున్నారు? మీయాలోచనల కొక యవధి లేకున్నదే!

దేవే—(నవ్వి) ప్రియసతీ! మెడమీఁదఁ దలయున్నంత వఱకును, నోడలఁ బ్రాణములున్నంత వఱకును, మనమేదియో చేయుచునే యుండుదుము. నీవు నదేమియు జేయకపోయిన నిక్కడకు రాఁగలవా?

రేవ—నేను నాలోచించుచునే యున్నదానను. నామనసుమాత్రమూరకుండునా?

దేవే—ఏవిషయమై యాలోచించుచుంటివి?

రేవ—మీవిషయమయిమాత్రమే.

దేవే—నీమనసెప్పుడును నామీఁదనే యుండును. లేకున్నచో నిపుడిక్కడికేల వచ్చెదవు?

రేవ—శచీంద్రుని విషయమయి మీతో మాటాడుటకు. ఏమనిన, శచీంద్రుఁడిప్పు డిరువదియేండ్లవయసున్న నవ్వాఁడుగదా. అతనికింకను వివాహము చేయ నాలోచింపరైతిరేమి?

దేవే—(తనలో) ఇరువురకు నొకేసమయమున నొకే తలఁపు కలిగినది. (ప్రకా) ఏమి చేయుదును? ఇంతవఱకుఁ గన్యయొక్కడను గనఁబడుటలేదు. నేనును బ్రయత్నింపలేదు. నమ్మదిమీఁద విచారింతము లెమ్ము! నీవైన నొకకూతు రును గన్నదానవు కావు.

రేవ—(నవ్వి) మనయింటనే యున్నదికాదా?

దేవే—(సందేహముతో) మనోరమయా? ఆమెయిష్టపడునా? ఏమో. అంతవఱకు నమ్మఁజాలను.

రేవ—ఉభయులకుఁ బ్రేమము కుదిరినది. ఎట్లన—

మ॥ పనియున్నట్టులువచ్చి చూచుచు, మనో ♦ భావంబు దెల్లంబుగా
కనికిం జేయుచు, సిగ్గుపెంపునను నే ♦ వోపల్కఁగాఁబోయి, డాఁ
చినయుల్లాచు, మొగంబుగంద, నొడలన్ ♦ స్వేదంబుబిందింప, నం
దుమునింపుంచిరుగున్ మనోరమ(యా)శచీం♦ద్రుండాదటంజూచుచున్

దేవే—(ఆనందముతో) బాగుబాగు. చక్కఁగాఁగనిపెట్టితివి. నీతండ్రి జానకీబో సునింట నీవుండినప్పుడు, మనప్రథమసందర్శనము జ్ఞప్తికిఁదెచ్చితివి.

చ॥ జలజదళేక్షణా! తలుపు ♦ సందులనుండియుఁ దొంగిచూచి, లో
పల నెవరెన్నిపిల్చినను ♦ బాయక, యేనెదుటం గనంబడన్!

గులుకుచు, నెట్టులో తొలఁగి ♦ కొంచు మనోజ్ఞకలస్వనంబుతోఁ
పిలిచితి. వల్కరించితివి. పేరిమిడి న ♦ న్యల బిల్చునట్లుగన్॥ 2

రేవ—(సిగ్గునఁదల వంచికొని) ఆర్యపుత్రా!

ఉ॥ లెం; డీకఁజాలుఁ; దీవఁగడ ♦ లించిన డొంకయు రేఁగినట్లు, మీ
గండుఁదనంపుఁబల్కు తొలి ♦ కాలపు ముచ్చటలెల్లఁ దెచ్చె; నిం
కొండనరాదు మీయెదుట; ♦ నూరక నోటికిఁదల్పువైచిన
ట్లుండుటమేలుగాక మిము ♦ నొక్కరి మాటల గెల్వవచ్చునే? 3

దేవే—(నవ్వి) అట్లనుము. నాకదియే కావలసినది. సర్వ భాషణములు క్రమాను నోదకములనుమీ! ప్రియతమా! నీవిక్కడికి వచ్చిన కొలఁదినేపునకే నాశ్రమమంతయు వసనయింపఁబడినది. అట్లయిన మనోరమ శచీంద్రుని వరించుననుమాట నిశ్చయమేనా?

రేవ—నిశ్చయమనియే నాయభిప్రాయము. అందును మనయెడ నామెకెంతయో భక్తియున్నది. మీరు ప్రస్తావించినచో బాగుగ నుండును.

దేవే—నేనెందులకు? ఆమె యభిప్రాయము నీవే నెమ్మదిగ బయటికి లాగుము. పాము కాళ్లు పామునకే యెఱుక. ఆడువారి రహస్యము లాడువారికే యెఱుక. (తెరవైపునకుఁ జెవియొగ్గి) ఎవరో వచ్చుచున్నారు. నడకనుబట్టి శచీంద్రుడనుకొందును. శచీంద్రుఁడు మనవాఁడే కనుక నతని నడుగ నక్కఱలేదు. పొమ్ము! అత్తా మామా రాత్రింబవళ్ళు రహస్యము లాడుకొనుచున్నారనుకొనును.

రేవ—పోయి మనోరమతో మాటాడెదను. (నిష్క్రమించును)

శచీ—(ప్రవేశించి) మామా! రామకృష్ణముఖర్జీగారిని జూచివచ్చితిని.

దేవే—ఆయన యేమన్నారు?

శచీ—నిన్న నమృతబజారున నొక యువతి యొకముసల్మాను యువకునితో మాటాడుచుండఁగా—

దేవే—(అర్ధోక్తియందే) అదియేజాణియువతి?

శచీ—మహాపద్మినీయ యువతి. దాని వెనుకనుండి యొకత్రాగుఁబోతువచ్చి పట్టుకొని, ఇది నాయుంపుడుకత్తె యని పెనఁగులాడినాఁడట.

దేవే—తరువాత—

శచీ—తరువాత వారిరువురుం బాహాబాహిఁ గచాకచిం బెనఁగుచుఁ దమ్ముఁ బట్టుకొనవచ్చుచున్న రక్షకభటులం జూచి పలాయితులైరఁట. ఆయిరువురకుం బోరాటము పెట్టిన యాయువతి యంతకుమున్నే పలాయిత యయినదఁట. అంతటిచక్కని యువతి నెందుంజూడమని రక్షకభటులన్నారు.

దేవే—ఆనందకుటీరముమాట చెప్పితివా?

శచీ—చెప్పితిని. పదిమంది రక్షకభటుల నానందకుటీరమునందు దాఁచియుంచుమని చెప్పితిని. ఆయన నిన్ననే నలుపురిని వెంటఁబెట్టుకొని కమీషనరుతోఁగూడ నచ్చటికిఁబోయిచూచి యాశ్చర్యము నొందినాఁడఁట. ఆయన యింతవఱకును మనరహస్యము బయటఁబెట్టియుండలేదు.

దేవే—అదియే మంచిది. చెప్పినను నష్టము లేదు.

సుబ్బ—(ప్రవేశించి దేవేంద్రునకొక యుత్తరమిచ్చును.)

దేవే—(ఉత్తరమును విచ్చిచూచి) సుబ్బా! నీకీయుత్తరమిచ్చినవా రెవరు?

సుబ్బ—ఒక తురకాయన - బలే అందం. ఇది మీకిమ్మని బేగిబేగి బండెక్కెల్లిపొయ్యాడు.

దేవే—మంచిది. నీవుపోయి జాగ్రత్తగానుండుము.

సుబ్బ—చిత్తం. (నిష్క్రమించును.)

దేవే—శచీంద్రా! యీయుత్తరముఁ జదువుము. (ఉత్తరము నిచ్చును.)

శచీ—ఉత్తరమును విప్పిచూచి తెల్లఁబోయి) మామా! ఈయుత్తరమునందలి సంతకమునుబట్టి మిగుల భయంకర పరిణామము జరుగునని తోఁచుచున్నది.

దేవే—భయమేల? మనప్రతిద్వంద్వియైన జూములయేకదా. అది యిప్పుడు మన శ్రీశ చంద్రునికంటెను దుర్బలమయిపోయినది.

శచీ—ఇదిగో చదువుచున్నాఁడను. వినుఁడు.

"ఈప్రపంచమున జూములా దేవేంద్రులిర్వురిలో నొక్కరేయుండవలయును"

"దేవేంద్రా! నీచిరశత్రురాలు జూముల యిప్పటికిని జీవించియేయున్నది. జూముల చరిత్రము నీకింకను సంపూర్ణముగాఁ దెలియదు. అరిందమునకును నీకుఁ దెలిసినంతయు తెలియును. ఏలయన, నాగురువును, నాప్రియతముఁడు నగు ఫ్రూల్ సాహేబు నరిందముఁడును నీవును బట్టికొన్నప్పుడు, ఇందుక మాత్రమే యామహాపురుషుఁడు నావిషయమై రొమింగించినాఁడు. కావున నీ నాచరిత్రము సంపూర్ణముగా మీకెవ్వరికిని దెలిసియుండదు. అదియెట్లుండె?"

"నీవును నేనును జిరకాల శత్రువులమై మచ్చుతమునఁ బెనఁగుచున్నారము. జూములచేసిన భయానకకృత్యములన్నియు నారులకు సంబంధించియున్నవి. కాని నీకెంతమాత్రమును సంబంధించియుండలేదు. అయినను నన్ను గెలువ వలయునునను నాసతో—నన్నుఁబట్టి బంధించి కారాగృహమునకైచి కీర్తిఁ గొనవలయునను నాసతో ననవసరముగ నీవు నాకడ్డమువచ్చుచుంటివి. 'ఎందులకు నిన్ను వేధింపవలయు' నని యింతకాలము నూరకుంటిని. "తుమి యించువారిఁగని చాలమివెట్టుదు" రన్నట్లు నేను నీవలన భయపడి దాఁగి యుంటి ననుకొంటివి. నీమరణము నీవే తెచ్చికొంటివి. ఇందులకు నేనేమి చేయుదును? అనుభవింపకతప్పదు."

మ॥ ప్రథితానందకుటీర సంపదలకుం బాత్రంబనైయున్న నా
వ్యథపాల్సేయ మనోరమన్ నిలిపి, మంద్భాగ్యంబు సర్వంబుదు
ష్పృథగత్వంబున దానికిచ్చితివి; పాపాత్మా! యింకఁ జూముకో
మ్మా! ధరిత్రిన్ భవదీయ జీతము రేపో మాపో కార్చెదన్॥౪

మఱియును,

శా॥ నీమేనల్లునకున్ మనోరమను సంధింపంగ నాసించి, నీ
వామూలమ్మున సర్వసంపదల కర్హత్వంబుఁ గాంక్షించి, యే

మేమిా చేసితినంచుఁ బొంగకుము; లోకైకస్థిరపౌర్షి ను
ద్దామస్ఫార కృపాణధార మిమ్ముమ్రింగెదం జీల్చి చెండాడెదన్ ॥ ౫

దేవే—(ఆశ్చర్యమునటించి) ఓరా! నేను మనోరమను నీకుఁ బెండ్లి చేయఁదలఁచితినఁట! ఇదియెట్లు గవ్పట్టినదో శచీంద్రా! చూచితివా దానిదుండగపుఁ బల్కు? ఈవిషయమున మీరిరువురునన్ననుసరింతురా?

శచీ—(సిగ్గుతో నవ్వి తనలో) ఇది నాకు మంచియుపకృతి చేసినది. (ప్రకా) మీరేమైన ననుకొనుఁడు. మీయిష్టము. ఇందుకు నాస్వతంత్రత మేమియు లేదు.

దేవే—చదువుము! తరువాత.

శచీ—(ఉత్తరముఁ జూచి) మామా! మిగులు మాటలు వచ్చుచున్నవి.

సీ॥ కాలభైరవుని యాభీలగర్జాధ్వనుల్,
విలయవేళలఁ గాని వినఁగఁబడవు
కాలాంబుదాలి కర్కశ ఘనస్తనితముల్,
విలయవేళలఁ గాని వినఁగఁబడవు
కాలాగ్ని విస్ఫులింగచ్ఛటచ్ఛటలవి,
విలయవేళలఁ గాని వినఁగఁబడవు
కాలభుజంగ ఫూత్కారసంబులు,
విలయవేళలఁ గాని వినఁగఁబడవు
తే॥ జామలసేయు భయంకరాత్యుద్రగర్జ
నములు దేవేంద్ర! రేవతీనాశమునకు
నీశచీంద్రుని నాశమునకు నీదు నాశ,
మునకు గాని వినంబడవనుట నిజము॥ ౬

ఉ॥ చెప్పినయంత సేయుటది చెల్లదె యెంతటివారికిన్? మిమున్
ముప్పలముంచి, మీహితులు ముందుగ భస్మము సేసి, పిమ్మటం
దప్పక నాదుసంపద ముదంబునఁ బొందెదఁగాక! కాఁచికొ
మ్మిప్పుడు మిమ్ముఁ జంపెదనొ యింటిటినుండియు వాగ్విశేషములన్ ॥ ౭

తే॥ జనుల వార్తలు సత్యేత • రములటంచు,
నొక్కనిముసంబు నశ్రద్ధ • నుండఁబోకు।
పిడుగులవి మీఁదుతలలపైఁ • బడును; మీకు,
సంఘమరణంబు మాట ని • శ్చయము సుమ్మ!॥౮

ఇట్లు నీచిరకతుర్రాలు,
జామిలియా.

దేవే—పరీక్ష చేసైన నున్నదా?

శచీ—ఇంక లేదు. ఈయుత్తరముఁ బట్టిచూడ జామిల మఱల నెదిరా? భయంకరకృత్యమునకు సాహసించునని తోఁచుచున్నది. తప్పక మనల ముప్పుతిప్పల బెట్టక మానదని నాయభిప్రాయము.

దేవే—నీకట్లే తోఁచుచున్నదా?

శచీ—అగును. అన్నింతపనియుఁ జేయఁగల మాయావినియే.

దేవే—అది మాయావినియే యగును. కాని, యదిమనకు శీఘ్రముగనే పట్టువడఁగలదని నాయూహ.

శచీ—నిన్నటిరాత్రి నానందకుటీరముననే మనము బంధించినయెడల నెట్టి సంకటము లేకుండెడిది. మఱల నొకవిశ్వప్రయత్నము సేయవలసి వచ్చినది.

దేవే—మనము పశ్చాత్తాపపడ నవసరము లేదు. అది మనకుఁ బట్టువడి తీఱును.

శచీ—మీ యీనిశ్చయమున నాకు నవ్వువచ్చుచున్నది.

దేవే—ఇంచుక ప్రయత్నించినచో సులభముగానే పట్టువడఁగలదు. విశ్వప్రయత్నము కూడనా?

శచీ—చాలధైర్యముతోఁ జెప్పుచుంటిరి. ఇది యెక్కడనుండునని మీసిద్ధాంతము?

దేవే—మనకుఁ జాలసమీపముననే—యీగ్రామముననే యుండవచ్చును. దాని వేసములకుఁ దగినన్ని మందిరములు గూడ నుండియుండును.

శచీ—ప్రకృతమునఁ గర్తవ్యమేమి?

దేవే—ఇప్పుడు మనము దానికొఱకు వెదకుటయే. మాఱువేసములతోఁ బోవలయును.

శచీ—నే నెక్కడకుఁ బోవలయును?

దేవే—బాలుగంజివైపునకుఁ బోయి యంతటను జాగ్రత్తగా వెదకుము. నేను పకు శభాగునకుఁ బోయి గంగాసేతువు వఱకును జూచెదను. అదియాడువేసములే కాక మగవేసములుగూడ వేయఁగలదు. కనుక జాగరూకుఁడవై మెలఁగవలయును. పొమ్ము నీయిష్టమువచ్చిన వేసముతోఁ బొమ్ము.

శచీ—నేనిందులకు సంసిద్ధుఁడనై యున్నాఁడను. (నిష్క్రమించును)

రేవ—(ప్రవేశించి) నాథా! మనోరమ తనయభిప్రాయమును జల్లఁగా జాఱవిడిచినది.

దేవే—అదియేమో నీవు జాఱవిడువరాదా!

రేవ—(నవ్వుచు) మనశచీంద్రుని గూఁడనే దానిమనసంతయు నున్నది. ఇఁకఁ బెండ్లిప్రయత్నము చేయుఁడు.

దేవే—జామల పట్టువడువఱకుఁ బెండ్లిసంగతి యటుంచుము. శచీంద్రుని కంతవఱకును జాలఁబనియున్నది.

రేవ—మీ యిష్టము. త్వరలోనే వివాహముచేసిన మంచిది.

దేవే—అట్లేచేయుదము. నాకుఁ దొందఱపనులున్నవి. ఇంతట మీరుజాగ్రత్తగా మసలుఁడు. జామల బ్రదికి యున్నంతవఱకుఁ గంటికిఁ గూర్కు రాకుండ నుండవలయును. పొమ్ము!

రేవ—మీ రెప్పుడు వచ్చెదరు?

దేవే—ఎప్పుడు వచ్చెదనో యెట్లుచెప్పెదను? రాత్రి కిరువురు రక్షకభటులు మీకు సాహాయ్యముగ నుందురు.

శేష—సరే. (నిష్క్రమించును)

దేవే—(తనలో) ఇఁక వేషాంతరధారినై పోరాదను. నలుకంకలను వెదకిపట్టుకొనిననే గాని మనమునకూఱటగలుగదు! మబ్బు చెప్పిన గుఱుతులనుబట్టి వారలే యీజాబు వ్రాసియుండును. కావున నదియెట్లయినను వారిఁ జిక్కకపోవదు.

తే॥ సాధుజన పీడనమునఁ బ్రశస్తిఁగాంచి ♦
తమకుఁ దోఁచుగఁ దులువల ♦ గుమినిగూడి
తిరుగు కష్టుల వెదకి వ ♦ ధింపవలయు
బాపమని సంశయింపక ♦ పాపులట్లు॥

(నిష్క్రమించును)



రంగము: జూమల శయనమందిరము

(శయ్యపైఁ గూరుచుండి జూమల విసరుకొనును)

జూమ—(తనలో) ఎట్లయినను, వానిని జయింపవలయును. ఫూలుసాహేబు చేతులకు స్వయముగా సంకెలలు వైచినవాఁడితఁడు; వానిపినప్రకారము చేసితీరవలయును. నాకనుచరుల లోపము లేదు. సామగ్రి లోపము లేదు. (కన్నులు మూసికొని జోగుచుండును.)

(తోటమాలివేషముతో నున్న దేవేంద్రుఁడు ప్రవేశించును.)

దేవే—(తనలో) పరమేశ్వరా! నాకు విజయముఁ బ్రసాదింపుము! ఎక్కడనుండి వెనుకపాటునవచ్చి ఖండించునో యని ప్రాణము లఱచేతనిడికొనియుంటిని. (జూమలను జూచి) అహా! శీఘ్రముగనే సందర్శించితిని ఇది నన్ను నిముసములో గుఱుతింపఁగలదు.

జూమ—(దేవేంద్రుని జూచి) (తనలో) వీఁడిప్పుడే నాచెంతకు రాఁగలిగినాఁడు. జూమల దురదృష్టమునకు మేర లేదు. కాలము వ్యత్యస్తమయిపోవుచున్నది

అయినను వీనికి బట్టువడుటకా జూమల జన్మించినది? (పరుపుక్రిందనుండి యొక కాగితపుఁబొట్లముతీసి నోటనుంచుకొనును.)

దేవే—(నవ్వుచు) తాటకా! శీఘ్రముగనే నీదరి చేరనయినది. నేను కృతార్థుఁడను. (జేబునుండి సంకెలలుదీసి) జూమలా! రాక్షసీ! ఇఁకఁదప్పించుకొనుము. (ముందునకు రాఁబోవును)

జూమ—దేవేంద్రా! ఒక్కయడుగు ముందటికి వచ్చితివేని యిఁక నీకుఁ దక్కను.

దేవే—నీనోటనుంచికొన్న పొట్లమున నేమియున్నది?

జూమ—విషము—కాలకూటము—హాలాహలము. దేవేంద్రా! జూమల బ్రిదికి యుండఁగా నీచే బంధింపఁబడు ననుకొంటివా?

దేవే—అంత సాహసమేల చేసితివి?

జూమ—ఏలయంటివా? నా స్వాతంత్ర్యముకొఱకు-నా శాశ్వత గౌరవరక్షణముకొఱకు తెలిసినదా నేనిక్కడనున్నట్లు నీవెట్లు కనిపెట్టితివి?

దేవే—ఎట్లుకనిపెట్టితినా? నీబండి వెనుకఁగూర్చుండి యిందునకువచ్చి నీకంటె ముందుగ దిగితిని.

జూమ—నీవింత కష్టించియు విజయము నొందఁజాలకపోయితివి.

దేవే—నిన్ను బంధించికొని పోయెదను.

జూమ—నా శవమును బంధించికొనిపోయెదవు. దేవేంద్రా! ప్రాణములతో నీకు జూమల దొరకదు నీవుకొంచెము దూరముననేయుండి నావలన వినఁదగినవి వినుము. కొన్ని నిముసములుమాత్రమే నీవు వినఁగలవు. ఆపై నానోటనుండి యొక్క మాటయైనను వెలువడదు. (వికటముగ నవ్వును)

దేవే—నీవృత్తాంతమును వినియెదను ఇష్టమున్నచోఁ జెప్పుము నీ పేరు శాశ్వతముగనుండఁగలదు.

జూమ—వినుము! (వికటహాసముతో) నీవంటి ప్రతిద్వంద్వికిఁ గాక యింకొక నీచునకుఁ జెప్పెదనా?

దేవే—వినుచున్నాను చెప్పుము.

జుమ—నేను ఫూల్ సాహేబు ప్రియురాలను నేను యవనకాంతను కావున నాము రణానంతరమున నాకు గోరీకట్టింపుము చెప్పినపిదప నాపై శత్రుత్వముఁ జూపవుగదా!

దేవే—తరువాత!

జుమ—కామరూపదేశమున నీశాన్యకోణమున నున్న కచ్చిమరాజ్యమున నేను జన్మించితిని తెలిసినదా?

తే॥ మురిపెములుగుల్కు రతనంపు • మొలకలట్లు
కడునమృతమొలుకు శీతాంశు • కళలయట్లు
వెలయుచుంద్రు మా దేశంపు వేలఁదులెందు
నట్టివారిందు మందున • కైన లేరు.॥ ఠా

దేవే—నిజమేయని యొప్పుకొనుచున్నాను తరువాత.

జుమ—ప్రయాగక్షేత్రమున జన్మించిన వినోదలాల చట్టోపాధ్యాయుఁడు ఫకీరు ఫూల్ సాహేబునామముతో మందులు సంపాదించుకొనుటకు మాదేశమునకు వచ్చెను అంతకుమున్ను మాదేశమునందలి సుందరయువకులెందఱో నాసౌందర్యమునకాసించి నావెనువెంటఁ గుక్కలభంగిఁ దిరుగుచుండెడివారు.

దేవే-(నవ్వి) అట్టియువకులనెల్లనీచోక్తులఁ దేల్చుట నీకుమంచిగఁదోఁచుచున్నదా?

జుమ—నీవెంతయో ధైర్యవంతుఁడవని నీయభిప్రాయము, కాని, ఆకాలమున నీవే నన్నుఁ జూచినచో నాపాదసేవకుఁడవై యుండెడివాఁడవు. అట్టియదృష్టము నీకుఁ గలుగలేదు. వినుము నేను మిస్మిజాతిదానను.

దేవే—నీవయసెంత?

జుమ—నీయీడు!

దేవే—(ఆశ్చర్యముతో) ఏమి? మఱప్పుడి యాతోండ్లా? నాకు నమ్మకములేదు.

జుమ—నన్మఱవా? జ్ఞప్తికిఁదెచ్చుకొనుము. షలాళోద్యాన మందిరమున నిద్దంపు వెన్నెలలో నీవు నన్నుఁజూచియుంటివి. ఇప్పటికేఁడేండ్లయినది. ఇప్పుడును జూచుచుంటివి ఏమయిన భేదముగలదా?

దేవే—(స్మృతినభినయించి) అవును.

తే॥ ఆమధుర మందహాసంబు, ♦ నమ్మనోజ్ఞ
వచనరచనయు, సౌసొంపుఁ, ♦ బతత్రిమందు!
జితిత్రితములైనయట్లు రా ♦ జిల్లుచుంటి
వతివ! ముదుసలితనము నీ ♦ కబ్బదయ్యె॥

జుమ—అట్టిలోకైక సుందరినగు నేను ప్రణయభారమునఁగ్రుంగి, ఫూలుసాహేబునకు నాయంతన నకు రాలనైపోయితిని, అతనియొద్ద ననేకములగు నాపధములు నేర్చుకొంటిని, అతఁడు నామనసునకు వచ్చినయొగఁడు. లోకాతీత చరిత్రుఁడగు ఫూలుసాహేబు నరిందముఁడును నీవును బట్టిచంపితిరి. ఆపగ సాధించుటకే నేనింతకాలనుండియుఁ బ్రయత్నించుచుంటిని. అప్పటి నా పేరు. ఫానమోతి, ఫూలుసాహేబు నన్నుముద్దుచేసి ఫూల్ బీబీ యనియు, జానల యనియుఁ, బిల్చుచుండెడివాఁడు, ఆసంగతి యంతయుఁ దలఁచుకొనినఁ గరుణారస ముప్పతిల్లి విస్మృతి నొందించును.

దేవే—తరువాత నీవు మఱలఁ బెండ్లిచేసికొనక పోయితివా? నీకెందఱు మగలున్నను గులకలంకము కాదుకదా!

జుమ—నీపోటు మాటలు నన్నేమియుఁ జేయవు, నేను మాజాతిస్త్రీలంత విషయలోలనుగాను, మాకు సౌందర్యమే ప్రధానము, సౌందర్యము నెట్టురక్షించుకొనవలయునో మాజాతి యువతులందఱకును దెలియును. కావుననే నా సౌందర్యమెంతకాలమునకును దఱుగకున్నది. ఈ సౌందర్యమే నాకు శరణ్యము! ఈసౌగసుందనమే నాసర్వజన వశీకరణమంత్రము!.

ఉ॥ ఊరకవేయుఁ బల్కులకు ♦ నోల్ల; జగంబున మర్త్యులెందఱు
న్నారలొ, వారలెల్లరును ♦ నాదుకటాక్షశరాళివిద్ధ హృ

త్సారను లౌదరంటయె ని; జంబు; మునీంద్రులకైన మోహపున్
భరముఁ గూర్తు; నీవొక యభాగ్యుఁడవౌట నెఱుంగవింతయున్॥

ఈ సొగసుం దినపు ముచ్చటలకే వశులై యెందఱో ప్రణయానలమున భస్మీభూతులైరి. కొందఱింకను ప్రేమానలమునఁ గ్రాఁగుచున్నారు. దేవేంద్రా సౌందర్య మెంతపని సేయుచున్నదో యెఱుఁగుదువా? చాలా నీవు మాటాడితివి. విషానలము హృదయమును గాల్చివైచుచున్నది.

దేవే—ఇంకను నీవేమైనను జెప్పఁదలఁచితివా?

జుమ—ఒక్క మాటయున్నది. నాయుత్తరము బాగుగఁ బఠించితివా?

దేవే—పఠించితిని. ఉత్తరమునుబట్టి శీఘ్రముగనే కోరకఁగలవని నిశ్చయించి ప్రయత్నించితిని ప్రయత్నము సఫలమయినది.

జుమ—అంతయు నేఁజేసిన ప్రతిజ్ఞావచనములనుగూర్చి యేమియాలోచించుకొంటివి?

దేవే—నీవేమియుఁ జేయఁజాలవనియే నిశ్చయించుకొంటిని.

జుమ—నాకుఁదగినంత గడువు లేకుండఁగనే నీవువచ్చితివి. అందువలననే బ్రదికియుండి చేయఁజాలకపోయితిని. చచ్చియైనను నా ప్రతిన నెఱవేర్చుకొందును.

దేవే—చచ్చినపిమ్మటనా? చచ్చినవారందఱు నేమిచేసెదరో నీవు నదియే చేసెదవు.

జుమ—నేను చేసిన వెనుక పిశాచమునై నిన్ను ముప్పుతిప్పలు పెట్టి మూఁడుచెఱువులనీరు త్రాగించెదను. నావాక్యము లసత్యములనుకొనకుము. నేనుపిశాచమునయినప్పుడు నీవునను గడగండ్లఁ గన్నాఁ జూచెదను.

దేవే—పిశాచము మనుష్యుని యెదుటఁ గనఁబడునా? ఆనమ్మకము నీకున్నదా?

జుమ—కనఁబడి తీఱును. నేను నిశ్చయముగా నమ్మితిని. ఒకపిశాచముతో ఘోరయుద్ధము చేసితిని.

(తెరలో నవ్వు)

జుమ—(విస్మయపడి) నీతో నెవరయిన వచ్చిరా?

దేవే— నేనొక్కఁడనే వచ్చితిని.

శ్రీశ—(ప్రవేశించి) నేనుగూడ వచ్చితి.

దేవే—నీ వెక్కడినుండి వచ్చితివోయి?

శ్రీశ— నేను జుమలతో అకుఁ దిరుగుచుఁ జవుకీలో దాఁగియుంటిని. మీరు దీని బండివెనుక నెక్కి వచ్చితిరి. నాకవకాశము లేమిచే నడచి బండిపోయిన జాడనుబట్టి వచ్చితిని.

జుమ—(తనలో) వీఁడు గూడ సామాన్యుఁడుగాఁడు (ప్రకా) ఓరీ! నీకు నావలన నెంతటియుపాయము సంభవించినదో యెఱుఁగుదువా? నీ వెందులకు వచ్చితివి?

శ్రీశ—ఎఱుఁగకేమి? ఎందులకు వచ్చితినా? నీవు పిశాచముతోఁ బోరాడితి వన్నందులకు; జుమలా! తాటిచెట్టెక్కువాఁడున్నప్పుడు, తలఁదన్నువాఁడు గూడ నుండును. నీవు కుముదినినిజంపి గోవింద తులసీదాసుల విరుపురను జూచుచుండఁగా, నీ దేవేంద్రుఁడే తలుపువైచి నిన్ను ప్రహసనరంగమునకుఁ గొనిపోయెను. అప్పుడు రేవతీ మనోరమలను నేనును శచీంద్రుఁడును దప్పించితిమి.

జుమ— శచీంద్రుఁడక్కడ లేఁడే!

శ్రీశ—అతఁడు కరీమ్‌అను పేరుతో బండివాఁడైయుండి, నీవు పిశాచమునుజూచి భయపడి మూర్ఛిల్లి స్మృతినొందినపిదప మాటాడినవాఁడే శచీంద్రుఁడు.

జుమ—దేవేంద్రా! నేను పిశాచముతో యుద్ధముచేయలేదా?

శ్రీశ—సన్నదుగుము. నవీనుని పిశాచవేషమును దేవేంద్రుఁడు ధరించెను. నవీనుని మృతకళేబరమును మేము దాచితిమి.

(తెరలో)

"నిజమే నిజమే"

శచీ—(పాశ్చాత్యవేషముతో ప్రవేశించి) నిశ్చయము చెప్పుచున్నాను. జామలా! యింకదాఁచు టెందులకు? దేవేంద్రవిజయుఁడే యావేషము వైచికొని నిన్ను భయపెట్టెను.

జామ— నేను పిశాచముతోఁ బోరాడకుంటినేని నాపిస్తోలుగుండ్లయెదుట దేవేంద్రుఁడు నిలువఁగలఁడా? వట్టిమాట.

దేవే—నీవక్కడికి వచ్చుటకుముందే, యాపిస్తోలులోని గుండ్లను దీసివైచి వట్టి తూటాలు నింపితిని. క్రోధావేశముచే నీవు తెలియఁగక యది పేల్చి, భయముచే మూర్ఛిల్లితివి. తరువాత నేను నీకుఁ గనఁబడలేదా? ప్రత్యక్షముగ మాటాడలేదా?

జామ—(తనలో) చాలాగాభరా పడిపోయితిని. ఎంతమోసము జరిగినది? (ప్రకా) అయినను నేనుజచ్చి పిశాచమునయి నిన్ను బాధించి తీరెదను. గడువు మీఱినది. ఇఁక మాటాడఁ జాలను. ఆయాసము—మంట—మితిమీఱి పోవుచున్నవి. ఈ కాలకూట దావాగ్ని నా ప్రాణములను భస్మము సేయుచున్నది. జాగ్రత్తగ నుండుము. పదేపదే చెప్పుచున్నాను. నేను—నిన్ను—బాధింపక మానను. కానిచో—నా పేరు—శ్రీమతి—జామల కాదు. (క్రిందఁబడి తన్నికొని) తాపముచే—కాలుచున్నాను. మంటలచే—భస్మ—మగు—చున్నాను—జాగ్రత్త! జాగ్ర—జా—(కనులు మూసికొని చనిపోయినట్లు పడియుండును.)

దేవే—పాపము ఇది యాలోకమును విడిచిపోయినది.

శచీ—దీని మరణమునకు విచారమును, దీని హింసలకు విపాదముగలుగుచున్నది.

దేవే—నిశ్చయముగ నిది చనిపోయెనని నమ్ముటకు వీలులేదు. (జామల శరీరము స్పృశించి) పూర్తిగాఁ జనిపోయినది. దీనికి గోరీకట్టింపవలయునఁట. చచ్చియు సాధించెదనని చెప్పినది. శ్రీశచంద్రా! యేమిచేయుదము?

శ్రీశ— ఈపాపాత్మురాలు మరణించినది గావున, గోరీకట్టించుటయే యుత్తమము. ఇంతకన్న మనము చేయవలసినది లేదు.

దేవే—అయినను దీని గోరీవిషయమయి యొక కన్ను వేసి చూచుచుందుము. తగిన రక్షకభటుల నిచ్చటికిఁబంపి కర్తవ్యమును నెఱవేర్పింతము పోవుదము రండు!

(ముగ్గురును నిష్క్రమింతురు)

(రంగము — దేవేంద్రుని మందిరము)

(ప్రవేశము దేవేంద్ర, శచంద్ర, శ్రీశచంద్రులు)

దేవే — శచీంద్రా! నీవు మమ్మెట్లు కలిసికొనఁగలిగితివి?

శచీ — నేను బాలుగంజి ప్రాంతమును శోధించి తిరిగి బండ్లునిలుచు చోకమునకు వచ్చుచుండ శ్రీశచంద్రుఁడు పరుగుపరుగున బజారభాగమునకుఁ బోవుచుండెను. ఏదియో చిత్రముండవచ్చునని నేనును వచ్చి మీ విషయమై గామిశెట్టినడిగి తెలిసికొని మీవద్దకుఁ జేరితిని.

దేవే — కార్యదీక్షయు బుద్ధిచతురతయు నిట్లేయుండవలయును. ఒకరెఱుఁగకుండ నొకరుగా నొక్కచోట్కి కొక్కకార్యమునకే వచ్చితిమి.

(అరిందముఁడును రేవతీ మనోరమలును సుబ్బును ప్రవేశింతురు)

దేవే<br>శచీ<br>శ్రీశ } — (అరిందమునకు నమస్కరింతురు)

అరిం — ఆయుష్మంతులరగుదురుగాత. (అందఱను లేవనెత్తును.)

దేవే — మీ యాశీర్వాదబలమునఁ గృతార్థుఁడనైతిని.

అరిం — భగవంతుఁడు మనయెడల ననుకంప వహించియుండఁ గృతార్థులముగాకేమి? రామకృష్ణముఖర్జీగారు వచ్చువేళయయినది.

దేవే — వృత్తాంతమంతయు వినియుందురు.

అరిం — రేవతీ మనోరమలే చెప్పిరి. నీ ప్రతిన నెఱవేర్చుకొంటివి.

దేవే — తామెప్పుడు దయచేసితిరి?

అరిం — మీరిక్కడనుండిపోయిన యించుకసేపునకే వచ్చితిని. అదృష్టులు చావనైనఁ జత్తురుగాని యురికంబమునకెక్కరు. (శ్రీశచంద్రునిఁజూపి) ఈతఁడెవరు

దేవే—ఈయూరివాఁడే. శ్రీశచంద్రరాయలు, చాలబుద్ధిమంతుఁడు. ఈమూఁడు దినములనుండియు మాకెంతయో సాయ మొనర్చినవాఁడు. వృద్ధిలోనికి రాఁదగినవాఁడు.

అరిం—ఇతని నూతనముగ విడిచిపెట్టక దేశోపకారినిగ మనము వృద్ధిలోనికిఁ దేవలయును. మనమే కాక ప్రభుత్వవారును నితని నీసందర్భమున గౌరవింపవలయునని నాయభిప్రాయము. జనుల చనిపోయియుండు ననుకొందును.

దేవే—నిజమే. బ్రతికియుండి న్యాయస్థానమున కెక్కకపోయినది.

అరిం—అది యొకమందని వారియభిప్రాయము. అప్పుడు పూలుసాహేబును నిప్పుడు జామలయుఁ జెఱసాలకుఁ జేరకుండఁ దప్పించికొనిరి. ఎట్లయినను వారిలోకమున నుండకపోవుటే మనకును, దైవమునకును, లోకమునకును గావలసినది

(రామకృష్ణముఖర్జీ ప్రవేశించును.)

(అందఱును నమస్కరింతురు).

రామ—ఇటనున్న పురుషులందఱును బునఃపోత్తమాంశమున జన్మించినవారలు. కావున మీరుదలంచిన కార్యము లమోఘములుగ, నిర్విఘ్నములుగఁ గొనసాగుచున్నవి. భగవంతుఁడు మీకుఁ జిరాయురైశ్వర్యాది సకలశ్రేయములు నొసంగుఁగావుత.

దేవే—పవిత్రహృదయులరగు మీపలుకులు సత్యములగుఁగావుత.

అరిం—దేవేంద్రా! రేవతిని నేనే నీకిచ్చి వివాహ మొనర్చితిని. అట్లే మనోరమను శచీంద్రునకు మీరిచ్చి వివాహము చేయుఁడు. ఈనా యభిమతము దీర్పుము.

దేవే—మీయాజ్ఞ కెప్పుడును సంసిద్ధుఁడనైయున్నాఁడను.

రామ—అట్లుండుటయే నాకుఁ గావలసినది.

దేవే—(శచీంద్రుని చేయియు మనోరమ చేయియుఁ గలిపి) రామకృష్ణముఖోపాధ్యాయా! అరిందమబాబును మీరును నీనూత్నదంపతుల నాశీర్వదింపుఁడు.

రామ—అనయోర్దంపత్యోః ఐశ్వర్య సిద్ధిరస్తు. చిరాయురస్తు. పుత్రపౌత్రాభివృద్ధిరస్తు.

అరిం—అనయోర్దంపత్యోః సకలాభీష్ట సిద్ధిరస్తు.

దేవే—నాకు సంతానము లేకున్నను కుమారునివలె శచీంద్రుని ప్రేమతోఁ బెంచితిని. మనోరమను జూచినప్పటినుండియు నాకు వాత్సల్యమధికమైయుండెను. ఇట్టి యుభయులకును ననురాగమంకురించినది. మనోరమకు సంబంధించిన సర్వసంపదలును ననుసంధింపంబడినవి. ఇఁక మీఁదట శచీంద్రుఁడు నా యైశ్వర్యమునకును మనోరమైశ్వర్యమునకును స్వామి కాఁగలఁడు. మన శత్రువులందఱును నశించిపోయిరి. ఇఁక మాకుఁ గావలసిన దేది?

అరిం—అయినఁ నిట్లగుఁగావుత.

ఉ॥ భారతదేశసంపదలు భవ్యములై కొనసాగుఁగాత! యీ
భారతఖండవాసుల కపారయశంబు లభించుఁగాత! యే
కూరులు లేక సాధుజన కోటి సుఖంబున నుండుఁగాత! వి
స్ఫారదయాపయోధి భగవంతుఁడు దేశముఁ బ్రోచుఁగావుతన్ ॥౧౦

రామ—తథాస్తు.

(అందఱును నిష్క్రమింతురు)

గద్య:—

ఇది శ్రీమన్మహాదేవ కరుణారస తరంగితరంగదపాంగ ప్రసార
సంపాదితానవద్యకవితాపవిత్ర గార్గేయగోత్ర చినవరస
రాజ ప్రధానపౌత్ర శ్రీరామమంత్రి పుత్ర శేష
మాంబా గర్భశుక్తిముక్తాఫల విబుధవిధే
య సూర్యనారాయణాభిధేయ ప్రణీత
మనోరమా నాటకంబున సర్వం
బును సంపూర్ణము.



